# చతుర

నవంబరు 2016
రూ. 15/-



డయానా పెంటి
సౌందర్య రహస్యం ..122

డబుల్ ధమాకా!

* శీలా సుభద్రాదేవి నవలిక
నీడల చెట్టు .... 06
* పంజాబీ జానపద నవలిక
మీర్జా సాహిబా .... 65

వారెవ్వా!



# ప్రకృతికి ప్రతీక!

ముప్పైఐదు అడుగుల ఎత్తున్న ఈ శిల్పం పదహారో శతాబ్దం నాటిది! పంచ భూతాత్మకమైన ప్రకృతికి ప్రతీకగా ఇటలీ శిల్పి గియాంబోలోగ్నా దీన్ని రూపొందించారు! ఇటలీలో ఫ్లోరెన్స్‌లోని ప్రాటోలినో పార్కులో ఉందీ అద్భుత శిల్పం. 'కోలస్ ఆపెన్నైన్'గా పిలిచే ఈ శిల్పానికి మరో ప్రత్యేకత ఉంది. ఈ శిల్పంలో అనేక గదులు, ఫౌంటెయినులే కాక అలరించే మ్యూజిక్ సిస్టమ్ కూడా ఉండడం విశేషం! శిల్ప శిరోభాగంలో చలి కాచుకునేందుకు ప్రత్యేకంగా ఫైర్ రూమ్ ఉంది. ఆ రూములో మంటలు వస్తున్నపుడు శిల్పం ముక్కు భాగంలో నుంచి పొగలు వస్తుంటాయి!

# మనసున ఉన్నదీ...

★ చిరునవ్వులు వెదజల్లుతున్న చిన్నికృష్ణుని ముఖచిత్రంతో వెలువడిన 'చతుర' అక్టోబరు సంచిక ఆనందడోలికల్లో ఊగించింది. మణి వడ్లమాని నవల 'జీవితం ఓ ప్రవాహం' చాలా బాగుంది. పేరుకు తగినట్లుగా ఉంది. విడువకుండా చదివించింది. శివసుబ్రమణ్యాం 'నాగలమ్మ' కథ స్ఫూర్తిదాయకంగా ఉంది. 'చిటికెలో రుచిగా..' శీర్షిక ఈ మాసం నోరూరించే పదార్థాలు అందించింది. వెంటనే తయారుచేసుకొని చవిచూశాం. చాలా బాగున్నాయి. 'చిట్కాలక్ష్మి' గారి చిట్కాలకు అభినందనలు.

*– కరణం శివానందరావు,* కర్నూలు

★ చిలిపికృష్ణుడు ముఖచిత్రంగా వచ్చిన 'చతుర' ఎంతో ఆకర్షణీయంగా ఉంది. 'వారెవ్వా'లోని హరిత సందేశం బాగుంది. మణి వడ్లమాని నవల 'జీవితం ఓ ప్రవాహం' చదువుతోంటే రాజమండ్రిలో విహరించిన అనుభూతి కలిగింది. నవల ఆసాంతం ఉత్కంఠగా సాగింది. రాధికా ఆప్టే సౌందర్య రహస్యం స్ఫూర్తిదాయకంగా ఉంది. 'కొత్తగాలి' కవితలు సరికొత్త ఆలోచనలు రేకెత్తిస్తున్నాయి.

*– పక్కి శ్రీదేవి, గంట్యాడ*

★ నవల ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. పెద్దకథ 'అభిమాని' బాగుంది. 'చతుర ప్ర.జ.' ద్వారా మాకు తెలియని ఎన్నో విషయాలు తెలుసుకుంటున్నాం. 'చతురంగం' మెదడుకు పదును పెడుతోంది. 'కొత్తగాలి' కవితలు బాగున్నాయి. 'వారెవ్వా!' అద్భుతంగా ఉంది. మంచిమంచి నవలలు, కథలు అందిస్తున్నందుకు సంపాదకులకు కృతజ్ఞతలు.

*– వై. కళ్యాణి,* డోర్నకల్

★ పెద్దకథ 'నాగలమ్మ' సంచికకు నిండుదనాన్నిచ్చింది. తన తండ్రిని మాయోపాయంతో రప్పించి, వధించిన విజయనగర రాజుకు బుద్ధి చెప్పిన సైనం అద్భుతం. మగమహారాజు అధికార దర్పం మీద సామాన్య సాహస వనిత ఆత్మాభిమానం, ప్రతీకారం గెలిచాయి. కథ ఆసాంతం ఉద్విగ్నభరితంగా సాగింది. శ్రీరామ్, గౌతమిల విచిత్ర విషాదాంత ప్రేమకథ ఇతివృత్తంగా సాగిన నవల 'జీవితం ఓ ప్రవాహం' హృద్యంగా ఉంది. అమెరికా కథ 'అభిమాని' ఆకట్టుకుంది. చలసాని ప్రసాదరావు గారిపై వ్యాసం బాగుంది. శాంతారామారావు, తులసీకృష్ణ గారి నవలలపై సమీక్షలు ఆసక్తిగా ఉన్నాయి.

*– కానాల ప్రేమలత, హైదరాబాద్*

★ 'జీవితం ఓ ప్రవాహం' నవలలో శ్రీరామ్, గౌతమి పాత్రలు మా గుండెల్ని పిండేశాయి. నవల ఆసాంతం హృద్యంగా సాగింది. శ్రీరామ్, బలరామ్, కృష్ణల స్నేహాన్ని గొప్పగా చూపారు. 'నాగలమ్మ' కథ కొత్త ఉదంతమే మాకు. రుద్రమదేవి, ఝాన్సీ రాణిలాంటి వారే పరిచయం కానీ వీరనారీ మణి 'నాగలమ్మ' ఇప్పుడే పరిచయమైంది. 'అభిమాని' విదేశీ కథ అయినా సాఫీగా సాగింది. చతుర ప్ర.జ., చమత్'కారం' బాగున్నాయి. తులసీకృష్ణగారి 'నత్తగుల్లలు'పై సమీక్ష ఆకట్టుకుంది. గాంధీగారి పలుకులు, 'కొత్తగాలి' జీవన సత్యాన్ని తెలుపుతున్నాయి.

*– ఎన్.వి.రమణి, హైదరాబాద్*

★ ప్రతివారి జీవితం ప్రేమతోనే మొదలవుతుంది. మొగ్గ నుంచి పూవై విరిసే క్రమంలో ఎన్నో భావ సంఘర్షణల నడుమ నిలదొక్కుకుని ఆ పుష్పమాలికను అలంకరించుకునే సామర్థ్యం అందరికీ అసాధ్యం. పరిమళభరితమైన మైత్రీ మకరందపు సుగంధాన్ని పంచిన నవలలోని పాత్రలన్నీ వేటికవే మేటియై నిలిచాయి. ధీరోదాత్త 'నాగలమ్మ' చక్రవర్తిని ఎదుర్కొన్న తీరు చాలా బాగుంది. మధ్యతరగతి జీవితాల్ని దర్పణంలో చూపించిన 'నత్తగుల్లలు'లోని ఆదిశేషయ్యలు అడుగడుగునా కనిపిస్తూనే ఉన్నారు. అభిమానం వెర్రితలలు వేస్తే ఎలా ఉంటుందో 'అభిమాని' కథ తెలియచేసింది. చలసాని ప్రసాదరావుగారి గురించిన విశేషాలు అందజేయడం బాగుంది.

*– పిశిపాటి శైలజాజానకి,* నవులూరు

సంపుటి -39,
సంచిక - 10
466వ సంచిక,
పేజీలు : 132,
నవంబరు 2016

# చతుర



అర్ధరాత్రి మణికి అకస్మాత్తుగా గుండె నెవరో నలిపేస్తున్నట్లయింది! ఊపిరి అందక ఉక్కిరిబిక్కిరి అయిపోయింది! గొంతు పెగలటం లేదు! నోటితోనైనా గాలి పీల్చుకుందామంటే చేతకాలేదు. మెల్లిగా లేచింది. నిలవలేక చతికిలపడింది! ఇంతలో భళ్లున వాంతి అయిపోయింది! ఆ అలికిడికి దమయంతి లేచింది.. తర్వాతేమైంది? ఆద్యంతం ఉత్కంఠగా సాగే శీలా సుభద్రాదేవి నవలిక **నీడల చెట్టు**

పేజీ.. 06




- ★ ముఖచిత్రం : నటి **కారుణ్య**
- ★ రెండో కవరు : **వారెవ్వా!**
- ★ చివరి కవరు : కుమారి **వచన**
- ★ పుస్తకాలంకరణ : **రాజు యాట**


e-mail: vipula.chatura@eenadu.net / vipula.chatura@gmail.com
Toll Free No: 18004258888 (Hyd)

✺ నవలావలోకనంలో..

స్త్రీ స్వేచ్ఛనే కాదు, స్త్రీ వాదాన్ని కూడా ఎన్నో దశాబ్దాల ముందుగానే నిర్వచించి, చర్చించిన **డా. పి. శ్రీదేవి కాలాతీతవ్యక్తులు**పై సమీక్ష. ఈ నవల ఆధారంగా 'చదువుకున్న అమ్మాయిలు' సినిమా రావడం విశేషం!

పేజీ.. 112

✺ కాలాతీతంలో..

ఒక వ్యక్తి చేతిలో కేంద్రీకృతమైన అంతులేని అధికారం ఎన్ని దుష్పరిణామాలకు దారితీస్తుందో, మానవాళికి పెనుశాపంగా ఎలా పరిణమిస్తుందో.. ప్రవహిస్తున్న లావాలాంటి వచన కవిత్వంలో గానం చేసిన **గాబ్రియల్ గర్సియా మార్కెజ్** నవల **ది ఆటమ్ ఆఫ్ ది పేట్రియార్క్** విశేషాలు. నియంతల స్వభావాన్ని నడివీధిలో నగ్నంగా నిలబెట్టిన అధిక్షేప కావ్యమిది! పేజీ.. 118



# నీడల చెట్టు

- శీలా సుభద్రాదేవి

**'పెళ్ళిచూపులు' అన్న మాట వినగానే సిగ్గుల మొగ్గయింది కౌసల్య. కథలు, నవలల్లోలా తనకూ జరిగినట్లు ఆ సన్నివేశాన్ని పదే పదే ఊహించుకుంది. రాత్రంతా అవే కలలు! తెల్లవారింది.. పెళ్ళివాళ్లు రానే వచ్చారు..! ఆ తర్వాతేమైంది? 'పెళ్ళి చూపులు' కౌసల్యకు ఏ అనుభవాన్ని మిగిల్చింది? ఆద్యంతం ఉత్కంఠగా సాగే నవలిక నీడల చెట్టు చతుర నవంబరు కానుక!**

"కౌసల్య రూములో లేదు.. ఎక్కడికెళ్ళింది? " నెమ్మదిగా అడిగినా గొంతులో కంగారు ధ్వనించింది.

వరండాలో కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్న ఇద్దరు వయోవృద్ధులు నన్ను ఎగాదిగా చూశారు.

"ఏమోనమ్మా! సాధారణంగా ఈ సమయంలో తోటలో మల్లెమొక్కల దగ్గర కూర్చుంటుంది. అక్కడే ఉండొచ్చు" అంది వారిలో ఒకామె.

"మీరు భారతిగారా? " ఆరాగా ప్రశ్నించింది రెండో ఆమె.

"అవునండీ! మీతో నా గురించి చెప్పిందా? " ఆశ్చర్యంగా అన్నాను.

"తన చెల్లెలి స్నేహితురాలు బాగా చదువుకుందని, రచయిత్రి అనీ చాలాసార్లు చెప్పింది. పత్రికల్లో మీ రచనలు మాకు చూపించి, తనకు కూడా రచనలు చేయాలని ఉందని అంటూ ఉండేది. అప్పుడప్పుడు రాత్రి చాలా సేపు రాసుకుంటూ కూచుంటుంది"

"ఇక్కడికి వచ్చాక ఎప్పుడూ లైబ్రరీలోనో, తోటలోనో పుస్తకాలు పట్టుకు కూర్చుంటుంది" ఒకరి తర్వాత ఒకరు చెప్పారు.

"అవును! కౌసల్య సంగతేనా? కబుర్లు చెప్పుకుందాం రమ్మన్నా ఆమె రాదు" అప్పుడే అక్కడికి వచ్చిన మరొకామె కూడా గొంతు కలిపింది.

నేనేమో వాళ్ళ సంభాషణల్ని పట్టించుకోకుండా విషయం తెలిపినందుకు ధన్యవాదాలు తెలుపుతూ, తోట ఎటుందో అడిగి అటువైపు దారితీశాను.

మల్లెమొక్కల పక్కనే ఉన్న సిమెంటు బెంచీమీద కూర్చొని ఆలోచనా నిమగ్నమయిన ఒకామెను చూడగానే నాకు గుండె



గొంతులోకి వచ్చినట్లయింది.

"కౌసల్యా..!" ఆమేనా? కాదా? అన్న సంశయంతో నెమ్మదిగానే పిలిచినా, ఆ పిలుపుకోసమే వేచివున్నట్లు చటుక్కున తలతిప్పి నా వైపు సంభ్రమంగా చూసింది.

ఆమె పక్కనే చతికిలపడి తన చేతుల్ని నా చేతుల్లోకి తీసుకున్నాను. స్నేహ ప్రవాహం ఒకరి కళ్ళల్లోంచి మరొకరి కళ్ళ

ల్లోకి, ఒకరి చేతుల్లోంచి మరొకరి చేతుల్లోకి నిశ్శబ్దంగా ప్రవహించుకుంటూ పోతోంది. ఇద్దరి మధ్యా మాటల్లేవు.

కొంతసేపటికి నేనే సర్దుకొని "ఎలా వున్నావు కౌసల్యక్కా? నేను రాసిన. వుత్తరానికి సమాధానమైనా ఇవ్వలేదేంటి? నిన్నెలాగైనా కాంటాక్ట్ చేయాలని అక్క చాలా ప్రయత్నించింది. తర్వాత నాకు ఆ బాధ్యత అప్పచెప్పి ఈ లోకంనుంచి నిష్క్రమించింది. అనుకోకుండా ఈమధ్య ఒక పెళ్ళిలో యశోదని కలిసినప్పుడు నీ అడ్రసు సంపాదించి ఉత్తరం రాస్తే సమాధానమైనా ఇవ్వలేదు" కాస్త నిష్ఠూరం తొంగిచూసింది నా మాటల్లో.

కౌసల్య కాసేపు ఏమీ మాట్లాడలేదు. అరవై ఏళ్ళకు పైగా జీవితంలో ఎదుర్కొన్న ఆటుపోట్లు మనసు మీద ముద్రలు వేస్తూనే ఉన్నాయి. సమయస్ఫూర్తితో ఎవరికి వారు తమని తాము తీర్చిదిద్దుకుంటే స్థిరచిత్తంతో నిలదొక్కుకోగలుగుతారు. ఆ జాడలు శారదక్క జీవితంలోనూ ఉన్నాయి. కానీ కౌసల్యక్క జీవితంలో నీలినీడలు తన ముఖంలో ప్రస్ఫుటమవుతున్నాయి.

చిక్కుముళ్ళు విప్పుకుంటూ ఆర్థిక స్వావలంబన సాధించిన నాలాంటి వాళ్ళలోనూ ఆ అలజడి తొంగిచూస్తూనే ఉంటుంది కదా! ఆలోచనల్లోంచి తేరుకొని ఆమెనే చూస్తుండిపోయాను.

"ఎలా ఉన్నావు భారతీ! నిన్ను చూస్తుంటే శారదని చూస్తున్నట్లుగానే ఉంది. నీ ఉత్తరం అందింది. శారద ఇక లేదని తెలిసి చాలా బాధపడ్డాను. నీ రచనలకింద ఫోను నెంబరు చూసి మాట్లాడాలని ఎన్నోసార్లు అనుకున్నాను. కానీ.." మరి మాట్లాడలేదు.

"కానీ.. మాతో మాట్లాడొద్దంటూ మీ నాన్నగారు పెట్టిన ఆంక్ష ఇంకా నీలో స్థిరంగానే ఉండి ఉంటుంది" కొంచెం కోపంగా అన్నాను.

"ఆహా..! అదికాదు.." అంటూ సర్దుకొని "పద భారతీ! రూముకి వెళ్దాం" అంటూ లేచింది కౌసల్య.

"ఇక్కడ చేరి ఎన్నాళ్ళయింది? మీ నాన్నగారు ఎప్పుడు పోయారు? దమయంతి ఎక్కడుంది?" ప్రశ్నల మీద ప్రశ్నలు దొర్లిపోయాయి.

ఒక వెలిసిపోయిన నవ్వు అక్క పెదాలపై పాకింది. "అన్నీ చెప్తానులే! నడు!" అంది.

"నేను ఒకరోజు ఇక్కడ ఉండొచ్చా?" సందేహిస్తూ అడిగాను.

"ఫర్లేదు! ఒకటి రెండు రోజులకి అనుమతి ఇస్తారు. నీ ఉత్తరం వచ్చాక, ముందే చెప్పి ఉంచాను" రూము తాళం తీస్తూ అక్క చెప్పింది. అక్కడే ఇంకా కబుర్లు చెప్పుకుంటున్న వృద్ధులకి పరిచయం చేయబోయింది.

"ఇందాకే పరిచయాలు చేసుకున్నాంలే" అని నవ్వుతూ అన్న నా మాటకి వాళ్ళు కూడా నవ్వారు.

ఆ రాత్రంతా ఇద్దరం చిన్నపిల్లలమైపోయాం. చిన్నప్పుడు రాజావారి తోటలోకి వెళ్ళి పొగడపూలు ఏరుకురావడం, పూలు వాడిపోయినా పుస్తకాల మధ్య దాచుకోవడం, శారదక్కా, నేనూ మా పెరట్లోని పచ్చి మామిడి కాయలు తెస్తే కౌసల్యా, వాళ్ళ చెల్లెళ్లూ మేమూ కలిసి వాళ్ళ డాబా మీద కబుర్లతోపాటు ఉప్పూకారం అద్దుకొని తినటం, స్కూల్లో మిగతా పిల్లలతో ఆటలూ, పాటలూ.. ఓహ్! ఎన్నెన్నో.. ఎంత చెప్పుకున్నా తరగలేదు. సుమారు నలభై ఏళ్ళ జీవితాలలోని షడ్రుచులూ ఆ రాత్రంతా మనసునూరిస్తూ మా మధ్యనే ఉన్నాయి. మాట్లాడుతూ మాట్లాడుతూ ఎప్పుడు నిద్రపోయామో తెలియలేదు.

రాత్రి సరిగా నిద్రలేక ఆలస్యంగా లేచాను. అప్పటికే అక్క నిద్రలేచి స్నానం

పూర్తిచేసుకుని మంచం పక్కనే కుర్చీలో కూర్చుని నా వైపే తదేకంగా చూస్తోంది.

"అయ్యో! లేపకపోయావా? " నొచ్చు కుంటూ లేచాను.

"నిన్న ప్రయాణం, రాత్రి కబుర్లతో అల సిపోయి గాఢనిద్రలో ఉన్నావని లేపలేదు' ' చిన్నగా నవ్వింది.

నిన్న ముఖం నిండా నీలినీడలు పరచు కొని విషాదమూర్తిలా కనిపించిన అక్క, ఇ వ్వాళ కాస్తంత తేరుకున్నట్లు కనిపిస్తోంది.

"పది నిమిషాల్లో తయారై వస్తాను" అంటూ బాత్‌రూమ్‌లో దూరాను.

నేను తయారై వచ్చేసరికి అక్క పర్సు, తాళాలు తీసుకుని లేచింది.

"ముందు డైనింగ్ హాల్లో టిఫిన్ తిన్నాక అన్నీ చూపిస్తాను" అంది.

టిఫిన్ తిని, కాస్త కాఫీ తాగిన తర్వాత ఆశ్రమం అంతా చూపించింది. దారిలో కనిపించిన వారందరికీ నన్ను పరిచయం చేస్తూ ఉత్సాహంగా ఉంది అక్క.

అంతా చూశాక తోటలోకి నడిచి, తనకి ఇష్టమయిన మల్లెమొక్కల దగ్గరికి తీసుకొ చ్చింది. తనతోపాటు నడుస్తూ "ఇక్కడెం దుకు చేరావు అక్కా? మీ తమ్ముడిదగ్గర ఉన్నావని విన్నానే" అన్నాను.

అక్క బదులు చెప్పలేదు.

మళ్ళీ నేనే "మీ తమ్ముడి ఇంటి సమీ పంలో ఆఫీసు పని వుండి మా వారు వె ళ్ళారు. యశోద యిచ్చిన అడ్రసు యిచ్చి, నీ గురించి చెప్పి, నిన్ను కలవమని పంపించాను. మీ తమ్ముడే నీ అడ్రసు ఇస్తే, ఉత్తరం రాశాను" వివరాలు తెలుసు కోవాలన్న కుతూహలంతో మొదలెట్టాను.

అక్క ముఖంలో అంతవరకూ ఉన్న ఉత్సాహం కాస్తా వెలిసిపోయింది. "ఇప్పు డవన్నీ ఎందుకులే భారతీ? తర్వాత చెప్తాను. అయినా జీవితం చివరి మజిలీకి వచ్చేసింది. ఎక్కడుంటే ఏముంది? " కంఠం నిస్పృహతో గరగరమంది.

"అదేంటి అక్కా? అరవై దాటితే అన్నీ

## కొత్తగాలి...

**మొక్క నాటితే సన్మానం**
**చెట్టు నరికితే చెరసాల**
**మహారణ్యాన్ని నిర్మిద్దాం**
**జనారణ్యాన్ని మేల్కొలుపుదాం!**

– బి. చంద్రశేఖరయ్య,
పలమనేరు, చిత్తూరు జిల్లా

అయిపోయినట్లేనా? నిజానికి మనసులో చైతన్యం ఉన్నన్నాళ్ళూ మనిషి నిత్యయవ్వ నుడే. విదేశాలలో ఎనభై ఏళ్ళవాళ్ళు కూడా వారికి చేతనైన పనిచేసి సంపాదిస్తూనే ఉంటారు. ఎక్కడివారి సంగతో ఎందుకు? ఇక్కడ మాత్రం రాజకీయ నాయకులూ, క ళాకారులూ వారి వారి వృత్తులలో చురు కుగా ఉండట్లేదా? " అన్నాను.

"వాళ్ళ సంగతి వేరు.." సాలోచనగా అంది.

"వాళ్ళేంటి? వీళ్ళేంటి? మన పనైపో యింది, ఇంకేం చేయలేం అని మనకి మనమే మెదళ్ళకి సజెషన్లు ఇస్తుంటే నిజం గానే ఏమీ చేయలేం. బి పాజిటివ్! సర్లే గాని నిన్ను కొన్నాళ్ళు నాతో తీసుకెళ్ళాలను కుంటున్నాను" అన్నాను.

"ఇప్పుడా? ఇంకోసారి వస్తాలే.." నసు గుతున్నట్లు అంది. చూస్తుండానే ఎండ తీవ్రత పెరిగేసరికి ఇద్దరం లేచి రూము వైపు నడిచాం.

మధ్యాహ్నం భోజనం అయ్యాక కాస్సేపు నడుం వాల్చేమిద్దరం. అక్క కళ్ళు మూసు కుందికానీ నిద్రపోలేదని అస్థిమితంగా కదులుతున్న శరీరమే తెలియజేస్తోంది. నేనేం మాట్లాడలేదు. రాత్రంతా సరిగా నిద్రలేదేమో మెల్లగా నిద్రలోకి జారుకు న్నాను. లేచేసరికి మూడు దాటింది.

"అక్కా! నేనిక వెళ్తాను. నువ్వు ఈలోగా ఇక్కడ రూము ఖాళీ చేయటానికి కావాల్సిన ఫార్మాలిటీస్ పూర్తిచేయి. నేను మళ్ళా వచ్చేసరికి నెల దాటుతుండొచ్చు. మా అబ్బాయీ కోడలూ వచ్చేవారం స్టేట్సు నుండి వస్తున్నారు. రెండు వారాలే ఉంటారు. వాళ్ళు వెళ్ళగానే నిన్ను తీసుకెళ్తాను. హైదరాబాదులో నాకు తెలిసిన సంస్థలు కొన్ని ఉన్నాయి. వాటిలో నీకు నచ్చిన పని చేస్తూ నీకు వచ్చిన పనులు వాళ్ళకి నేర్పిస్తూ అక్కడే ఉండొచ్చు" బ్యాగ్ సర్దుకుంటూనే ఆమె వైపు చూశాను.

'అప్పుడే వెళ్ళిపోతున్నావా?' అన్నట్లు చూస్తూ చిన్నపిల్లలా బేలగా తలూపింది. అంతలోనే ఏదో గుర్తొచ్చినట్లు గభాలున లేచి గోడకున్న బట్టల అల్మారా తెరిచి చీరల అడుగు నుండి ఒక లాంగ్ నోట్ బుక్ తీసి పేజీలు తిప్పుతూ "భారతీ! తమ్ముడి ఇంటి నుంచి ఇక్కడికి వచ్చిన దగ్గరనుండీ ఏ పనీ చేయటానికి తోచక మా ఇంటి విషయాల్ని కథగా రాశాను. నువ్వు చాలా ప్రశ్నలు వేశావు. సమాధానాలు ఎక్కడ నుంచి మొదలెట్టి చెప్పాలో తెలియలేదు. నీ సందేహాలన్నిటికీ సమాధానాలు ఇందులో దొరుకుతుండొచ్చు. నేను నీలా రచయిత్రిని కాను. కానీ సాధ్యమైనంత వరకూ ఒక పద్ధతిలో రాశాను. అందులో నీకు తెలిసిన విషయాలూ ఉంటాయి.." అంది మెల్లగా.

సంభ్రమంగా చూశాను.

"నిజమా! మన ఆలోచనలు, మనసులో ఉన్నవి కాగితం మీద పెట్టగలగటమే అసలు రచయిత్రి లక్షణం. మన బాధనిగానీ, దుఃఖాన్నిగానీ, సంతోషాన్నిగానీ అక్షరబద్ధం చేయగలిగినపుడు మనసూ, శరీరం తేలికై ఆరోగ్యంగా ఉంటాయి. అప్పుడే సాటి మనిషి జీవితంలోని సాధక బాధకాలు అర్థం చేసుకోగలుగుతాం" అన్నాను.

అక్కడ నుంచి బయలుదేరేముందు ఆమెకి మళ్ళీ గుర్తు చేశాను. "ధైర్యంగా ఉండు కౌసల్యక్కా! మనలో జీవచైతన్యం ఉన్నంతకాలం, మన మనసు మన నియంత్రణలో ఉన్నంతకాలం ఏదైనా సాధించగలం. నీకై నువ్వు నచ్చిన కార్యక్రమాన్ని కల్పించుకొని చూడు. నువ్వే ఆశ్చర్యపడేంత మార్పు వస్తుంది. మరిక వస్తాను" అంటూ అక్క చేతులను ఆత్మీయంగా ఒత్తి, ఆటో పిలిపించుకొని రైల్వే స్టేషనుకు బయల్దేరాను.

'అక్కా అక్కా అంటూ నాతోబాటు చిన్నప్పుడు ఆడుకొన్న ఆ పిల్లేనా నాకు పాఠాలు చెప్పేంతగా ఎదిగిపోయింది!' అని గాబోలు అబ్బురంగా చూస్తూ ఆలోచనలో పడినట్లు కౌసల్యక్క.

★ ★ ★

ఇంటికి వెళ్ళగానే బండెడు పనులు ఎదురొచ్చాయి. మరోపక్క కాలేజీలో సంవత్సరాంత పరీక్షలు దగ్గర్లో ఉన్నాయి. అబ్బాయివాళ్ళు వస్తారు కదా! ఆ ఏర్పాట్లు చేసుకోవాలి. మర్నాడు కాలేజీలో చేయాల్సిన ముఖ్యమైన పనులు గుర్తుచేసుకొంటూ, పిల్లలొచ్చినపుడు తీసుకోవాల్సిన సెలవు గురించి శ్రీవారితో చర్చించాను. ఈ నెలంతా సాహిత్యాన్ని పక్కన పెట్టాల్సిందే అనుకుంటూ మరొక బెడ్‌రూమును పనమ్మాయితో సర్దించాను.

అయితే ఎదురుచూసినంత సేపు పట్టదు. విదేశాలనుండి వచ్చేపిల్లలతో గడపటంగానీ, తిరగటంగానీ, కబుర్లుకానీ గడియారం ముల్లుని గిరగిరా తిప్పేస్తాయి.

వాళ్ళు వెళ్ళాక మళ్ళీ అన్నీ యథాస్థానానికి వచ్చి రోజువారి పనుల్లోకి పడేటప్పటికి, జరిగింది కలో? నిజమో? అనిపిస్తుంది. ఈ రోజుల్లో ఫేస్‌బుక్‌లు, వాట్సప్‌లు, చాటింగులు వచ్చాక ప్రత్యక్ష అనుభవాలకీ, గాడ్జెట్ల అనుభవాలకీ భేదమే లేకుండా పోయింది. ఒక స్పర్శానుభూతి మాత్రమే నిజమని గుర్తుచేస్తుంది.

**అ క్ష రం**

చిన్నారులు తడిపిన సిమెంటుముద్ద లాంటివాళ్ళు. వాళ్ళమీద పడే ముద్రలేవైనా సరే స్థిరంగా నిలిచిపోతాయి.

– హామ్ జినాటో,
పిల్లల సైకాలజిస్టు



రెండు వారాల హడావుడి తీరాక మళ్ళా తిరిగి కాలేజీకి వెళ్ళాలని గుర్తొచ్చి పుస్తకాల బీరువా దగ్గరికి వెళ్ళాను. టేబులు మీద పుస్తకాలన్నీ ఎక్కడివక్కడ సర్దుతుంటే ఆ రోజు కౌసల్యక్క ఇచ్చిన పొడుగు పుస్తకం కన్పించింది.

గభాలున దాన్ని చేతిలోకి తీసుకొని 'అయ్యో! అక్కకి మళ్ళా ఫోన్ చేయనేలేదు' అనుకున్నాను.

అప్పటికే రాత్రి తొమ్మిది దాటటంతో పడుకొని ఉంటుందేమోనని, ఉదయానే చేయాలి అనుకున్నాను. పిల్లలకు ఏర్‌పోర్టులో సెండాఫ్ ఇచ్చి తిరిగివస్తూ దార్లో టిఫిన్‌లు కానిచ్చేయటం వల్ల డిన్నరు పని తప్పింది. దాంతో మంచంపై బోర్లా పడుకొని ఆ పొడుగు పుస్తకం తెరిచాను.

★ ★ ★

కళ్ళల్లో పరాకును, మనసులో ఆలోచనలనూ టపటపా దులుపుకొని ఉలిక్కిపడి మళ్ళా అద్దంలోకి పరకాయించి చూసుకుంది కౌసల్య. నిజంగానే వెండితీగ పాపిట్లో మెరుస్తోంది. అద్దంలో చూసుకొంటూ జాగ్రత్తగా వెతికిపట్టుకొని లాగింది. చేతిలోని తెల్లవెంట్రుకని చూస్తూ యవ్వనానికి వీడ్కోలు పలుకుతున్నానా? అనుకుంది. వెలిసిపోయిన నవ్వు ఒకటి జాలిగా పెదాలమీద జారింది.

"ఇంకా కాలేదా అక్కా? 'వాళ్ళొచ్చే టైమయింది.. పరధ్యానం కట్టిపెట్టి వేగంగా తెమలమని' నాన్న ఇందాకట్నుంచి చిటపట లాడుతున్నారు" హడావుడిగా తండ్రి మాటలు చెప్పేసి మళ్ళా అంత హడావుడిగానూ వంటింట్లో అమ్మకి సాయం చేయటానికి వెళ్ళిపోయింది మణి.

'పరధ్యానం కాదమ్మా వరధ్యానంలోనే ఉన్నాను. పన్నెండేళ్ళ నుండి కూర్చుంటున్నా.. ఈసారైనా పరీక్ష గట్టెక్కుతానా? లేదా?' అనుకుంది కౌసల్య. ఇంకా ఆలోచన సాగేదేమో కానీ ముందరి గదిలో అలికిడి వినిపించి ఆలోచన కట్టిపెట్టి గబగబా జడల్లుకుంది.

ఇంతలోనే తల్లి కామాక్షమ్మ వచ్చి "ఇంకా చీర మార్చనేలేదా కౌసల్యా?" అంటూ తానే దగ్గరుండి మంచిచీర కట్టించి పెళ్ళిచూపులకు తగ్గట్టుగా తుదిమెరుగులు దిద్దింది.

"కామాక్షీ! అమ్మాయిని తీసుకురా" అన్న రామారావు పిలుపు విని కామాక్షమ్మ, కూతుర్ని లేవదీసింది. సంతలోకి తోలుకుపోతున్న పశువులా నిర్లిప్తంగా నడిచింది కౌసల్య.

పన్నెండేళ్ళ క్రితం కొత్తగా రంగుల ప్రపంచంలోకి గిరికీలు కొడుతున్నప్పుడు వెన్నెలని చూసినా, పూలని చూసినా పులకరింతలు కలిగే తొలి యవ్వనపు పొంగులో అందరిలాగే కౌసల్య కూడా తీయని కలలు కంది.

మొట్టమొదటి పెళ్ళిచూపుల అనుభవం ఇంకా నిన్న మొన్నటిదిలాగే గుర్తుంది కౌసల్యకు.

స్నేహితురాలి ఇంటికి వెళ్ళి వచ్చేసరికి తల్లీతండ్రీ తన పెళ్ళి విషయమే మాట్లాడుకుంటున్నారు. అకస్మాత్తుగా పెళ్ళిచూపులు ఏర్పాటు చేశారు. తనకు ఒక

వ్యక్తిత్వం ఉందనే ఆలోచన లేని కౌసల్య కేవలం పెద్దల చాటు ఆడపిల్లే!

పెళ్ళి చూపులనాడు శ్రద్ధగానే అలంకరించుకొంది. ఆపైన తల్లి కూడా సాయంచేసింది. ఆ రోజు ఏదో తెలియని భావం గుండెలనిండా పేరుకుపోయి బరువెక్కించింది. పెళ్ళివారు వచ్చేసిన అలికిడి వినేసరికి తన చెవులకు వినపడేంత గట్టిగా గుండెలు కొట్టుకున్నాయి. కాబోయే భర్త ముందుగదిలో కూర్చున్నాడనే భావంతో అదోవిధమైన పులకరింత శరీరాన్ని కదిలించింది. కాళ్ళు తడబడుతుండగా నెమ్మదిగా తల్లి వెనకే వెళ్ళి కూర్చుంది. సిగ్గుతో వాలిపోతున్న రెప్పల్ని బలవంతాన ఎత్తి చూసింది. ఆ కొద్దిపాటి సమయంలో పెళ్ళికొడుకు రూపం మనసులో ముద్రపడనే లేదు.

"మా అమ్మాయికి కొత్తవారి ముందు మాట్లాడడానికి బిడియం ఎక్కువలెండి" అంటున్న తల్లి మాటలకి ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది కౌసల్య. రాబోయిన నిట్టూర్పు లోపలే ఆగిపోయింది.

"ఇంక లోపలికి తీసుకెళ్ళండి" అన్న అనుమతి వచ్చాక బతుకుజీవుడా అనుకొని లోనికి వెళ్ళిపోయింది కౌసల్య.

సుమారు పన్నెండేళ్ళుగా అస్పష్టంగా మనసులో ముద్రితమైన ఆ రూపంతోనే కలిసి ఎన్నిసార్లు గగన విహారాలు చేసిందో, కిట్టుబాటుకాని కట్నానికీ, తన రూపానికీ లంకె కుదరక ఎన్నిసార్లు పైనుండి తోసి వేయబడినట్లయిందో కౌసల్యకి తరచూ గుర్తువస్తూనే ఉంటుంది. కొన్నిరోజులపాటు ఓ ముల్లు గుచ్చినట్లు బాధపడేది. తర్వాత మరో చూపులు, మళ్ళీ తర్వాత... ఇలా ఇంకా చాలా జరిగాయి. కొన్నిసార్ల వరకూ కౌసల్య మొదటిసారిలాగే కలలు కంది. కానీ తర్వాత్త ర్వాత మనసు రాటుతేలిపోయింది. ఇలా వచ్చిన ప్రతివాడి గురించీ కలలు కనటం కూడా ఒకరకంగా మానసిక వ్యభిచారమే అవుతుందేమో అన్న ఆలోచన వచ్చి అసహ్యం కూడా వేసి రానురాను నిర్లిప్తంగా మారిపోయింది.

కొందరికి నడక నచ్చదు. ఇంకొందరికి చదువు లేదని నచ్చదు. ఇంకా.. ఇంకా.. ఏవేవో నచ్చవు. అసలు ఈ నచ్చకపోవటానికి మూలకారణం కూడా తెలిసిందే.

ఈ నిజం తెలిసేసరికి చాలా ఆలస్యం అయిపోయింది. కౌసల్య జుట్టులో వెండితీగలు తొంగిచూడటం కూడా మొదలైంది.



## 2

గోడమీద పిల్లిలాంటివాడు రామారావు. అతనికి స్థిరమైన అభిప్రాయాలు ఉన్నాయనిపించదు. అప్పుడే మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన కొత్తరోజులు కావటం వలన ఒకరకమైన భావావేశం, అక్షర జ్ఞానం ఉన్న మనుషులందరిలో కనిపించేది. కులమతాలకు అతీతమైన అభ్యుదయ భావాల్ని వ్యక్తపరిచేవారు.

అందుకే అటువంటివారితో మాట్లాడే సమయంలో అభ్యుదయం గూర్చి అంత ఆవేశంగా మాట్లాడేవాడు. కానీ ఇంటికి సంబంధించినంతవరకు మాత్రం సనాతనాచార పరాయణుడే.

దానికి ప్రత్యక్ష నిదర్శనం.. ఏనాడూ భర్తకు ఎదురుచెప్పటం ఎరగని అతని భార్య కామాక్షమ్మ!

మొదటిసారి నెల తప్పిందని తెలియ

గానే "నాకు కొడుకే పుట్టాలి!" అన్నాడు రామారావు శాసించినట్లుగా. ఆ మాట విని కామాక్షమ్మ కళ్ళెత్తి భర్తని చూడటా నికే భయపడింది. 'కొడుకు కాకపోతే?' అన్న ప్రశ్న లీలగానైనా కళ్ళల్లో కదిలే సాహసం చేయలేదు. నెలనెలా గడుస్తున్న కొద్దీ కామాక్షమ్మకి భర్త మాట గుర్తొచ్చేది.

రామారావు స్కూల్లో ఉండగానే బావమ రిది వచ్చి ఆడపిల్ల పుట్టిందని చెప్పగానే ఓ నిమిషం మాట్లాడలేదు. కానీ అంతకు ముందే ఏదో విషయమై వచ్చి మాట్లాడు తున్న సహ ఉపాధ్యాయుడు కూడా దగ్గరే ఉండటంతో ముఖాన నవ్వు పులుముకొని "మా ఇంట లక్ష్మి పుట్టిందండీ" అన్నాడు, ఆయన అభినందనలు స్వీకరిస్తూ.

అత్తగారింటికి వచ్చిన రామారావుని, మామగారు చిరునవ్వుతో ఆహ్వానించారు. పాపని చూడటానికని పురిటి గదిలోకి వచ్చిన భర్త ముఖం చూడటానికి సంకో చించింది కామాక్షి.

అనుకోకుండా తర్వాత కొన్ని రోజులకే రామారావు హెడ్‌మాష్టరుగా ప్రమోష నుతో మరో స్కూలుకి బదిలీ అయ్యాడు. తోటి ఉపాధ్యాయులు 'పాప పుట్టిన వేళా విశేషం' అని అభినందిస్తుంటే 'నిజమే స్మీ!' అనిపించింది రామారావుకి.

ఓ సాయంత్రం రెండుమూడు గిలకలు, ఓ రెండు గౌను గుడ్డలు తీసుకొని వచ్చి పాపకి తెగ ముద్దులు పెట్టేస్తున్న భర్తని ఆశ్చర్యంగా చూసి తేలిగ్గా నిట్టూర్చింది కా మాక్షి. 'ఏమో అనుకున్నానుగానీ మంచి వారే. నిజానికి ఎవరికి మాత్రం మొదట కొడుకే పుట్టాలని ఉండదూ?' లోలోన అనుకుంది.

మళ్ళీ ఏడాదికే ఈసారి భర్త కోరిక తీర్చేద్దామని 'నీళ్ళు పోసేసుకుంది' కామాక్షి. ఎందుచేతనో కానీ ఈసారి నెల తప్పింది మొదలు ఆమెకి అనారోగ్యంగానే ఉంది. పురిట్లో చచ్చి బతికినంత పన యింది. కానీ ఏం లాభం? ఈసారీ ఆడ పిల్లే! పైగా అర్భకంగా పుట్టింది.

"పోనీలేవే! ఎలాగో గండం గడిచింది" అంటున్న భర్త కంఠంలోని గాద్గద్యాన్ని గుర్తించిన కామాక్షిమనసు కరిగిపోయింది.

కానీ చంటిపిల్లకేగాక కామాక్షమ్మకూడా రక్తహీనతవల్ల అనారోగ్యంతో లేవలేని పరి స్థితి ఏర్పడింది. చేసేవాళ్ళు లేక కొన్నిరో జులు తల్లిగారింట్లోనే ఉంది. తర్వాత పల్లె టూళ్ళో ఉన్న రామారావు మేనత్త వచ్చి కొన్నాళ్ళు సాయంగా ఉంది. చంటిపిల్ల మణికి రెండేళ్ళు దాటినా అర్భకంగానే ఉం డేది. కామాక్షమ్మ మాత్రం మెల్లమెల్లగా ఆరోగ్యం పుంజుకుంది. ఈ కారణాలన్నిటి వల్లా రామారావు కొంతకాలం కొడుకు కోసం మనసుని తొలిచేస్తున్న కోరికని బయటపెట్టలేకపోయాడు.

విశ్రాంతి తర్వాత చురుకుగా తిరుగు తున్న కామాక్షమ్మని చూసి రామారావు కోరిక మళ్ళీ బయటకు వచ్చింది.

విక్రమార్కుడిలా పట్టుబడుతున్న భర్త కోరికకి తలవంచింది కామాక్షి. ఫలితంగా మళ్ళీ దగ్గర్లోనే మరో చెంబుడు నీళ్ళు పోసుకోవలసి వచ్చింది కామాక్షికి. ఈసారి మూడోకాన్పు కావటంవలన పుట్టింటికి వెళ్ళలేదు. ఆమెకి భర్త తరపున పెద్దవాళ్ళె వరూ లేకపోవటాన తన తల్లినే సాయా నికి పిలిపించుకుంది.

రోజులు గడుస్తున్నకొద్దీ కామాక్షికి దిగులు పేరుకుపోతోంది. 'కడుపుతో ఉండగా గోరింటాకు పెట్టుకుంటే ఆడపిల్ల పుడుతుందట', 'గుమ్మంమీద కూర్చుంటే ఆడపిల్ల పుడుతుందట' - ఇలాంటివి విని వినీ అటువంటివేమీ చేయకుండా, ఏం చేస్తే మగపిల్లాడే పుడతాడో కనుక్కొని అవే చేస్తూ మగపిల్లాడికోసం వేయిదేవు ళ్ళకి మొక్కుకుంది. కానీ ఏ దేవుడూ ఆమె కోరికని తీర్చటానికి ముందుకురాలేదు. పుట్టిన పాపని చూస్తూ 'ఇంత యాతన

పడి కన్నందుకు పిల్లాడైనా కాలేదు' అని మాత్రం అనుకుంది.

ఆ సమయాన భర్త యింట్లో లేడు, ఇన్‌స్పెక్షను ఉందని స్కూలుకి వెళ్ళాడు. వార్త తెలియజేయటానికి పోబోతున్న తమ్ముడ్ని ఆపేసింది కామాక్షి.

"వద్దులేరా! ఎలాగూ సాయంత్రానికల్లా వచ్చేస్తారుగా! ఆడపిల్లేకదా, ఈ మాత్రానికి పరుగెట్టుకెళ్ళి చెప్పాలా ఏమిటి? " అంది.

సాయంత్రం వాకిట్లోనే తండ్రికి ఎదురెళ్ళి పెద్దపిల్ల కౌసల్య "నాన్నా మరేం, చిన్న చెల్లాయి పుట్టింది" అంది. సంబరంగా చెప్తున్న కూతురి మాట వినగానే హతాశుడై ముందు గదిలోని పడక్కుర్చీలో కొంతసేపు కూర్చుండిపోయాడు.

'కాళ్ళు కడుక్కొని పాపని చూడటానికి రమ్మని' పిలవబోయిన అత్తగారు అల్లుడి తీరుచూసి సాహసించలేకపోయింది. మరి కొంతసేపు చూసి "బాబూ! కాళ్ళు కడుక్కొని పాపని చూడు" తనకే వినబడనంత మెల్లగా చెప్పింది. అందరూ ఏదో జరగకూడనిది జరిగినట్లుగా గంభీరంగా ఉన్నారు.

అంతకుముందే అమ్మదగ్గరకు వెళ్ళబోతే "ఈ వెధవ ఆడమూకంతా పుట్టి నా ప్రాణాలు తీస్తున్నారు. అవతలికి పోవే" అని గసరటం, అమ్మమ్మ, మామయ్య ఎవరూ పలకకపోవటంతో అసలే బిక్కచచ్చిపోయిన పిల్లలు వాకిట్లో తండ్రికోసం ఎదురుచూశారు. తీరా తండ్రి కూడా వచ్చి గంభీరంగా ఉండిపోవటంతో దిక్కుతోచక ఓ మూల కూర్చుండిపోయారు పెద్దపిల్ల కౌసల్య, చిన్నపిల్ల మణి. అంత నిశ్శబ్దంలోనూ మధ్యతరగతి కుటుంబంలో ఆడపిల్లగా పుట్టడంలో గల సాధకబాధకాలు ఏమీ తెలియని పసిపాప ఏడుపు మాత్రం ఇల్లంతా వినిపిస్తోంది!

ఊహ తెలియని ఆ పసితనంలోనే తప్పతర్వాతర్వాత గొంతెత్తి ఏడవడం కాదుకదా పన్నెత్తి పలకనైనా పలకటానికి సాహసించలేకపోయింది ఆ పాప. మొదటి ఇద్దరికి లభించిన ఆ మాత్రం ముద్దుముచ్చట్లు కూడా పొందలేకపోయింది. కనీసం పేరుకూ నోచుకోక బుజ్జమ్మగా పెరిగింది.

"వరసాగ్గా ఆడపిల్లల్ని కనేస్తున్నావ్! కట్నాలకి డబ్బు కూడబెడుతున్నావా? " అంటూ సరదాగా చనువున్న స్నేహితులు అనే మాటలకి రామారావు చిన్నబుచ్చుకునేవాడు. అయినా కొంతకాలానికి మళ్ళీ కామాక్షికి నెలతప్పక తప్పలేదు.

నెలతప్పిన దగ్గరనుండి ఆడపిల్ల పుడుతుందేమోనన్న భయంతో రాత్రింబవళ్ళు నిద్ర పట్టేదికాదు. "దేవుడిస్తే ఏం చేస్తాం? " అనే ఇరుగుపొరుగుల మాటలతో సాంత్వన కలగలేదు కామాక్షికి.

అంటీముట్టనట్టుగా ప్రవర్తించే భర్తకు చెప్పుకోలేక ఆరునెలలు చూలింత, ఆరునెలలు బాలింతగా యాతనపడుతూ.. మధ్యమధ్య పిల్లల అనారోగ్యాలు.. వీటన్నిటితో కామాక్షి చిత్రహింస అనుభవించేది.

ఈసారి మాత్రం అదృష్టవశాత్తూ అబ్బాయి పుట్టాడు. ఇంట్లో అందరి ముఖాలు వెలిగిపోయాయి. ముఖం నిండా పరచుకొన్న నవ్వుతో మిఠాయి తీసుకొచ్చి పిల్లలు ముగ్గురికీ ఇచ్చాడు రామారావు. పుట్టిన తర్వాత ఏనాడూ తండ్రి ముఖంలో నవ్వుని చూడని బుజ్జి నిజంగా తనకి మిఠాయి యిస్తున్నారో? లేదో? అన్న అనుమానంతో మౌనంగా వుండిపోయింది. మరొకప్పుడైతే గసిరేవాడే కానీ ఇప్పుడు పట్టలేని సంతోషంతో ఉన్న రామారావు "తీసుకోవే మొద్దూ!" అని ముద్దుగానే కోప్పడ్డాడు.

ఇంట్లో ఉన్నంతసేపూ కొడుకుని కింద దింపేవాడు కాదు. కౌసల్య మొదటి పిల్ల కావటాన తండ్రి ప్రేమని అంతోయింతో చవిచూసింది. తమ్ముడిని తండ్రితో కలిసి ఆడించేది. మణికి ఎప్పుడూ అనారోగ్యమే. రెండ్రోజులు లేస్తే నాలుగురోజులు ప

డకేసేది. ఇకపోతే బుజ్జిది.. అప్పుడప్పుడే ఊహ తెలుస్తున్న వయసు. తల్లీతండ్రీ ఎంతసేపూ తమ్ముడ్ని ఎత్తుకుంటుంటే మౌనంగా అక్క వెనకే ఉండిపోయేది. ఆ వయసులో ఉండాల్సిన కేరింతలు, గంతులూ ఏమీ చేసేది కాదు.

తమ్ముడ్ని ఉయ్యాలలో వేసి నామ కరణంచేసి పెద్దఎత్తున అందర్నీ విందుకు పిలవటం కౌసల్యకి వింతగా తోచింది. తల్లి దగ్గరికి వెళ్ళి "బుజ్జిదానికి పేరు పెట్టలేదేంటి? " అంది.

"బడికి వెళ్ళినప్పుడు పెడదాంలే" అన్నాడు, అప్పుడే అక్కడికి వచ్చిన రామా రావు. ఒక అయిదారు నెలలు ఆ యింట్లో సందళ్ళతో గడిచిపోయింది.

పిల్లాడికి నీళ్ళుపోసి పాలు తాగిస్తున్న కామాక్షి దగ్గర చేరి రామారావు "ఒక గొడ్డు గొడ్డూ కాదు. ఒక్క కొడుకు కొడుకూ కాదు అంటారే కామూ!" అన్నాడు. పక్కనే నిలబడ్డ కౌసల్యని మంచినీళ్ళు తెమ్మని పంపింది కామాక్షి. కౌసల్య వెనకే వుండి తమ్ముణ్ణి అమ్మ ముస్తాబు చేయడం వింతగా చూస్తున్న మణి, బుజ్జి కూడా వెళ్ళిపోయారు.

★ ★ ★

రామారావు కోరుకున్నట్లు కామాక్షి మళ్ళీ నెల తప్పింది. కానీ వరుస కాన్పులతో బలహీనమైన కామాక్షి మంచం దిగలేకపో యేది. అప్పటికే కౌసల్య బడికి వెళ్తున్నా, ఇంట్లో చిన్నాపెద్దా పనులకు ఆరిందాలా సాయంచేస్తూ చెల్లెళ్ళని చూసుకునేది.

ఈసారి పురిటికి, కామాక్షిని తప్పనిస రిగా ఆస్పత్రిలో చేర్చవలసివచ్చింది. "ఆమె చాలా బలహీనంగా ఉంది. ఇకపై మళ్ళీ గర్భందాలిస్తే పెద్దప్రాణానికే ప్రమాదం. అందుకని కుటుంబ నియంత్రణ ఆపరే షను తప్పనిసరి. మీరు ఫారం నింపి ఇవ్వండి" అని డాక్టరు నిర్మొహమాటంగా రామారావుకి చీవాట్లు పెట్టింది.

కుటుంబ నియంత్రణ ఆపరేషను పట్ల అవగాహన గానీ, ఆదరణ గానీ లేని రోజులవి. దేవుడు యిస్తే కాదనటం తప్పు అనే భావంతోనే ప్రజలున్నారు. అట్లాగే

# తొలి నవల!



**శీలా సుభద్రాదేవి**

పంతొమ్మిదివందల డెబ్బైలో ప్రారంభ మైన నా నలభై ఆరేళ్ల సాహిత్య ప్రస్థానంలో తొమ్మిది కవితా సంపుటాలు, రెండు కథా సంపుటాలు వెలువడ్డాయి. నా సాహిత్యఖా తాలో కేంద్ర సాహిత్య అకాడమీవారు ప్రచు రించిన డా.పి. శ్రీదేవి గురించి రాసిన మోనో గ్రాపు కూడా చేరింది. అమెరికా-ఆఫ్ఘన్ యుద్ధ నేపథ్యంగా 2001లో రాసిన 'యుద్ధం ఒక గుండెకోత' దీర్ఘకావ్యానికి ఆంగ్ల, హిందీ అను వాదాలు పుస్తకరూపంలో వచ్చాయి. ఆవంత్స సోమసుందర్, దేవులపల్లి రాజహంస, కృష్ణ శాస్త్రి పురస్కారం, కడపవారి గురజాడ పుర స్కారం, తెలుగు విశ్వవిద్యాలయం నుండి ఉత్తమ రచయిత్రి పురస్కారం అందుకు న్నాను. 'నీడల చెట్టు' నవల నా తొలిప్ర యత్నం. ఏ రచన చేసినా నేను నమ్మిన, నాకు తెలిసిన జీవితాన్నే నిజాయితీగా అక్షరీ కరించడం నా విధానం.

*చిరునామా:*
**శీలా సుభద్రాదేవి**
217, నారాయణాద్రి బ్లాక్
ఎస్.వి.ఆర్.ఎస్. బృందావనం
పోచమ్మ బాగ్, సరూర్‌నగర్
హైదరాబాద్- 500035

> **కొత్తగాలి...**
>
> **రైతన్నపై**
> **కరుణ సాగరమంత!**
> **సాయం పిడికెడంత!**
>
> – యు. చిట్టిబాబు,
> న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

రామారావూ, కామాక్షి కొంచెం వెనకముందు ఆడేరు. మరో కొడుకు పుట్టాకైతే.. అనే భావం రామారావుది. కానీ డాక్టరు మందలింపుతో ఫారం నింపి ఇచ్చాడు.

'హమ్మయ్య! ఇకనైనా ఈ బాలింత, చూలింత బాధ తప్పింది బాబూ! కనటమే కానీ పిల్లల ముద్దుముచ్చట్లు చూసే ఓపిక కన్నా లేకుండా అయిపోయింది. పాపం పసిదే అయినా కౌసల్య పిల్లలందర్నీ ఆడిస్తూ, ఆరిందాలా వాళ్ళ ఆలనా పాలనా చూస్తోంది కనుక సరిపోయింది' అనుకుంది కామాక్షి. భర్తని చూస్తుంటే భయంగా ఉండేది కామాక్షికి. చుట్టూ పసిపిల్లలు పడుకొని వుండగా.. ఎదురుచెప్తే ఏమంటాడో, కోపం వచ్చి అలుగుతాడేమోనని భయపడి భర్తకి లొంగినా త్వరలో మళ్ళీ రాబోయే వేవిళ్ళు, కాన్పులే తప్ప మానసికంగా ఏ క్షణంలోనూ ఏమాత్రం సంతృప్తి పొందలేదు కామాక్షి.

తమ్ముడు ప్రభాకరానికి చేసినట్లుగా చిన్నచెల్లికి కూడా బారసాల చేస్తారేమో, ఇల్లంతా సందడిగా తిరగొచ్చు అనుకున్న కౌసల్య, ఎన్నిరోజులకీ ఆ హడావుడి కనిపించకపోయేసరికి, ఒకరోజు మెల్లగా తల్లి పక్కన చేరి అడిగింది-

"చంటికి కూడా బారసాల ఎప్పుడు చేస్తామే? "

"ఇంక అదొక్కటే తక్కువైంది. పో! అవతలికి పోయి చెల్లెళ్ళని ఆడించు.." పిల్లలకి సమాధానం చెప్పలేక ఏదో అనేసి నోరు మూయించింది కామాక్షి.

అప్పటికే కౌసల్య, మణి స్కూలుకి వెళ్తున్నారు. పెద్ద ఆర్భాటంగా బ్రాహ్మణ్ణి పెట్టి శాస్త్రోక్తంగా అక్షరాభ్యాసం చేయించలేదు కానీ తలంటుపోసి కొత్తగౌను వేసి, కొత్త పలక యిచ్చి మంచిరోజు చూసి స్కూలుకి తీసుకుపోయాడు రామారావు.

మూడోది కూడా రాత్రిపూట దీపం దగ్గర చదువుకుంటున్న అక్కల దగ్గర అక్షరాలు నేర్చుకోవాలని, వాళ్ళ పలకలమీద బలపంతో గీసేందుకు ప్రయత్నిస్తూ ఉండటం చూసి కామాక్షి "బుజ్జికి కూడా అయిదేళ్ళు దాటుతున్నాయి" అని రామారావుకి గుర్తుచేసింది. "దీన్ని కూడా ఒక మంచిరోజు చూసి స్కూల్లో వేసేయండి" అంది. "అలాగే లేవే" అంటూ అటు తిరిగి పడుకున్నాడు.

మరో నాలుగురోజుల తర్వాత మంచి రోజు చూసి బుజ్జిని స్కూలుకి తీసుకువెళ్తానని చెప్పాడు భార్యకి.

ఆ రోజు తలంటు పోసుకొని, కొత్తగౌను వేసుకొని మురిసిపోతున్న బుజ్జి కొత్త పలక పట్టుకొని సంబరంగా తండ్రివెంట స్కూలుకు వెళ్ళింది.

ఆఫీసు రూములో క్లర్కు "పేరేమిటి మాస్టారు? " అంటూ అడిగాడు.

'బుజ్జి' అనబోయి ఆలోచనలో పడ్డాడు రామారావు. తనలో తానే గిల్టీగా ఫీలయ్యాడు. "ఏం పేరు పెట్టాలో కుదరక ఇంకా పేరు పెట్టలేదు. 'ద' అక్షరంతో రావాలంటేనూ.." నసుగుతూ అప్పటికి తోచిన సమాధానం చెప్పేడు రామారావు.

"దమయంతి అని రాసేయమంటారా? " అన్నాడు గుమాస్తా.

"సరే! రాయండి. నాకు ఆ పేరు తట్టలేదు" అభినందనగా గుమస్తాని చూశాడు.

తన దగ్గర రిజిస్టర్లో దమయంతి అని

రాసి, ఫారం రామారావుకిచ్చి, నింపి యివ్వమన్నాడు గుమాస్తా.

'తన పేరు దమయంతి' పదే పదే వల్లించుకుంది బుజ్జి. తనని పేరు పెట్టి పిలుస్తున్న తోటి పిల్లల్ని చూసి ఉప్పొంగిపోయింది.

రామారావు ఇంటికి వచ్చాక కామాక్షితో ఈ విషయం చెప్పి "బుజ్జి పేరు గురించి నువ్వైనా గుర్తు చేశావు కాదే. అక్కడ గుమాస్తా అడిగేసరికి అప్పటికేదో సర్ది చెప్పాను. మళ్ళీ ఇలాంటి పరిస్థితి రాకుండా చంటిదానికి పేరు నిర్ణయించేద్దాం" అన్నాడు.

కామాక్షమ్మ ఏమీ మాట్లాడలేదు. అందరూ తన కడుపున పుట్టినవాళ్ళే అయినా, కూతుళ్ళని అలా ఎడంపెట్టి కొడుకు తోటిదే లోకమన్నట్లు వ్యవహరించే భర్తకి ఏం చెప్పాలో తెలియలేదు. కానీ యిన్నాళ్ళకైనా కూతుళ్ళ గురించి ఆలోచించినందుకు సంతోషించింది.

కౌసల్య, మణి, దమయంతీ స్కూలు నుండి వచ్చారు. చెల్లెలి గురించి సంబరంగా చెబుతూ "ఇక మీదట బుజ్జిని అందరం దమయంతీ అనే పిలుద్దామే అమ్మా.. పేరు బావుంది కదా!" అన్నారు.

"అన్నట్లు చిన్నదానికి ఏం పేరు పెడదాం అమ్మా? మా వాచకంలో కృష్ణుడి పాఠం ఉంది. కృష్ణుడి అమ్మ యశోద. మరేం చిన్నదానికి యశోద పెడదామే" గారంగా అంది కౌసల్య.

అక్కడే కాఫీ తాగుతూ ఆమె మాటలు వింటున్న రామారావు వైపు చూసింది కామాక్షి.

"అవునవును! యశోద పేరు బాగుంది. అదే పేరు ఖాయం చేద్దాం!" అన్నాడు.

ప్రభాకరానికి కూడా స్కూలుకి వెళ్ళే వయసు వచ్చింది. పున్నామ నరకం నుండి తప్పించి ఉద్ధరించేవాడు కనుక కొడుక్కి శాస్త్రోక్తంగా దగ్గర్లోని అన్నవరం తీసుకెళ్ళి అక్షరాభ్యాసం చేయించాడు. యశోద తాను కూడా స్కూలుకి వెళ్తానని పేచీపెట్టటంతో గత్యంతరంలేక ఆ పిల్లని కూడా పక్కనే కూర్చోబెట్టి కానిచ్చేశాడు.

యశోద చిన్నప్పటినుండి చురుకుగానే ఉండేది. నిల్చున్నచోట నిలిచేది కాదు. ప్రభాకరానికి, యశోదకి ఒక ఏడాదే తేడా ఉండటంతో కవలపిల్లల్లా ఉంటారు. మగ పిల్లలతో సమానంగా గెంతుతూ ఆడుతుందని తల్లిదండ్రులు రెండు మూడుసార్లు మందలించినా ఆ పిల్లకి అర్థంకాలేదు. 'వాడు ఆడుకుంటే లేదు కాని నేనెందుకు ఆడకూడదు? అక్కలు ఆటకు రారు కదా, నేనెవరితో ఆడుకోవాలి? ' అనుకునేది.

కౌసల్యకి స్కూలు, ఇంట్లో పనీ.. వీటితోనే సరిపోతుంది. మణికి సరేసరి అనారోగ్యం.. దమయంతికి తన చదువేంటో తప్ప మరో ప్రపంచం అక్కరలేదు.

★ ★ ★

చూస్తుండగానే సంవత్సరాలు ఒకదాని తర్వాత ఒకటి దొర్లుకుంటూ వెళ్ళిపోతూనే ఉన్నాయి. కౌసల్య వ్యక్తురాలయింది. బారసాలలూ, అక్షరాభ్యాసాలు అయితే మానేశారుకానీ దీనికి హడావుడి చేయకపోతే బంధువుల్లో చిన్నతనం. అందరూ ఎత్తిపొడుస్తారేమోనని భయం. అందుకని చెయ్యాల్సిన తంతులన్నీ చేశారు.

'ఇంక నీ కూతురికి పెళ్ళి కొడుకులను వెతకటం మొదలుపెట్టాలి కాముడూ!' అంటూ వచ్చీపోయే చుట్టాలు తల్లితో అన్న వేళాకోళం మాటలు విని సిగ్గుతో ముడుచుకుని మూల కూర్చుంది కౌసల్య.

"వచ్చే ఏడాది నువ్వు కూర్చుంటావా మణీ? " అంటూ మధ్యలో ఆటపట్టిస్తున్న అమ్మలక్కల మాటలకి మరికొన్ని రోజులలో తనకీ అవన్నీ జరుగుతాయనే ఆలోచన వచ్చి ముడుచుకుపోయేది మణి.

పెద్దక్కని ఎందుకు ముట్టుకోకూడదో? ఇన్నాళ్ళూ లంగాలు, గౌనులు వేసుకునే

పెద్దక్క ఇప్పుడు చీరలెందుకు కట్టుకుంటోందో? వాళ్ళింటికి అక్కని చూసేందుకు అందరూ ఎందుకు వస్తున్నారో? ఏమిటో? ఏమీ తెలియక అయోమయంగా ఉంది దమయంతి, యశోదలకు. కానీ వచ్చీపోయేవాళ్ళు తెచ్చిస్తున్న తీపితీపి మిఠాయిలూ, అవి తినే సందడిలో పెద్దగా పట్టించుకోలేదు వాళ్ళు.

స్నానం అయ్యాక పేరంటం కూడా చేశారు. అమ్మలక్కల మాటలు విన్న కామాక్షమ్మ, రామారావు కూడా అనుకున్నారు 'ఇంక పెళ్ళి కొడుకులని వెతకాలి, కట్నానికి డబ్బు సమకూర్చుకోవాలి' అని.

భుజాలమీద నిలవక జారిపోతున్న పమిటని మాటిమాటికీ సవరించుకొంటూ, తనలోని మార్పుని అద్దంలో పదేపదే చూసుకుంటూ మురిసిపోతోంది కౌసల్య. స్కూల్లో స్నేహితురాళ్ళకి కొత్త సిల్కువోణీని, తన ముస్తాబునీ ఎప్పుడెప్పుడు చూపిస్తానా? అని మరీమరీ సర్దుకుంటోంది.

తనెప్పుడు అలా సిల్కువోణీ వేసుకుంటానా? మాటిమాటికీ సర్దుకుంటానా? అని మణి అనుకుంటుండేది.

కొత్తగా కన్పిస్తున్న పెద్దక్కని కళ్ళింతింతలు చేసుకొని ఆశ్చర్యంగా చూస్తున్నారు చెల్లెళ్ళూ, తమ్ముడూ.

"అక్కా! స్కూలుకి టైమవుతోంది పదవే!" పెద్ద తనే సిల్కువోణీ వేసుకు ఫోజు కొడుతోందని మనసులో చిరాకు పడుతూ పిల్చింది మణి.

"ఇదుగో! వస్తున్నా" అంటూ మరోసారి ఓణీ సర్దుకుని పుస్తకాలు తీసుకొని లోపలున్న అమ్మకి వినబడేలా "స్కూలుకు పోతున్నాం అమ్మా" అని కేకేసింది.

"ఓసేవ్ కౌసల్యా! ఉండవే తల్లీ" అంటూ పెరట్లో కంచాలు కడుగుతోన్న చేతుల్తోనే ఆదరాబాదరాగా వచ్చిన కామాక్షమ్మ "ఇవాల్టి నుంచి నువ్వు స్కూలుకి వెళ్ళక్కరలేదు. వాళ్ళని వెళ్ళనీ. నువ్విలా వచ్చి కాస్త వంటింట్లో గిన్నెలవీ సర్దిపెట్టు" అంటూ మళ్ళీ పెరట్లోకి వెళ్ళిపోయింది.

చదువు పోతుందన్న దిగులు కలగలేదు కానీ 'అయ్యో! శారదా, రమణిలకి తన కొత్తబట్టలు చూపించటానికి కుదరలేదే' అని విచారం కల్గింది కౌసల్యకి.

"అయితే నువ్వింక స్కూలుకి రావా అక్కా?" అసూయపడింది మణి, 'వెధవ చదువు తనకెప్పుడు తప్పుతుందో!' అనుకుంటూ.

"ఎందుకక్కా నువ్వు స్కూలుకి రావు, అస్సలు ఎప్పటికీ రావా?" అడిగింది యశోద. దమయంతికీ కళ్ళల్లో అదే ప్రశ్న కదిలింది.

"అదేమో మరి..." అంది సందిగ్ధంగా అలాగే నిలబడిపోయి.

టైమవుతోందని మణి కేకపెడుతున్నా వినకుండా పెరట్లోకి పరిగెత్తి తల్లిని గట్టిగా కుదుపుతూ "ఎందుకమ్మా! పెద్దక్క స్కూలుకి వెళ్ళొద్దు?" అని అడిగింది యశోద.

"అక్క పెద్దదయింది కదా! అందుకని బైటకి వెళ్ళకూడదు" అంది కామాక్షమ్మ, 'ఈ పిల్ల ప్రశ్నల్తో చంపుతోంది బాబూ!' అని విసుక్కుంటూ.

"చీర కట్టుకుంటే పెద్దవాళ్ళయిపోయినట్లేనా? మరి అక్కావాళ్ళ క్లాసులో శారదక్కా, రమణక్కా వాళ్ళంతా స్కూలుకి చీరలు, వోణీలు కట్టుకునే వస్తున్నారుకదా?"

అదేం వినిపించుకోకుండా కామాక్షమ్మ "టైమవుతోంది ముందు స్కూలుకి నడవండి" అని విసుక్కుంది.

'అమ్మెప్పుడూ అడిగిన దానికి సరిగా సమాధానం చెప్పదు' అనుకుంటూ ఇంకా ఆలోచిస్తూనే బైటకి నడిచింది యశోద. అమ్మ ఏం చెప్తుందో వినాలని వచ్చిన దమయంతి కూడా వెనుతిరిగింది.

"మణీ! మా క్లాసులో శారదని, రమణిని సాయంత్రం స్కూలు విడిచాక రమ్మన్నా

నని చెప్పు, మర్చిపోకేం" అని పోతున్న చెల్లెల్ని కేకేసి మరోసారి చెప్పింది కౌసల్య.

'సాయంత్రం వాళ్ళు వస్తే తనకి అందరూ ఇచ్చినవి, అమ్మ కొన్నవి అన్ని ఓణీలూ చూపించాలి' అనుకొంటూ వంటింట్లోకి నడిచింది.

తల్లి వెనకెనకే ఏదో ఒక పనిచేస్తూ తిరుగుతున్నదేకానీ ఆలోచనంతా ఎప్పుడు సాయంత్రం అవుతుందా? అని ఎదురు చూస్తోంది కౌసల్య.

సాయంత్రం స్కూలు విడిచిన తర్వాత మణీవాళ్ళ వెనకే కౌసల్య స్నేహితురాళ్ళూ వచ్చారు. వాళ్ళని తీసుకొని డాబామీదికి నడిచింది కౌసల్య.

స్కూల్లో ఆ రోజు జరిగిన విశేషాలన్నీ చెప్పారు వాళ్ళిద్దరూ.

"కాంతారావు మాష్టారు నీ గురించి అడిగారే కౌసల్యా!"

"ఏమని అడిగారు? " కుతూహలంగా అడిగింది.

"కౌసల్య ఎందుకు రావటం లేదు? స్కూలు మానేసిందా? లేకపోతే ఒంట్లో బాగాలేదా? అని అడిగితే రమణేమో నువ్వు స్కూలు మానేస్తున్నావని చెప్పింది" అంది శారద.

"అవునుగానీ నువ్వు స్కూలెందుకే మానేస్తున్నావ్? " ఇంతవరకూ అడగాలని దాచుకున్న ప్రశ్న అడిగేసింది శారద. రమణి కూడా ప్రశార్థకంగా చూసింది.

"పెద్ద పిల్లలైన తర్వాత ఆడపిల్లలు బైటకీ, స్కూలుకి వెళ్ళకూడదంట! అందుకని మరి చదువు మానేయమని అమ్మా నాన్నా అన్నారు"

"మరి మేం చదువుతున్నాంకదే!" ఆశ్చర్యంగా ఓకేసారి అన్నారు.

"ఏమో మరి" అని, 'అదీ నిజమే కదా! మరి నన్నెందుకు మానేయమన్నారు చెప్మా? ' అని ఒకక్షణం ఆలోచనలో పడింది కౌసల్య.

"ఆడపిల్లలు ఎక్కువ చదివితే పెళ్ళిళ్ళు జరగటం కష్టం అటకదా! అందుకేనేమో? " ఎప్పుడో ఎవరింట్లోనో విన్నమాట గుర్తొచ్చి ఆలోచనగానే అంది రమణి.

"అవును! అందుకేనేమోనే! పక్కింటి వసంత కాలేజీలో చదువుతుంది కదా! ఆ మధ్య ఎవరో పెళ్ళిచూపులకి వచ్చారంట. వాళ్ళేమో 'చదువుకుంటున్న పిల్ల కుదురుగా ఉంటుందో? లేదో? మాకొద్దు' అన్నారట. మా అమ్మ, మా నాన్నతో చెప్తుంటే విన్నాను. 'శారదని మాన్పించేద్దాం' అని నాన్నతో అంటే ఆయన మా అమ్మని కోప్పడ్డారు. 'నా పిల్లలిద్దర్నీ బాగా చదివిస్తాను. వీళ్ళు పెళ్ళిళ్ళకి వచ్చేసరికి రోజులు మారిపోయి, చదువులేని పిల్లలు మాకొద్దు అనే రోజులు రావచ్చు' అన్నారు" అంది శారద నిబ్బరంగా.

ముగ్గురూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు కాసేపు ఉండి మళ్ళా కబుర్లలో పడ్డారు. అంతలో కిందనుండి ప్రభాకరం వచ్చి రమణితో "మీ అన్నయ్య నీ కోసం వచ్చాడు" అని చెప్పాడు.

"అమ్మ బాబోయ్! చీకటి పడిపోయిందే. మా అమ్మ తిడుతుందేమో! మా అన్నయ్యని కూడా పంపిందంటే నేనింకా రాలేదని రాద్ధాంతం జరిగి ఉంటుంది" రమణి భయంగా లేచింది.

ఇద్దరికీ మిఠాయిలు పొట్లం కట్టిచ్చి "అప్పుడప్పుడు వస్తుండండి" అంటూ పంపింది కౌసల్య.

చదువు బాధ తప్పిపోయింది. ఇంట్లో పని ఏదో చేసుకొని మిగతా సమయమంతా పక్కింట్లోంచి వారపత్రికలు తెచ్చుకు చదవటం, ఎప్పుడన్నా అమ్మానాన్నలు పంపితే పక్కింటి వసంతతోనో, ఎదురింటి పిన్నిగారితోనో సినిమాలకు వెళ్ళటం, మిగతా సమయమంతా కలలు కనటం తప్ప మరో వ్యాపకం లేదు కౌసల్యకి.

కథలో చదివిన హీరోలే కళ్ళముందు

**అ**
**క్ష**
**రం**

*పిల్లల్ని ఈ చీకటి ప్రపంచంలోకి ఎందుకు తెచ్చానంటే*
*ఇక్కడ అవసరమైన కాంతిని*
*పిల్లలు 'మాత్రమే తీసుకురాగలరని!*

**– లీజ్ ఆర్మ్‌బ్రస్టర్,**
*ప్రఖ్యాత రచయిత్రి*



మెదులుతూ ఉండేవారు. ఆరడుగుల పొడవు, ఉంగరాల జుత్తు, ఉలిపిరి కాగితంలో చుట్టిన ఏపిల్ పండురంగు ఒళ్ళు, నిలువెల్లా తడిమే చురుకైన చూపులు- ఇలా ఒకటేమిటి ఎన్నెన్నో! రంగుల కలలు! అందాల హరివిల్లులు! వీటితో కంటిమీద కునుకు పట్టేదికాదు. ఎక్కడో దూరంగా, మైకుల్లోంచి వినిపిస్తోన్న ప్రణయగీతాలు విని పులకరించిపోయేది.

అనుకున్నరోజు రానే వచ్చింది. ఆ రోజు తోచటంలేదని శారదవాళ్ళింటికి వెళ్ళింది. వాళ్ళింట్లో బీరువా నిండా పుస్తకాలు ఉంటాయి. వాళ్ళమ్మగారు క్షేమసమాచారాలు అడిగి ఒకరెండు కథల పుస్తకాలు చదవమని కౌసల్యకి ఇచ్చారు. అక్కడే ఉన్న శారదవాళ్ళ నాన్నమ్మ, "చదువు మాన్పించేశారుకదా! మరి పెళ్ళి సంబంధాలు చూస్తున్నారా? " అని ప్రశ్నించింది. సిగ్గుపడుతున్న కౌసల్యాని శారద తన రూములోకి తీసుకెళ్ళిపోయింది.

తిరిగి కౌసల్య ఇంటికి వచ్చేసరికి తల్లి దండ్రులు మాట్లాడుకొంటున్న సంభాషణల్లో 'పెళ్ళిచూపులు' అన్నమాట వినిపించింది కౌసల్యకి. ఆ రాత్రి డాబామీద పక్కలు పరుస్తున్నప్పుడు మణి వచ్చి "రేపు నిన్ను చూసుకునేందుకు పెళ్ళివారు వస్తున్నారటే అక్కా" అంది.

రాత్రంతా ఒకటే కలలు!

పెళ్ళిచూపులకి వెళ్ళి కూర్చోగానే మెల్లగా కళ్ళెత్తేసరికి 'అతను' ఆ చూపుకోసమే ఎదురుచూస్తున్నట్లు, పలకరింపుగా నవ్వినట్లు, కళ్ళతో ఎన్నెన్నో కబుర్లు చెప్పినట్లు, 'మీ అమ్మాయితో ఏకాంతంగా మాట్లాడాలి' అంటూ తనని పార్కులోకో, డాబామీదకో తీసుకెళ్ళినట్లు, 'నిన్ను చూడగానే తెలిసింది.. నువ్వే నా స్వప్నసుందరివి' అని అన్నట్లు, 'నిన్ను తప్ప మరెవ్వరినీ చేసుకోను' అని బాసలు చేసినట్లు, తనపాట వినగానే మెప్పుదలగా చూసినట్లు- ఇలా సినిమాలో చూసినవీ, కథల్లో చదివినవీ అనేక పెళ్ళిచూపుల సంఘటనలు కళ్ళ ముందు కలలుగా రూపుదిద్దుకున్నాయి.

రాత్రంతా కలత నిద్రతో ఉదయానికి కౌసల్య కళ్ళు బరువుగా, ఎర్రగా అయ్యాయి.

ఉదయం నుండే ఇంట్లో హడావుడి మొదలైంది. గదంతా బూజులవీ దులిపి, ఉన్నంతలో అందంగా దిద్దారు. కౌసల్య తలంటు పోసుకుంది. లేచిన దగ్గరనుండీ, కౌసల్య పెదాలమీదకి చిరునవ్వు ఊరికూరికే పిలవకుండానే వచ్చి బుగ్గలు చిదిమి వెళ్ళిపోతోంది. చల్లగాలికి కదిలే చిగురాకులా పెదాలు ఉండుండి కదులుతున్నాయి. కళ్ళలోని కలల బరువుకి కనురెప్పలు అరమోడ్పుగా అయిపోతున్నాయి. తనలోని కంపనాలు ఎవరైనా కనిపెడ్తారేమోనని మళ్ళా ఏదో బిడియం. ఏ పని చేయాలన్నా ఏదో తడబాటు. వీధి గుమ్మంలో ఏ అలికిడి విన్నా ఉలికిపాటు. ఇలా ఏదో తెలియని మధుర భావనలతో కౌసల్య మనసు తేలిపోతోంది.

ముఖం కడుక్కుందామని కౌసల్య సబ్బు తీసుకొని వెళ్ళబోతుంటే కామాక్షమ్మ "స్నానం చేసిరావే" అంది. సరేనని

## కొత్తగాలి...

**అంతా ఆనందమే!**
**కవికి కలంలో**
**గాయకుడికి గళంలో**
**నాయకుడికి జనంలో!**

– బి. చంద్రశేఖరయ్య,
పలమనేరు, చిత్తూరు జిల్లా

స్నానంచేసి వచ్చింది. చల్లటి నీళ్లతో స్నానం చేసేసరికి మనసంతా హాయిగా, తాజాగా అనిపించింది. కళ్ల కొసలు తీర్చి దిద్దుకుంది. దోసగింజలా తిలకం పెట్టుకుంటుంటే 'నీకు దోసగింజ బొట్టే నప్పుతుంది' అని రమణి అనడం గుర్తొచ్చింది. 'మరి ఆ పెళ్లికొడుక్కి నచ్చుతుందో? లేదో?' అనుకుంది కౌసల్య.

తలంటుకున్న జుట్టుని వదులుగా జడ అల్లుకుంటూ 'ప్రభాకరాన్ని పూలకి పంపేరు ఇంకా రాలేదే? దారిలో వాల్ పోస్టర్లు చూసుకుంటూ ఆగిపోయాడో? ఏమిటో?" అని విసుక్కుంది.

ఇంక చీర కట్టుకోవటమే తరువాయి. 'ఏది కట్టుకోవాలో? ఓణీలైతే రెండు మూడు మంచివే ఉన్నాయి. కానీ ఏ కథలోనూ ఏ సినిమాలోనూ పెళ్లిచూపులకి లంగా ఓణీలు కట్టుకున్నట్లు చూడలేదే! అమ్మమ్మ కొనిచ్చిన పూలపూల వాయిల్ చీర కట్టుకుంటేనో?' అనుకుంది కౌసల్య.

ఇంతలో దమయంతి వచ్చి "ప్రభాకరం విడిపూలే తెచ్చాడు. నిన్ను మాల అల్లమని చెప్పింది అమ్మ" అని పూల పొట్లం తెచ్చి అక్కడ పెట్టింది. ఎండలో తెంపి నీళ్లు చల్లినట్లున్నారు. ఇంకా విచ్చుకోలేదు. ఒక్కొక్క మొగ్గా తీసి మాల అల్లటం మొదలెట్టింది కౌసల్య.

అంతలో బైట వాకిట్లో అలికిడి, అమ్మానాన్నల హడావుడి వినిపిస్తోంది. కాస్సేపటికి 'అమ్మాయిని తీసుకురా కామాక్షీ!' అన్న తండ్రి మాట వినిపించింది. కామాక్షమ్మ లోనికి వచ్చి కౌసల్యని చూసి సంబరపడింది. చీర కుచ్చిళ్లని, పమిటని సరిచేసింది. మల్లెపూల మాలని కౌసల్య జడలో తురిమింది.

తల్లి వెనకాలే వెళ్లిన కౌసల్య గదిలో చాలామందే ఉన్నట్లు గమనించి, అప్రయత్నంగానే భయం అనిపించి కాళ్లు తడబడ్డాయి. అందులోనూ కొత్తగా చీర కట్టుకుంది మరి.

చాపమీద కూర్చున్నా గుండె దడదడమంది. మైకం కమ్మినట్లయింది. పట్టుచీర కట్టుకున్నామె పెళ్లికొడుకు తల్లేమో మరి- అడుగుతున్న ప్రశ్నలకు కౌసల్యకి నోరు పెగల్లేదు. చెప్పిన సమాధానాలు కూడా గొంతు దాటి సన్నగా వచ్చాయి. కళ్లెత్తి చూడాలనిపించినా ఆపకుండా ఒకదాని తర్వాత ఒకటి ప్రశ్నలేస్తున్న ఆమె వైపునే చూపు ఆగిపోయింది.

"ఇంక లోనికి వెళ్లమ్మా" అని ఆవిడ అనుమతి ఇవ్వటంతో లోనికి వస్తూ ఓరగా చూసింది. మంచి రంగు, నల్లని క్రాపు తప్ప ఏమీ కన్పించలేదు కౌసల్యకి.

ఎందుకో కౌసల్యకి ఒక్కసారిగా నీరసం ఆవహించింది. తను ఊహించుకున్నట్లు జరగలేదు. కళ్లతో సందేశాలు లేవు. పెదాలు విసిరే చిరునవ్వు బాణాలు లేవు. దిగులుగా ఆలోచిస్తూ ఉండిపోయింది. వచ్చేవారంలో హీరో హీరోయిన్లకి పెళ్లయిపోతుంది అని ఊహించుకున్న సీరియల్ నవలలో, మళ్లీ అపార్థాలు వచ్చి ఇద్దరూ విడిపోయినట్లు అనిపించింది.

ఆలోచించగా అతని తప్పు కూడా లేదు. అంతమందిలో అతను మాత్రం ఏంచేస్తాడు? అని సమర్థించుకుంది. అప్పుడు కొంత తృప్తి కలిగి మనసు తేలికైంది.

"ఏయ్ దొంగా! మేమెక్కడ నీక్కాబోయే

శ్రీవారిని ఎగరేసుకు పోతామోనని చెప్ప కుండా పెళ్ళిచూపులు జరుపుకున్నావా? " సాయంత్రం వస్తూనే కయ్యానికి దిగింది రమణి.

"అరె! మీరెప్పుడు వచ్చారే? నేను చూడనే లేదు"

"అవును! నీకెక్కడ కనబడతాం? ఆలో చనల్లో తలమునకలై పోతుంటే!" రమణి నిష్టూరం.

"ఉండవే తల్లీ! అవతల వాళ్లకి వినబడు తుంది" కొంచెం భయంగా అవతలి గది లోకి తొంగి చూడబోయింది కౌసల్య.

"ఇంకెక్కడ? హడావుడిగా స్కూలు నుండి పరుగెత్తుకు వస్తే, ఈలోపునే సాగ నంపేశావుగా!"

"అబ్బ! ఏం గోలే? వచ్చిన దగ్గరనుండి ఒకటే సొద! చెప్పేది వినిపించుకోకుండా నీ ధోరణి నీదే" విసుక్కుంది.

"చూశావా శారదా! నన్నే విసుక్కుం టోంది. ఇప్పుడే ఇలా అయితే ఇంక ఆ తర్వాత.." విచారం అభినయించింది రమణి.

"నీకు ఈ మధ్య వాగుడు ఎక్కువైంది లే" అని నవ్వుతూ కౌసల్య శారదవైపు తిరిగి "మీకీ వార్త ఎవరు అందించారు? " అని అడిగింది.

అంతవరకూ వీళ్ల సంభాషణని నవ్వుతూ వింటున్న శారద "మీ చెల్లెలు లంచ్ తర్వాత ఇంటికి వెళ్లిపోతుంటే అడిగాం. మణి చెప్పిన దగ్గరనుండి మా మనసంతా ఇటే. ఆఖరి పీరియడ్ ఎగ్గొడ దామంటే జిగురుమూర్తిగారు వదలందే" అంది.

"ఇంతకీ విశేషాలు చెప్పవే" ఆత్రుతగా అడిగారు స్నేహితురాళ్లు.

చిన్నగా నవ్వి ఊరుకుంది కౌసల్య.

"తెల్లగా.. ఆరడుగుల పొడవున్నాడా? ఉంగరాల జుత్తేనా? ఏం చేస్తాడు? ఏం మాట్లాడేడు? " ప్రశ్నలమీద ప్రశ్నలు సంధించారు.

"అంతేనా ఇంకా ఉన్నాయా? " చెంపకు చెయ్యి చేర్చుకుని అంది కౌసల్య.

చాలా సేపు పెళ్లిచూపుల ముచ్చట్లు ఊహించుకుంటూ, వేళాకోళం చేసుకొంటూ పరిసరాలు మరచిపోయేంతగా కబుర్లలో పడిపోయారు వాళ్లు.

వాళ్లు వెళ్లాక కూడా మనసునిండా ఉన్న ఆ గిలిగింతలు వదలివెళ్లలేదు. మళ్లా మ ళ్లా చెదిరిపోనీయకుండా రాత్రికన్న కలల్ని నెమరు వేసుకుంటూ మరికొన్ని రోజులు గడిపింది కౌసల్య.

పెళ్లివారొచ్చి పదిహేను రోజులైనా ఇంకా ఉత్తరం లేదు.




**కా**మాక్షమ్మకి, రామారావుకి దిగులు మొదలైంది. మూడోది కూడా ఎదిగిపో తోంది. ఏమీ తోచనట్లుగా అయింది వాళ్లకి. మణి సన్నగా, అనారోగ్యంతో రివ టలా ఉంటుంది. మణికన్నా ముందే దమ యంతి ఎదిగిపోయింది. మానుకోలేక యథావిధిగా తంతులన్నీ జరిపారు.

పేరంటానికి వచ్చినామె "దమయంతిని కూడా చదువు మానిపించేస్తారా? " ఆరాగా అడిగింది.

ఒక క్షణం ఆలోచనలోపడి తేరుకున్న కామాక్షమ్మ, "లేదండి, కాలక్షేపంగా ఉంటుంది కదా, చదివించాలనే అనుకుం టున్నాం. పెద్ద పెద్ద చదువులు ఎలాగూ

చదివించలేం. స్కూలు ఫైనల్ వరకైతే పంపుతాం" అన్న తల్లిమాటలు విని దమ యంతి 'హమ్మయ్య!' అనుకుంది. 'అక్కకి లాగే తనని కూడా స్కూలుకి వెళ్లొద్దంటా రేమోనని' వారం రోజులుగా పెట్టుకున్న బెంగ తీరింది. ఆ బెంగకి తోడు "ఇలా అడ్వర్టయిజుమెంటులా మూలని కూచో వడం దమయంతికి నచ్చలేదు. 'పేరంటం అయినా చేయకపోతే బాగుండు!' అను కుంది కానీ తప్పలేదు. ఆమెకి ఇదంతా ఇబ్బందికరంగా అనిపించింది. అదే యశో దతో కూడా అంది.

"ఇదంతా అసహ్యంగా ఉంది. ఆ వేళా కోళాలూ ఇవన్నీ చూస్తుంటే ఎందుకక్కా నువ్వు ఒప్పుకున్నావు? ఇవన్నీ చెయ్యొద్దని చెప్పవలసింది!" పన్నెండేళ్ల యశోద మాట లకి దమయంతి ఆశ్చర్యంగా చూసింది. 'తన మనసులోని భావాలు బైట పెట్టింది' అనుకుంది.

పద్నాలుగేళ్లు నిండినా, తరువాతది ఎది గిపోయినా మణి ఇంకా అలాగే పెరగ కుండా ఉండిపోవడంతో కామాక్షమ్మ తర్జ నభర్జన పడుతోన్న సమయంలో మరికొద్ది నెలలకే మణి కూడా రజస్వల అయ్యింది.

అన్ని తంతులూ యధావిధిగా జరి పారు. ఇంకా స్నానం కాకముందే మణికి విపరీతమైన జ్వరం వచ్చేసింది. ఎవరూ ముట్టుకోకపోవటంతో అలా మూల తాటా కు చాపమీద ఒళ్లెరగకుండా పడుకుంది. మణిని చూస్తుంటే చెల్లెళ్లిద్దరికీ అపరిమిత మైన జాలి కలిగింది.

జ్వరం కొద్దిగా తగ్గాక ముఖం కడుక్కో వటానికి లేచిన మణి కళ్లుతిరిగి పడబో యింది. అక్కడే ఉన్న యశోద చప్పున పట్టుకుంది. జాగ్రత్తగా నడిపించి కాస్త కళ్లూ ముఖం తుడిచింది.

"ఒసే! దాన్నెందుకు ముట్టుకున్నావ్? అలా వదిలి ముందు బావి దగ్గరకు పోయి స్నానం చేసి బట్టలు జాడించు" అంటూ లబలబలాడింది కామాక్షమ్మ.

"ఏంటమ్మా! మరీ చాదస్తం? అవతల ఒళ్లు తెలియని జ్వరంతో ఉంటే ముట్టుకో వద్దనీ, అదనీ ఇదనీ అంటావు" చిరాగ్గా అంది యశోద.

కామాక్షమ్మ చీవాట్లు భరించలేక మొ క్కుబడిగా స్నానంచేసి వచ్చింది యశోద.

మణికి స్నానంరోజుకి జ్వరం తగ్గింది. కానీ మళ్లీ తిరగబెట్టింది. మణి పరిస్థితి చూస్తుంటే దమయంతికీ, యశోదకీ ఈ ఆచారాల మీద విపరీతమైన అసహ్యం కలిగింది.

ఈ హడావుడుల సమయంలోనే పెళ్లివా రినుండి రామారావుకి ఉత్తరం వచ్చింది.

'చక్కటి పిల్ల అయిన కౌసల్య నచ్చలేదని రాశారు. ఇంకా వరసమీద ముగ్గురు ఆడ పిల్లలు ఎదిగి ఉన్నారు. వీళ్లకి పెళ్లిళ్లు ఎలా జరుగుతాయి?' వరుసగా ఆడపి ల్లల్ని కన్నందుకు, ఇన్నాళ్లకి మళ్లీ కామాక్ష మ్మ మీద కోపం వచ్చింది రామారావుకి.

దెబ్బమీద దెబ్బలా మణి అనారోగ్యం ఒకటి! జ్వరం వదలటం లేదు. తరచూ వస్తూనే ఉంది. కొన్నాళ్లు ఏవో మందులు వేసి గడిపారు. కానీ ఎంతకీ తగ్గకపోవ డంతో హాస్పిటల్‌కి తీసుకువెళ్లారు.

రక్తపరీక్షలు, ఎక్స్‌రేలు అన్నీ జరిగాక రామారావుని డాక్టరు చీవాట్లు పెట్టాడు.

"మీలాంటి చదువుకున్నవాళ్లే ఇలా చేస్తే ఎలాగండీ? పిల్ల చాలా బలహీనంగా ఉంది. ఊపిరితిత్తులు బాగా దెబ్బతి న్నాయి. మందులేకాక బలమైన ఆహారం- అంటే పాలు, గుడ్లు, పళ్లు- బాగా ఇవ్వాలి. వీటితోపాటు బాగా విశ్రాంతి కూడా కావాలి. మందులు జాగ్రత్తగా వాడాలి" అని వివరంగా చెప్పాడు డాక్టరు.

రిపోర్టులు తీసుకొని భర్త వచ్చీరాగానే అలా వాలుకుర్చీలో కూలబడి కళ్లపై మోచేయి అడ్డం పెట్టుకొని పడుకోవటం చూసేసరికి కామాక్షమ్మకి పైప్రాణం పైనే

పోయింది.

మెల్లగా అడుగులో అడుగు వేసుకొంటూ వచ్చి నిలబడింది. కానీ ఆమె వైపు చూడ లేదు రామారావు.

"డాక్టరుగారు ఏమన్నారు? " మాటలు కూడబలుక్కుంటున్నట్లు అడిగింది.

ఏమీ సమాధానం రాలేదు.

మళ్లీ అడిగింది.

అప్పటికి కళ్ళమీద చేయితీసి ఒకసారి చుట్టూ చూసి "మణి ఎక్కడుంది? " అన్నాడు.

"పక్కవాళ్లింట్లో సన్నజాజులు కోసేం దుకు వెళ్ళారు పిల్లలు. ఏమిటి? ఏమ యింది? " ఆత్రుతగా అంది.

"మణికి టి. బి. అని చెప్పారు. మందులు రాసేరు. విశ్రాంతి బాగా ఉండా లట. చాలా జాగ్రత్తగా చూసుకోవాలని చెప్పారు" ఒక్కొక్క మాటే మెల్లగా జార్చు తున్నట్లు చెప్పాడు.

గుండె ఆగినట్లయింది కామాక్షమ్మకి. అసలే బలహీనమైన శరీరం. తట్టుకోలేక కూలబడింది. భార్యని చూసి గభాలున లేచాడు. కొద్దిసేపటికి తేరుకొని ఏడుపు మొదలెట్టిందామె.

"ఆడపిల్లలే అయినా దేవుడిచ్చిన సంతు అని సమాధానపడితే ఈ బాధలేమిటి దేవుడా! పుట్టినవాళ్ళు సక్రమంగా పెరిగితే చాలనుకుంటే మళ్ళా ఇదేమిటి? " ఇంకా సాగేదే, కానీ రామారావు మందలించాడు.

"చాల్లే! ఏమిటిది? నట్టింట్లో కూర్చొని ఏడుపు. పిల్లలు బెదిరిపోరా! పిల్లలకి ఈ విషయం తెలీనీకు" అన్నాడు.

ఇన్నాళ్ళకి పిల్లల గురించి చల్లగా మాట్లాడినందుకు అంత బాధలోనూ కొంత తగ్గినట్లయింది కామాక్షమ్మకు.

మణి రెండుమూడు నెలలుగా తరచూ స్కూలు మానేస్తూనే ఉంది. ఇప్పుడు పూర్తిగా మానేసింది. మొదట్లో పని కూడా తనకి ఏమీ లేకపోవటం, హాయిగా కూర్చో వటం బాగానే అనిపించింది. తర్వాత

## కొత్తగాలి...

**చెరువులు, నాలాలు**
**కబ్జాల పాలు**
**వరదలు, బురదలు**
**పౌరుల పాలు**

– పొనుగోటి నరసింహారావు,
కూకట్ పల్లి, హైదరాబాద్

ర్వాత అది బాధగానే ఉంది మణికి.

కౌసల్యకి అడపాదడపా నెల్రోజులకో, రెండుమూడు నెలలకో ఒక్కో సంబంధం వస్తూనే ఉంది. కానీ అసలైన కట్నం గిట్టు బాటు కాక వెనుతిరిగిపోతున్నాయి. మొద టిసారిలాగే మరొక రెండుమూడు సంబం ధాల వరకూ గాలిలో తేలిపోయేది కౌసల్య. కానీ తర్వాత ఊహలకి పైకెగిరే బలంలేక నేలమీదే నడక సాగించి, ఆ తర్వాత దానిక్కూడా ఓపికలేక చతికిలపడి పోయాయి.

★ ★ ★

ఎవరి కష్టసుఖాల్తోనూ సంబంధంలేని కాలం ఆగకుండా సాగిపోతూనే వుంది. కౌసల్యకి సంబంధాలు కుదరకపోవటం, మణి జబ్బు - వీటితో బెంగపడి మంచం పట్టింది కామాక్షమ్మ.

రామారావు కూడా డీలా పడిపోయాడు.

ఈసారి యశోద పెద్దయినా ఏమీ హడావుడి చేయలేదు. దానికి, యశోద మొండితనమేకాక అప్పటికే ముగ్గురు ఎదిగి తిరుగుతూ ఉండటాన ఆమె మాటే పాటించారు.

"నలుగురు పిల్లలు చీరలు కట్టి తిరుగు తుంటే అందరి దిష్టి కూడాను. పోనీలెండి ఇప్పుడు చాలామంది అలాగే చేస్తున్నారు కూడా. ఓ రెండేళ్ళు గడిచాక ఒక మంచి

రోజు చూసి ఓణీ వేయిద్దాం" అంది భర్తతో కామాక్షమ్మ.

ఆ ఏడాది ఎస్సెస్సెల్సీ ఆఖరు పబ్లిక పరీక్ష. అదే ఏడాది కొత్తగా ప్రవేశపెట్టిన పదోతరగతికి కూడా పబ్లిక పరీక్ష కావడంతో దమయంతి ఎస్సెస్సెల్సీ, ప్రభాకరం పదోతరగతి రాశారు.

ప్రభాకరం మొదట్లో అతి గారాబం వలన అల్లరిచిల్లరిగా తిరిగినా, కొంచెం ఊహ తెలిశాక ఇంటి పరిస్థితులు బాధ్యత తెలిసేటట్లు చేశాయి. అంతేకాక దమయంతి, యశోదలకు చదువుమీద శ్రద్ధను చూసి స్కూల్లో టీచర్లు మందలించడంతో పౌరుషం వచ్చి చదవసాగాడు ప్రభాకరం.

ఇద్దరూ పాసయ్యారు. ప్రభాకరం ఇంటర్‌లో చేరాడు. దమయంతికి ఏదైనా ట్రైనింగుచేసి ఉద్యోగం చేయాలని ఉంది. కానీ అడగలేక కోరికను తనలోనే దాచుకుంది.

తరువాతి ఏడాది యశోద కూడా పదోతరగతి మంచి మార్కులతో పాసయింది. పేపర్లో రిజల్టు చూసుకొంటూనే "ఒరేయ్ ప్రభాకరం! రేపు మీ కాలేజీ నుండి అప్లికేషను ఫాం తీసుకురా" అంది.

ఇంతవరకూ ఎవరూ ఆలోచించని విషయం సడన్‌గా యశోద చెప్పేసరికి ప్రభాకరానికి ఏమనాలో తోచలేదు. అక్కడే పేపరు చూస్తున్న తండ్రి ఆ విషయం గమనించాడో? లేదో? అనుకున్నాడు.

"ఏమిటి తీసుకురావటం? " గట్టిగా రెట్టించి అన్నాడు.

"ఇంటర్లో జాయిన్ కావటానికి అప్లికేషను తెమ్మన్నా" కొంచెం గట్టిగానే అంది.

'ఉద్ధరిస్తావు' మనసులో తిట్టుకున్నాడు. 'తన చెల్లెలు కూడా అదే కాలేజీ అయితే ఎట్లా? తండ్రి కలుగచేసుకుంటే బాగుణ్ణు' అనుకున్నాడు.

"ఏంట్రా? ఏమిటి గోల? " అప్పటికి పేపరు మడిచి, కళ్ళజోడు మడతపెట్టి అన్నాడు రామారావు.

"చూడు నాన్నా! నాకు కాలేజీ నుండి ఇంటర్లో చేరటానికి అప్లికేషను ఫాం తెమ్మంటే అన్న ఎలా నసుగుతున్నాడో, సర్లే రేపు నేనూ, భారతీ వెళ్ళి తెచ్చుకుంటాంలే" అలకగా అంది యశోద.

"కాలేజీనా? .." ప్రశ్నార్థకంగా అన్నాడు మనసులో భయపడ్తూనే రామారావు.

"అదేమిటి నాన్నా? నువ్వు కూడాను! ఇంటర్‌లో జాయిన్ కావటానికి అప్లికేషను పెట్టాలి కదా..? " అంది.

అప్పుడే అక్కడికి వచ్చిన కామాక్షమ్మ "ఏమిటే? ఇంకా చదువా? ఇంకేమన్నా వుందా! ఇప్పటికే వీళ్ళకి సంబంధాలు తేలేకపోతున్నాం. ఇంకా చదివితే? " కొంప మునిగినట్లు గొడవపెట్టింది.

"మరి చదవక ఏం చెయ్యను? నాకెలాగూ మెరిట్ స్కాలర్‌షిప్ వస్తుంది. నువ్వన్నట్లు ఇప్పటికే ముగ్గురు ఇంట్లో కూర్చున్నారు. నేను కూడా కూర్చోవాలా? ఇలా ఖాళీగా కూర్చునే బదులు చదువుకుంటాను. మరి మీరే ఆలోచించుకోండి ఏం చేయమంటారో, నేను భారతి దగ్గరికి వెళ్తున్నాను" అని కచ్చితంగా చెప్పి చెప్పులేసుకొని బైటకి నడిచింది యశోద.

అంత నిర్మొహమాటంగా అలా అనేసరికి నోట మాట లేకుండా శిల్పాల్లా ఎక్కడివాళ్ళక్కడ ఉండిపోయారు.

వెళ్తున్న యశోదవైపు దమయంతి అభినందన పూర్వకంగా చూసింది. అందరి మనసులోనూ రకరకాల ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. 'పిల్లల్ని కన్నారు కానీ, వాళ్ళ భవిష్యత్తుకోసం ఏం చేశారు? ' అని ఎత్తిపొడిచినట్లుగా ఉలిక్కిపడ్డారు రామారావు, కామాక్షమ్మలు.

అలా అంత పెద్దవాళ్ళు అమ్మానాన్నల్ని పట్టుకొని అనేసిన చెల్లెలి ధైర్యానికి ఆశ్చర్యం, భయమూ కలగాపులగంగా కలిగాయి తోబుట్టువులకు.

ఆఖరికి ఎలా అయితేనేం యశోద పట్టు

చమత్కారం,

# ఆ సమయాలలో ఏకవచనం తప్పుకాదు!

అడిదము సూరకవిగారు ఒకసారి పూసపాటి సీతారామరాజుగారిని కలిసి, ఆయనను పొగడుతూ పద్యాలు చెబుతూ ఏకవచనంలో సంబోధించారు. ఇంకేముంది? రాజుగారికి కోపం వచ్చింది. కవిగారిపై అలిగారు రాజుగారు. ఆ సందర్భంలో ఆయన కోపం పోగొట్టడానికి సూరకవి ఈ పద్యం చెప్పాడు.

చిన్నప్పుడు, రతికేళిగ
నున్నప్పుడు, కవితలోన, యుద్ధములోనన్
వన్నెసుమీ 'రా' కొట్టుట
చెన్నుగ! నోపూసపాటి సీతారామా!



చిన్నతనంలో, రతిక్రీడలవేళల్లో, కవిత్వంలో, యుద్ధరంగంలో 'రా' అంటూ ఏకవచన సంబోధన సమంజసమే సుమా! అంటూ కవిగారు శాస్త్ర మర్యాదను చెప్పి తనను తాను సమర్థించుకున్నారు.

నిజమేకదా! చిన్నతనంలో స్నేహితులను చనువుగా 'అరేయ్! ఒరేయ్!' అంటూ పిలుస్తాం. పడకగదిలోనూ అది మామూలే! ఇక కవిత్వంలో 'భళిరా కృష్ణరాయా..' అంటూ మనకవులు వాడడం విదితమే. యుద్ధంలోనూ అంతేకదా! 'ఓరోరీ రాధేయా! ఏమి నీ కారుకూతలు..? చేవ గలిగిన శస్త్రము చేపట్టు!' అంటూ సంబోధించడమూ తెలిసిందే కదా! అందుకే పద్యమిలా చెప్పి రాజుగారి కోపం పోగొట్టారట సూరకవిగారు.

సేకరణ: చంద్రప్రతాప్

దలగా కాలేజీలో చేరింది. అయితే ప్రభా కరం చదివే కాలేజీ కాకుండా కొత్తగా పెట్టిన ఆడపిల్లల కాలేజీలో చేరింది. కాలేజీకి వెళ్తున్నప్పుడు ఓణీలు వేసుకోవటం మొదలెట్టింది.

కొన్నిరోజులు పోయాక ఓరోజు దమయంతి కూరలు తరుగుతూ తల్లితో మెల్లగా అంది "నా స్నేహితురాలు వకుళ వాళ్ళ నాన్నగారు టైప్ నేర్పించే ఇనిస్టిట్యూట్ నడుపుతున్నారు. వకుళ నన్ను కూడా తనతోబాటు వచ్చి నేర్చుకోమంటోంది.." మాటలు రావనుకున్న దమయంతి అలా తనకి తానే అడిగేసరికి కామాక్షమ్మకి ఆశ్చర్యం అనిపించింది.

తల్లి అలా చూసేసరికి దమయంతి తడబడి "ఆహా..! అదికాదు.. మరి.. నాకు ఇంట్లో ఖాళీగా ఉంటే ఏమీ తోచడం లేదు కదా" అంది.

యశోద కాలేజీలో చేరాక 'దమయంతికీ చదువుకోవాలని ఉండే వుంటుంది. నోరు లేనిది కనుక గట్టిగా అడగలేకపోయింది' అనుకుంది కామాక్షమ్మ.

తల్లి సమాధానం చెప్పకముందే అక్కడే కూర తాలింపు పెడుతున్న కౌసల్య "మరి ఫీజులవీ కట్టాలికదా.." అంది.

"వకుళవాళ్ళ నాన్నగారు మన గురించి తెలిసి సగం ఫీజుకే ఒప్పుకున్నారట" మెల్లగా అంది.

"సర్లే! నాన్నగారికి చెప్తాను" అంది కామాక్షమ్మ. యశోద కాలేజీలో చేరాక అదే మంచిపని అనిపించింది కామాక్షమ్మకీ రామారావుకీ. 'ఎలాగూ ఇంకా పెళ్ళిళ్ళు కుదరలేదు. ఏదో వ్యాపకమన్నా ఉంటుంది. ఈ రోజుల్లో చాలామంది ఆడపిల్లలు ఏదో ఒక కోర్సులో చేరుతున్నారు. కాలం మారుతోంది కదా' అని సమాధానపడ్డారు.

ఏనుగెక్కినంత సంబరం కలిగింది దమయంతికి. మళ్ళా వీళ్ళ మనసు మారిపోతుందేమోనని భయపడి వెంటనే వకుళా వాళ్ళింటికి వెళ్ళి చెప్పివచ్చింది.

★ ★ ★

కౌసల్య స్నేహితురాళ్ళలో రమణి బియ్యే చదివి, ప్రభుత్వ ఆఫీసులో ఉద్యోగం చేస్తోంది. శారద ట్రైనింగు చేసి ఉపాధ్యాయినిగా చేస్తోంది. వాళ్ళిద్దరూ తమ తమ పనులతో తీరిక లేకపోయినా వీలు కుదిరినపుడల్లా కలుస్తున్నారు. శారదవాళ్ళింట్లో ఉండే కథలు, నవలల పుస్తకాలు వీలున్నపుడల్లా కౌసల్య చెల్లెళ్ళతో తెప్పించుకొని చదివి ఇస్తుండేది. అప్పుడప్పుడు శారద కలిసినప్పుడు కౌసల్యని ప్రైవేటుగా మెట్రిక్ కట్టమని సలహా ఇస్తూనే ఉండేది. కానీ కౌసల్యకి ఇంట్లో అడిగే సాహసం లేక దాటవేస్తుండేది.

ఒకరోజు శారద వచ్చి కౌసల్యకి పెళ్ళి కార్డు ఇచ్చింది. ఒక నిమిషం కౌసల్య కళ్ళల్లో అసూయ అలలా కదిలిపోయింది. కానీ శారదపైగల ప్రేమాభిమానాలు ఆ ఈర్ష్యను అడుక్కి తోసేశాయి.

"ఏమిటోయ్ ఇంత అకస్మాత్తుగా?!" అని కొంచెం ఆశ్చర్యపోయి ఆనక విశేషాలు అడిగింది.

"అతను మా స్కూలుకి కొత్తగా హెడ్ మాస్టరుగా ప్రమోట్ అయి వచ్చారు. ఏడాదిపైనే అయిందనుకో. ఇటీవల నేను దూరవిద్య ద్వారా ఎమ్మేకి కట్టటానికి యూనివర్శిటీకి వెళ్తే ఆయన కూడా అదే పనిమీద వచ్చారు. ఇద్దరం ఒకే సబ్జెక్టులో చేయాలనుకోవటంతో దగ్గరయ్యాం. అది స్నేహం నుండి ప్రేమగా మారి వివాహం చేసుకోవాలనుకునే దగ్గరికి వచ్చింది. ఇంట్లో ముందు ఒప్పుకోలేదుకానీ చివరకు అంగీకరించారు" నవ్వింది శారద.

కుటుంబంలోగానీ, సమాజంలోగానీ స్త్రీ పురుషులు సమాన గౌరవాలు పొందలేకపోవటం, ఆడపిల్ల అనే చిన్నచూపుకి అలవాటు పడిపోవటం, వరకట్నం - ఇవన్నీ

అ
క్ష
రం

నాకు పిల్లలతో కలిసుండటం, మాట్లాడ్డం..
ఇంకా చెప్పాలంటే వాళ్ళతోపాటు ఆటలాడ్డం ఇష్టం.
ఆ క్షణాల్లో నేనెంత వృద్ధుడినో పూర్తిగా మర్చిపోతాను.

**– జవహర్‌లాల్ నెహ్రూ,**
తొలి భారత ప్రధాని



అమ్మాయిలలో పూర్వపు సౌకుమార్యాన్ని తుడిచిపెట్టేశాయి. ఒకనాటి చిలిపితనాల అమాయకత్వం మచ్చుకైనా కన్పించకుండా నేలమీద కాలు ఆన్చి ఆలోచించటం అల వాటవుతోంది అప్పుడప్పుడే.

"పెళ్ళికి తప్పకుండా రావాలి సుమా! చెల్లెళ్ళని కూడా తీసుకురా! భారతి మరీ మరీ చెప్పమంది, వస్తాను" అని చెప్పి కామాక్షమ్మకి కూడా విషయం చెప్పి వెళ్ళి పోయింది శారద.

'అందరికీ పెళ్ళిళ్ళు అవుతున్నాయి. ఏమిటో మన రాతే యిలా ఉంది' నిట్టూర్చి చెమ్మగిల్లిన కళ్ళు తుడుచుకుంది కామాక్షమ్మ.

ఇంకా అక్కడే ఉంటే పురాణం అంతా విప్పుతుందని భయపడి కౌసల్య వంటిం ట్లోకి నడిచింది.

భోజనాలప్పుడు కౌసల్య "శారద పెళ్ళికి అందర్నీ రమ్మంది" అని చెప్పింది. 'ఎవరె వరు వస్తారు?' అని చెల్లెళ్ళని సూటిగా అడగలేక అంతటితో ఆగిపోయింది.

"నాకు నీరసంగా వుంది. నేను రాలేను బాబూ" అంది మణి.

"నువ్వో?" అన్నట్లు దమయంతి వైపు చూసింది. అప్పుడే నోట్లో ముద్ద పెట్టు కున్న దమయంతి రానన్నట్లు తల అడ్డంగా ఊపింది.

"ఏం?"

"నాకు టైప్ చేయాల్సినవి ఉన్నాయి. అదీగాక.." ఆగిపోయింది.

"నేను మాత్రం తప్పక వస్తాను. లేక పోతే భారతి ఊరుకోదు" అంది యశోద.

భోజనాలు పూర్తయ్యాక పక్కమీద బోర్లా పడుకొని కథల పుస్తకం తెరిచింది కానీ, కౌసల్యకి దానిమీద మనసు నిలవ లేదు. ఇటీవల పెళ్ళిళ్ళకి, పేరంటాలకి వెళ్ళటం తగ్గించిందామె. ఇంకా పెళ్ళి కుద రనందుకు సానుభూతి చూపేవాళ్ళని భరించటం కష్టంగా ఉంది. కానీ శారద పెళ్ళికి వెళ్ళకతప్పదు. వెళ్ళకపోతే అసూ యతో రాలేదనుకుంటారేమో! అదీగాక శారద మరీ మరీ చెప్పింది.

'శారద అదృష్టవంతురాలు. తనకి పెళ్ళయ్యే గీత ఉందో? లేదో? ఇంక నాన్న రిటైర్‌మెంటుకు నాలుగైదేళ్ళు ఉందేమో! అప్పటికి ప్రభాకరానికి చదువు పూర్తయి ఏదో ఒక ఉద్యోగంలో చేరితే ఇంటికి ఆసరా అవుతాడు. కానీ ఇందరి పెళ్ళిళ్ళు ఎలా అవుతాయో? కథల్లో చెప్పి నట్లో, సినీమాల్లో చూపినట్లో ఎవరూ తనని ప్రేమించనైనా లేదే. అలా అయినా బాగుండును. కానీ తనకి నిజంగా అంత ధైర్యం ఉందా? తనకేగాదు, చెల్లెళ్ళకీ లేదు. చేసుకుంటే యశోద చేసుకోవాలి' అలా ఆలోచిస్తూ నిద్రలోకి జారుకుంది. కానీ మనసు ప్రశాంతంగా లేక రాత్రంతా కలత నిద్రే. యవ్వనపు తొలి రోజుల్లో కలలు, ఊహలు వీటిమీదే బతకటం వలన ఆ రోజుల్లో కలత నిద్రే అయినా మధురం గానే ఉండేది. కానీ ఈనాడు నిద్రలో కూడా ఈ బాధతో కూడిన ఆలోచనలు సలుపుతూనే ఉన్నాయి.

మర్నాడు కాలేజీకి వెళ్తూ యశోద "తొందరగానే వచ్చేస్తాను. కలిసే వెళ్దాం"



అని చెప్పింది.

"సరేలే" అని సమాధానం చెప్పి వంటింట్లో అన్నీ సర్దుకొని పెరట్లో బావిద గ్గర బట్టలుతకడం మొదలెట్టింది కౌసల్య. తల్లికి ఏ పనీ చేయలేనంత అనారోగ్యం. దాంతో ఇంటిపనంతా కౌసల్య మీదే పడిం ది. మణి సరేసరి, పనులు చేయలేదు.

బకెట్టులో నానబెట్టిన బట్టలు చూసి హతాశురాలైంది కౌసల్య.

'వెధవ పని.. ఎంత చేసినా తెమలదు. చిన్నామె కాలేజీ స్టూడెంటు, క్లాసుందని బట్టలు ఉతక్కుండాపోయింది. మంచం మహారాణిగారి సేవ తప్పనిసరి. దమ యంతి మాత్రం తన పనులేవీ వదిలే యదు. పైపెచ్చు సాయం కూడా చేస్తుంది. ఇదుగో ఈ వెధవ, రోజుకో జత విప్పి పడేస్తాడు. వాడిని ఏమన్నా అంటే నా మీద గయ్యిమంటారు. సుపుత్రుడని బాగా ముద్దు మప్పేశారు. నా పనెప్పుడు పూర్తవుతుందో బజారు ఎప్పుడు వెళ్ళాలో' అసలే చికాకుగా ఉందేమో గొణుక్కుంటూ బట్టలుతికింది కౌసల్య.

అప్పుడే స్నానం చేసిన దమయంతి తా ను జాడించుకున్న బట్టలు ఆరేసి కౌసల్య



కు బట్టలు ఆరేయడంలో సాయపడింది.

పని పూర్తిచేసుకొని దమయంతి, కౌసల్య యిద్దరూ పెళ్ళికి బహుమతి కొనేందుకు బయల్దేరారు.

"నాన్నగారు పది రూపాయలిచ్చారు. అమ్మ పాతసామానులేవో అమ్మగా వచ్చినవి ఒక అయిదు రూపాయలిచ్చింది. నెలాఖరు కావడంతో మరీ యిరకాటం అయింది. వీటితో ఏం కొనగలం? " దమయంతిని సలహా అడిగింది.

దమయంతి తన పర్సులోంచి ఒక పది రూపాయలు తీసి అక్కకి యిస్తూ "నేను టైపు, షార్టుహాండు సెంటర్‌లో నేర్చుకుంటూనే ఎవరైనా టైపు చేయించుకోవాలని వస్తే వారికి చేస్తున్నాను. అలా వచ్చిన డబ్బులు. ఇవి కూడా కలిపి చిన్న వెండి భరిణ కొనక్కా! బొట్టు పెట్టుకున్నప్పుడల్లా మీ స్నేహం గుర్తొస్తుంది" అంది.

చెల్లెలివైపు మెచ్చుకోలుగా చూసి డబ్బు తీసుకుంది. ఆ డబ్బుతో కటాకటిగా సరి చూసుకొనే ఓ చిన్న వెండిభరిణ కొన్నారు.

తిరిగి వస్తుంటే ఎవరో అబ్బాయిలు వెనకే వస్తూ కామెంట్లు చేస్తున్నారు. ఆ మాటలు దమయంతిని ఉద్దేశించేనని గమ

నించిన కౌసల్యకి చురుక్కుమంది. 'దమయంతిని మాత్రమే అంటున్నారంటే తాను వయసు మీరినట్లు కనిపిస్తోందా?' అనుకుని దమయంతిని చూసీచూడనట్లుగా పరిశీలించింది. ఎక్కువగా ఏమీ తయారు కాకపోయినా ఇరవయ్యేళ్ళు దాటిన దమయంతి పెద్దపెద్ద కళ్ళతో ఆకర్షణీయంగా నాజూగ్గా వుంది. తాను చిన్న వయసు నుండీ ఇంటిచాకిరీకి అంకితమై మొరటుగా కన్పిస్తున్నదేమో!' అనుకుంది. చిన్నప్పుడే తనచేత యింటిచాకిరీ చేయించిన తల్లిపై కౌసల్యకి కోపం కలిగింది.

ఇంటికి వచ్చిన తర్వాత కూడా చిరాకు తగ్గలేదు కౌసల్యకు. బయల్దేరినపుడు ఉత్సాహంగా ఉన్న అక్కలో ఆ విసుగు ఎందుకో దమయంతికి అర్థంకాలేదు. వచ్చిన వెంటనే కాస్త మంచినీళ్ళు తాగి తిరిగి ఫైలు తీసుకొని టైపు ఇన్‌స్టిట్యూషన్‌కు బయల్దేరిపోయింది దమయంతి.

చెప్పిన సమయంకన్నా ముందే ఇంటికి వచ్చేసిన యశోద "ఈరోజు అదృష్టంకొద్దీ స్టాఫ్ మీటింగుందని మమ్మల్ని తొందరగా పంపించేశారు" అంది.

దమయంతి టైపు క్లాసుకి వెళ్ళిపోవటంతో కౌసల్యా, యశోదా వంట, గిన్నెలు కడగడం ముగించారు.

తర్వాత ఇద్దరూ ముస్తాబై పెళ్ళికి బయల్దేరారు. దారంతా యశోద తన కాలేజీ కబుర్లవీ గలగలా చెప్పుకుపోతోంది. ఇంకా చికాకు తగ్గని కౌసల్యకి దారిలో కనిపించే అబ్బాయిలందర్నీ ఆకట్టుకోటానికే యశోద అలా నవ్వుతూ మాట్లాడుతోంది అనిపించింది. దాంతో చిరాకు మరింత ఎక్కువై "అందరూ వినేలా అలా వాగుతూ ఉండాలేమిటి? కాస్త నోరు మూసుకు నడవలేవా?" అంటూ గసిరింది. ఆ మాటలు అర్థంకాని యశోద అప్పుడు గమనించింది అక్క మూడ్ బాగోలేదని.

ఇంతలో పెళ్ళివారిల్లు వచ్చేసరికి ముఖంలోకి నవ్వు తెచ్చుకుంది కౌసల్య. గుమ్మంలోనే భారతి కనిపించేసరికి అక్కను లోపలికి వెళ్ళమని ఆమెతో చేరింది. కౌసల్య లోనికి వెళ్ళేసరికే పెళ్ళికొడుకు పీటలమీద కూర్చున్నాడు. పురోహితుడు మంత్రాలు చెప్పిస్తున్నాడు. "పెళ్ళికూతురు గదిలో ఉంది వెళ్ళమ్మా" అని శారద వాళ్ళ పిన్ని చెప్పేసరికి అటు నడిచింది. కానీ అప్పుడే పెళ్ళికూతుర్ని బుట్టలో పెట్టి మేనమామలు తీసుకొస్తున్నారు. అక్కడినుండే శారద పలకరింపుగా ఒక నవ్వు విసిరింది.

"రమణి ఇంకా రాలేదేమిటి?" అని ఆశ్చర్యపోతూ ఎదురుచూస్తూ కూర్చుంది. శారద దగ్గరబంధువులంతా తనకి తెలిసినవాళ్ళే అయినా అందరూ ఎవరి హడావుడిలో వాళ్ళున్నారు. దాంతో ఒంటరిగానే కూర్చుంది. దూరంగా భారతీ, యశోద కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు. అది చూసేసరికి కౌసల్యకి అరికాలిమంట నెత్తికెక్కింది. 'వీళ్ళకి మరీ విరగబాటు ఎక్కువైంది. ఒకటే యికయికలు, పకపకలూను. అబ్బాయిలకు వల వెయ్యటానికి కాకపోతే ఎందుకా వేషాలు? మేమెప్పుడైనా అలా చేశామా?' అనుకుంటూ ఒక్కసారి ఉలిక్కిపడింది కౌసల్య. 'తాను ఇంకా చిన్న వయసులోనే ఎన్నో కలలు కనటం వూహల్లో తేలిపోవడం చేసేది. మరి తన చెల్లెళ్లు కూడా అలాంటి ఊహాగానాల్లోనే ఉంటున్నారా? మణి జబ్బుతో ఉంది. అయితే మాత్రం అనుభూతి మనసుకు కలగకుండా వుంటుందా? దమయంతి, యశోదా బయట తిరిగేవాళ్ళే. ఏమాటకామాటే చెప్పుకోవాలి. ఎప్పుడూ ఒద్దికగానే ఉంటారు. యశోద తరహాయే అంత. నవ్వుతూ తిరుగుతూ వుంటుంది. ఇందాక అనవసరంగా కోప్పడ్డాను. అబ్బబ్బా ఆలోచనలు ఎక్కడికొచ్చినా వదలవేంటి! పెళ్ళిని చూడనీకుండా మనసుకి తెరలు కడ్తున్నాయి' అని తల విదిలించు

కొని పెళ్ళిమీద దృష్టిపెట్టింది.

"మా అక్క ఒక్కతే కూచుంది. నీకు పనులున్నాయేమో మంటపం దగ్గరకెళ్ళు. నేను అక్క పక్కనే ఉంటా" అంటూ వచ్చి కౌసల్య పక్కన చతికిలపడింది యశోద.

పూర్వం ఏ పెళ్ళికి వెళ్ళినా తనకు జర గబోయే పెళ్ళి గురించి ఆలోచనలు కది లేవి. కానీ యిప్పుడు నిర్లిప్తత ఆవహిం చింది. పన్నెండేళ్ళ వయసునుండి కలలు కని ఇప్పుడు అలసట వచ్చేసింది.

ఆలోచనలు తెగిపోయి గుండె ఝల్లుమ న్నట్లయింది కౌసల్యకి. ఒక పెద్దామె సూత్రాలు తీసుకొని పెళ్ళయిన ఆడవాళ్ళ మెడలకి తాకించుతూ కౌసల్య మెడకి కూడా తాకించడంతో అప్రయత్నంగా నిట్టూర్చింది. యశోద సోదరి మనసులోని ఆలోచనల కనుగుణంగా రంగులు మారు తున్న ముఖాన్ని గమనించి కూడా తాను గుర్తించినట్లు తెలియనీకుండా పక్కవాళ్ళని పలకరించింది.

'రమణి ఎందుకు రాలేదో?' తనలో తాను అనుకున్నట్లుగా బైటికే అంది కౌసల్య.

"శారదక్క నీకు చెప్పలేదా?" ఆశ్చ ర్యంగా అంది యశోద.

"ఏమిటి?" ప్రశ్నించింది.

"ఇందాకే భారతి చెప్పింది. రమణిఅక్క వాళ్ళ బంధువు మురళి అనీ రమణక్కతో పాటు మనింటికి కూడా వచ్చేవాడు.."

"పెళ్ళి చేసుకుంటాం అని కూడా చెప్పేది.." మధ్యలో కలిపింది కౌసల్య.

"ఆ.. అతనే.. అతనికిప్పుడు లెక్చరరుగా ఉద్యోగం వచ్చిందట. అతనికి వేరే సంబం ధాలు చూస్తున్నారని తెలిసి, మురళి, రమణి తామిద్దరం వివాహం చేసుకుంటా మని పెద్దలకి చెప్పారట. రమణక్కావాళ్ళ నాన్న మురళి వాళ్ళింటికి సంబంధం గురించి అడగటానికి వెళ్ళారట. మురళి వాళ్ళ అమ్మ కజిన్ సిస్టరేనట. కానీ రమ ణక్కని కోడలిగా తెచ్చుకుంటే కట్నాలు

## కొత్తగాలి...

**వలువకే విలువనుకుంటే**
**వేమన**
**చరిత్రకెక్కేవాడు కాదు!**
**గాంధీజీ**
**కరెన్సీ మీద నిలిచేవాడు కాదు!**

*- లోగిశ లక్ష్మీనాయుడు,*
*సింహాచలం*

రావని బయట సంబంధాలకోసం చూస్తు న్నారట. కట్నం ఇవ్వటానికి కూడా అక్కా వాళ్ళు ఒప్పుకున్నారటకానీ రేపు మాపు అని తాత్సారం చేస్తున్నారట" ఒక ఊపున కథంతా చెప్పింది యశోద.

"అవును రమణి అంటూ ఉండేది, తన జీతం అంతా బ్యాంకులోనే దాచుకోమని వాళ్ళనాన్న అంటూ ఉంటారట.. కట్నా లకో, ఖర్చులకో పనికొస్తుందని. అది కూడా చాలదా?" అంది కౌసల్య.

అంతలో భోజనాలకి పిలుపు రావ టంతో లేచారు. భోజనాలయ్యాక శారద దగ్గర కాసేపు కూర్చుంది కౌసల్య. అప్పుడు మళ్ళా రమణి ప్రస్తావన వచ్చింది. శారద కూడా ఈ విషయాలే చెప్పింది. "రమణి చాలా బెంగ పెట్టుకుంది. అందుకే 'పెళ్ళికి రాలేనేమో' అని చెప్పింది" అంది శారద.

శారద భర్త కట్నం తీసుకున్నాడో లేదో అడుగుదామనుకుంది కౌసల్య. కానీ మొగ మాటం కొద్దీ ఊరుకుంది. అంతలో యశోద, భారతితో కలిసి వచ్చింది. "అక్కా! ప్రభాకరాన్ని నాన్న మనకోసం పంపించారు. బాగా రాత్రయ్యింది. ఇక బయల్దేరుదామా?" అంది.

"శారదా! ఇక వెళ్తాం. ఊరు వెళ్ళే ముందు మా యింటికి ఒకసారి రావాలి" అని రెండడుగులు వేసి మళ్ళా వెనక్కి

వచ్చి, "రమణి విషయం తెలిస్తే నాకు తెలియపర్చు. అది నన్ను పూర్తిగా మర్చి పోయినట్లుంది" అంది.

"తప్పకుండా వస్తాలే. అయినా అత్తగారి ఊళ్ళో ఎక్కువ రోజులు ఉండం. అతనికి కూడా ఇక్కడే ఉద్యోగం. వేరే ఇల్లు తీసు కొని కాపురం పెడ్తాం. కలుస్తుంటాలే" అంది శారద.

ఇద్దరూ బయటకి నడిచారు.

దారిలో యశోద అంది "ప్రేమపెళ్ళి అన్నారు. తీరా వీళ్ళూ కట్నాలు ఇచ్చి పుచ్చుకునే చేసుకున్నారట! అటువంట ప్పుడు ఇదేం ప్రేమో మరి!"

"ఎవరు చెప్పారు? " నిరుత్సాహంగా అంది కౌసల్య.

"అదే, భారతి చెప్పింది. తనకసలే ఇలాంటివి చికాకు. ప్రేమపెళ్ళిళ్ళకి కూడా కట్నాలు అడ్డు వస్తుంటే ఇంకెలా ఈ సమస్య తీరుతుందో? అర్థం కావటం లేదు" కొంచెం ఆవేశం ధ్వనించింది.

కౌసల్య ఏమీ మాట్లాడలేదు.

రాత్రంతా కౌసల్యకి అవే ఆలోచనలు

'ఇన్నాళ్ళూ ప్రేమపెళ్ళిళ్ళు చేసుకున్నా బాగుండేది, అంత ధైర్యం, చొరవా నాకు లేవని బాధపడ్డాను. కానీ చదువుకొని ఉద్యోగాలు చేస్తున్న శారద ప్రేమపెళ్ళికి, రమణి బంధుప్రేమకి కూడా వరకట్నం అవరోధంగానే మారి, కట్నం యిచ్చాకే వివాహం జరిగిందంటే ఇంక నా లాంటివా రికెలా జరుగుతుంది? ' అనుకుంది.

ఆ మర్నాడు కామాక్షమ్మ ద్వారా శారద ప్రేమించి కులాంతర వివాహం చేసుకుం దని విని రామారావు కోపంతో కస్సుబు స్సులాడాడు. "ఈ విషయం ముందే తెలి సుంటే వీళ్ళని పెళ్ళికి వెళ్ళనిచ్చేవాణ్ణికాదు. నీకన్నా బుద్ధిలేదా, అలాంటి పెళ్ళికి పిల్లల్ని పంపటానికి? " అని భార్యమీద ఎగిరాడు.

"నాకేం తెలుసండీ? వీళ్ళు పెళ్ళికి వెళ్ళి వచ్చాక చెప్తేనే తెలిసింది" అని కామా క్షమ్మ చెప్తున్నా ఆయన కోపం తగ్గలేదు.

యశోద, ప్రభాకరం అప్పటికే కాలేజీకి వెళ్ళిపోయారు.

దమయంతికి టైపు చేయాల్సిన జాబ్ వర్కు ఎక్కువుందని తొందరగా కాస్తంత పెరుగన్నం తిని వెళ్ళిపోయింది. ఇక మిగి లింది కౌసల్య. ఉరుము ఉరిమి ఎక్కడ పడుతుందా అని కామాక్షమ్మకి గుండె దడ దడలాడుతోంది. రామారావు ఆ రోజు స్కూలుకి వెళ్ళటం మాని ఇంట్లోనే ఉన్నాడు. రోజూలా తొమ్మిదింటికి అన్నం తిని వెళ్ళే తండ్రి భోజనానికి రాకపోయేస రికి కౌసల్య తల్లిని "ఏంటమ్మా! నాన్నగారు ఈరోజు స్కూలుకి వెళ్ళడం లేదా? ఒంట్లో బాలేదా ఏమిటి? " అని ప్రశ్నించింది.

భర్తకు వినబడకుండా కౌసల్యతో "శార ద కులాంతర వివాహం చేసుకుంటే దానికి మిమ్మల్ని పంపించానని, విషయం తెలిసి న దగ్గరనుండీ నా మీద మండిపడుతు న్నారు. నిన్నూ తిడతారేమో? " అంటూ గుసగుసగా విషయం చెప్పింది.

కౌసల్య ఆశ్చర్యపోయింది. "శారద చేసు కుంటే మనకేమిటి? " అంది.

అంతలోనే ముందుగదిలోంచి ఉరు ములా వినిపించింది "కౌసల్యా..!" అంటూ పెద్ద కేక.

మనసులో కాస్తంత భయం అనిపిం చినా ధైర్యంగానే వెళ్ళింది కౌసల్య.

"నీకు తెలియదా శారద కులాంతర వివాహం చేసుకుంటున్న విషయం? " కౌసల్య ముందుగదిలో అడుగుపెట్టగానే గట్టిగా రెట్టించినట్లుగా అడిగాడు.

"నాకేం తెలియదు, ప్రేమపెళ్ళి అని మాత్రమే తెలుసు" అంది కౌసల్య, తానేదో తప్పు చేసినట్లు తలవంచుకొని.

"నాకు మొదటినుండి శారదతో నీ స్నేహం ఇష్టంలేదు. పోనీలే అని ఇన్నాళ్ళూ ఊరుకున్నాను. యశోదకి కూడా చెప్పు వాళ్ళతో పూసుకు తిరగొద్దని. ఇంకె

ప్పుడైనా నువ్వుగానీ, నీ చెల్లెళ్ళుగానీ వాళ్లింటికి వెళ్ళినా, వాళ్ళు వచ్చినా ఊరుకునేది లేదు. కథల పుస్తకాలూ, కాకరకాయ లంటూ పదేపదే వెళ్ళి తెచ్చుకొని చదవడాలవీ మాను. ఇవే మీ అందర్నీ పాడుచేస్తున్నాయి. వింటున్నావా? లేదా? అలా ముంగిలా ఉండటం కాదు. యశోదకీ చెప్పు. మళ్ళీమళ్ళీ నాతో చెప్పించుకోకు.." కోపంగా కళ్ళెర్రచేసి వార్నింగు ఇస్తున్నట్లుగా చెప్పాడు రామారావు.

అంతకోపాన్ని ఎప్పుడూ చూడని కౌసల్య బిత్తరపోయి నోటమాట రాక మౌనంగా తల ఊపింది.




కౌసల్యకి రానురాను మార్పులేని జీవితం విసుగు పెంచుతోంది. 'ఎప్పుడూ ఈ వంట, ఈ అంట్లగిన్నెలు, ఈ బట్టలు ఉతకటాలు ఇదేనా జీవితం? అయినా పెళ్ళయితే ఇవన్నీ తప్పుతాయా?' మనసు ప్రశ్నించింది.

'తప్పవు కానీ అక్కడ నాది అనే స్వార్థం ఉంటుంది. నా ఇల్లు, నా భర్త, నా పిల్లల కోసం అని చేయగల్గుతానేమో? వాళ్లూ అదే భావాన్ని నాతో పంచుకునేవాళ్ళేమో? కానీ ఇక్కడ ఎంతచేస్తే ఏముంది? మహా అయితే తమ్ముడి పెళ్ళివరకు ఉంటుంది స్వతంత్రం. తర్వాత వాడి పెళ్ళానిదే కదా హక్కు.' అనుకుంది. కౌసల్య. ఆలోచనలు ఎటో వెళ్ళిపోతుంటే నిరుత్సాహంగా కూచుండిపోయింది.

అప్పుడే దగ్గు ఎక్కువగా వచ్చిన మణి మంచినీళ్ళు తాగటానికి వంటింట్లోకి వచ్చింది. అక్కడ అక్క గొణుగుడు వినిపిస్తూనే ఉంది. 'తనని గురించి కూడా గొణుగుతూ ఉండే ఉంటుంది. కానీ ఏం చెయ్యగలదు తను? ఓపిక ఉండటం లేదు. అప్పటికీ దమయంతో, యశోదో తన బట్టలు ఉతకటంవంటి సాయాలు చేస్తూనే ఉంటా రు. ఏమిటో ఇలా అందరిచేతా సేవ చేయించుకోవటం ఎప్పటికి తప్పుతుందో? తనకి వచ్చిన జబ్బు తగ్గేది కాదని, బాగా ముదిరిపోయిందని అమ్మతో నాన్న చెబుతున్నపుడే విన్నది. అప్పటి నుండే కలలు, ఊహలు కట్టిపెట్టి జీవచ్ఛవంలా మృత్యు కౌగిలికోసం ఎదురుచూస్తోంది..' వెనక్కుపోయి మంచంమీద పడుకొని ఆలోచిస్తున్న మణికి ఆగకుండా కన్నీరు జారి తలగడలోకి ఇంకిపోతున్నాయి.

అంతలోనే ఛాతీలో నొప్పి మొదలైంది. భరించలేని బాధతో మెలికలు తిరిగిపోయింది. పిలవటానికి గొంతు పెగల్లేదు. అప్పుడే ఎదురు మంచంమీద పడుకున్న కామాక్షమ్మకి మెలకువ వచ్చింది. లేవలేనంత నీరసంగా ఉన్నా అలాగే లేచి మణి దగ్గరికి వచ్చింది.

కామాక్షమ్మ అల్మరాలోంచి టేబ్లెట్లు తీసి, గ్లాసుతో మంచినీళ్లు తీసుకొచ్చి మణిని కూచోబెట్టి మింగించింది. అప్పటికి మణి సర్దుకొన్నట్లై మగతగా పడుకుంది.

'ఆ దేవుడు ఏం రాత రాశాడో? ఇలా ఉన్నాయి జీవితాలు' అనుకున్న కామాక్షమ్మకి కళ్ళు చెమ్మగిల్లాయి. నిల్చునే ఓపిక లేక మంచం మీదే చేరబడింది.

రెండుమూడు రోజులయ్యేసరికి మణికి కొంచెం తేలిగ్గా ఉంది. ఆ రోజు వేడినీళ్ళ స్నానం చేసేసరికి ప్రాణానికి హాయిగా అనిపించింది. స్నానం చేసి తన బట్టలు

## కొత్తగాలి...

**వందకోట్లకు**
**అధిపతి వాడు**
**ఒక్క నిమిషాన్ని**
**వెనక్కు తిప్పలేడు**

– *వి.వి. రమణకుమార్,*

*చిలకలూరి పేట, గుంటూరు జిల్లా*

కూడా తానే జాడించుకొని ఆరేసుకుంది. దాంతో మళ్ళా కొంచెం అలసటగా అనిపించి మంచం మీద కూర్చుంది.

'ఈ రోజు కొంచెం తేలిగ్గా తిరుగుతోంది' అనుకున్నారు అందరూ. కామాక్షమ్మకు కూడా ఒళ్ళునొప్పులు అవీ తగ్గి లేచి తిరిగింది. చాలారోజుల తర్వాత ఇంట్లో అందరూ కలిసి సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేశారు. మధ్యాహ్నం కూడా మణి పత్రికల్లో సీరియళ్ల గురించి ఏవేవో చాలా కబుర్లు చెప్పింది.

"సాయంత్రం సినిమాకు వెళ్తే బాగుండును. చాలా రోజులైంది బైటకివెళ్ళి" అంది మణి.

"ఇంకా నీరసంగా ఉన్నావు, ఇప్పుడేం వెళ్తావు? ఈ రోజుకు కబుర్లు చెప్పుకున్నారు కదా. మరో రెండురోజులు పోనీ మరి కొంచెం శక్తి వస్తుంది అప్పుడు వెళ్దూగాని" అంది కామాక్షమ్మ.

రాత్రి కూడా భోంచేసి పడుకున్నారు. నాలుగైదు రోజుల నుండి కామాక్షమ్మకి, మణికి బాగాలేకపోవడంతో రాత్రంతా టైముకి వంతులవారీ లేవటం, వాళ్లిద్దరికీ మందులు వేయటంతో సరిగా ఎవరికీ నిద్రలు లేవు. ఆ రోజు మణి మామూలుగా తిరగటంతో అందరూ మనసులు నిమ్మళించి హాయిగా నిద్రపోయారు.

అర్ధరాత్రి సమయంలో మణికి అకస్మాత్తుగా గుండెల్నెవరో పిడికిట్లో బిగించి నలిపేస్తున్నట్లు అయిపోయింది. ఊపిరి అందక ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. బాధ భరించలేక గుండెల్ని చేతుల్తో ఒత్తుకుంది. గొంతు పెగలటం లేదు. నోటితోనైనా గాలి పీల్చుకుందామంటే చేతకాలేదు. అందరూ ఒళ్లు తెలియకుండా పడుకున్నారు. చెయ్యి చాపింది. కానీ ఎవరూ అందే దూరంలో లేరు. ఏం చేయాలో తోచలేదు. గుండెల్ని నమిలేస్తున్నట్లుగా బాధ! లోపల్లోపల్లోంచి దగ్గుతెర ఉబికి వస్తోంది. మెల్లిగా లేచింది. కానీ నిలవలేక చతికిలపడింది. ఇంతలో భళ్లున వాంతి అయిపోయింది. మసకవెల్తురులో ఆ రక్తపు వాంతి చీకటి ప్రవాహంలా వుంది. ఆ అలికిడికి దమయంతి లేచింది.

అస్తవ్యస్తంగా సగం మంచం మీదా, సగం నేలమీదా ఉన్న మణినీ, ఆ రక్త ప్రవాహాన్ని చూసేసరికి భయం వేసి కెవ్వుమంది. దాంతో అందరూ ఉలికిపడి లేచారు. కానీ అప్పటికే చుట్టూ పడుకున్న వారందర్నీ దాటుకొని మణి ప్రాణం చివరి వీడ్కోలు ఎవరికీ చెప్పకుండానే గాల్లోకి కలిసిపోయింది.

ఒక్కసారి అందరూ గొల్లుమన్నారు. పక్కగదిలో పడుకున్న రామారావు, ప్రభాకరం కూడా గాభరాగా వచ్చారు. భర్తని చూస్తూనే బావురుమంది కామాక్షమ్మ.

"నలుగురు ఆడపిల్లల్ని కనేశావేంటే కాముడూ- అని రోజూ ముఖం ముడుచుకునేవారు. పిల్ల పుట్టినదగ్గర నుండీ అనారోగ్యంతో బాధపడి, మనల్ని బాధపెట్టి ఈనాడు అందరికీ తన బాధ అక్కరలేదని చెప్పి వెళ్లిపోయింది మణెమ్మ..

ఏనాడూ ఆడపిల్లలకి మీ ప్రేమ పంచలేదు. నలుగురాడపిల్లలకి ఎలా పెళ్లిళ్లు చేస్తానో అని బెంగ పెట్టుకున్నారు కదా! ఆ లెక్క తప్పించాడు దేవుడు. ముగ్గుర్నే మిగిల్చాడు ఆ తండ్రి..

'నాలుగు పదులు నలభై వేలెక్కణ్ణుంచి తేనే కాముడూ? ' అన్నారు కదండీ! కట్నం డబ్బు తగ్గించింది మణెమ్మ తల్లి.."

ఇన్నాళ్లూ కడుపులో దాచుకున్న బాధంతా ఏడుపు రూపంలో ఫైనాలు ఫైనాలుగా శోకాలు తీస్తోంది కామాక్షమ్మ. అసలే బలహీనమైన ప్రాణం కావటాన ఉండుండి సొమ్మసిల్లి పడిపోతోంది. ఆమెనెవరూ ఆపలేకపోయారు- పిల్లలూ, భర్తా కూడా. చుట్టుపక్కలవాళ్లూ వచ్చేశారు. తెలిసిన వాళ్లచేత బంధువులకి కబురు పంపించారు. వాళ్లందర్నీ చూస్తుంటే కామాక్షమ్మ దుఃఖం మరింత వెల్లువైంది.

తెలతెల్లవారగానే అంతిమయాత్ర సన్నాహాలకి అన్నీ ఏర్పాటు చేయటానికి బయల్దేరారు. ఏడుకట్ల సవారీ సిద్ధమైంది.

మళ్లీ కామాక్షమ్మ శోకం పెంచింది. "పెళ్లిచేసి కన్యాదానం చేసి పంపవలసింది ఈనాడు నిన్నిట్లా పంపుతున్నాం మణెమ్మ తల్లీ. నీ కన్నెచెరనుండి మేమెట్లాగూ తప్పించలేకపోతున్నామని నువ్వే ఈ లోకపు చెరనుండి వెళ్లిపోయావా తల్లీ.. తొమ్మిది నెలలూ మోసి కన్నాను. పాతికేళ్లు కళ్లముందు పెరిగి ఈనాడిలా వెళ్లిపోతున్నావా..? " ఏడుస్తూనే ఉంది కామాక్షమ్మ.

"ఊరుకో కాముడూ! ఎంత ఏడిస్తే మాత్రం తిరిగి వస్తుందా..? '

"పోయినోళ్లు అదృష్టవంతులు అని మనసు కుదుటపరచుకోవాలి'

'దాని రుణం తీరిపోయింది. వెళ్లిపోయింది. ఏం చేస్తాం? '

'పాపం మంచిపిల్ల! ఏనాడూ మాట వినబడేదికాదు'

'అయినా మాట్లాడ్డానికి ఆ పిల్లకి ఏనాడైనా ఆరోగ్యం బాగుండేదా? ఏమన్నానా? '

'అంత అనారోగ్యంతో బతికిమాత్రం ఎందుకులేమ్మా? ఇప్పటికన్నా ఆ బాధలు తప్పి విముక్తురాలైందని అనుకోవాలి' ఇలా రకరకాలుగా ఓదార్పులు, సముదాయింపులు వినిపిస్తూనే ఉన్నాయి.

★ ★ ★

కాలం ఆగదు కదా.. రోజులు గడుస్తూనే ఉన్నాయి. యశోద, ప్రభాకరం కాలేజీకి, దమయంతి టైపుకి యథాప్రకారం వెళ్తున్నారు.

మణి గుర్తులు ఇంట్లో కనిపించకపోయినా మనసుల్లో అందరికీ మెదులుతూనే ఉన్నాయి. కానీ పైకి ఎవరూ తొణకడం లేదు. మర్చిపోయినట్లే తిరుగుతున్నారు. కానీ ప్రతి ఒక్కరికీ తెలుసు మణి స్మృతి పచ్చిగానే ఉందని. కామాక్షమ్మ కూడా ఆ ప్రస్తావన తేవటం లేదు. కానీ చాలారోజుల వరకూ అర్ధరాత్రిపూట మణికి మందివ్వాల్సిన సమయంలో అందరికీ మెలకువ వస్తోంది అలవాటు ప్రకారం. కుమిలికుమిలి మెల్లగా కన్నీరు కారుస్తున్న కామాక్షమ్మనీ చూస్తున్నారు. కానీ అందరూ నిద్రపోతున్నట్లు కళ్లుమూసుకొనే ఉంటున్నారు. ఆ కళ్లల్లోంచి నీళ్లు జారి నిశ్శబ్దంగా తలగడల్లోకి యింకిపోతూనే ఉన్నాయి.

మణి పోయిన తర్వాత దమయంతి, యశోద కౌసల్యలు తల్లి కామాక్షమ్మ శోకంతో తండ్రికి తమ పట్లగల వివక్ష విషయం మరింతగా తెలుసుకున్నారు. బాల్యం నుండి జరిగిన విషయాలన్నీ ఆ ముగ్గురి మనసు అడుగుపొరల్నుండి బయటకు వచ్చాయి. ప్రభాకరానికి పుట్టిన రోజునాడు తండ్రి బట్టలూ, మిఠాయిలు తేవటం, అక్షరాభ్యాసం ఘనంగా చేయటం, తమ్ముణ్ణి చేరదీసినట్లు తమని చేరదీయకపోవటం వీటన్నిటికీ గల కారణాలు బాగా అర్థమయ్యాయి. ఇన్నాళ్లూ యింత లోతుగా గమనించనందుకు వాళ్లకి ఆశ్చర్యం కూడా కలిగింది.

ప్రభాకరానికి కూడా తల్లి ఏడుపుతో ఆడపిల్లలుగా తన అక్కచెల్లెళ్లు ఎలా పెరి

గారో తలచుకుంటే బాధ కలిగింది. ఇన్నాళ్లూ అక్కలదగ్గర తాను మగమహారా జుని అన్నట్లు ప్రవర్తించినందుకు సిగ్గు కూడా కలిగింది. ఇకపైన అక్కలని అర్థం చేసుకొని నడుచుకోవాలి అనుకున్నాడు.

అంతేకాకుండా శారద వివాహం తర్వాత రామారావుకి కలిగిన ఆగ్రహం, కౌసల్యకి శారద కుటుంబంతోగల స్నేహాన్ని కత్తిరిం చేయటానికి ప్రయత్నించటం అక్కచెల్లెళ్లకి మింగుడు పడలేదు.. కానీ తరాల అంత రంలోని మార్పులను అర్థం చేసుకోకుండా తమపై విధించిన ఆంక్షకి మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన ఆ అక్కచెల్లెళ్లు నోరు మెదపలేదు. చిన్నదైన యశోదకి మాత్రం తండ్రిమీద కోపం వచ్చింది. అయినా అక్క కౌసల్య "పెద్దవారు కదా నాన్న గారు.. వాళ్ళు కాలంతోబాటు మార్పుని అంగీకరించలేరు. ఊరుకో యశూ! నాకైతే తప్పదు. భారతితో ఈ విషయాలేవీ చెప్పకు. మీ స్నేహాన్ని ఇంటివరకూ తేకు. నాన్నగారికి తెలియనీయకు" అంది.

"భారతి వాళ్లింట్లో అందరూ ఆధుని కంగా ఆలోచిస్తారు. అంతమాత్రాన చెడి పోయినట్లేనా!" యశోద గొణుక్కుంటూ ఊరుకుంది.

చిన్నప్పటిలా యశోద దుడుకుగా, దబా యింపుగా మాట్లాడడం తగ్గించింది. కానీ ఆమె ఆలోచనల్లోనూ ఆచరణలోనూ మాత్రం రోజురోజుకూ దృఢత్వాన్ని సంత రించుకుంటూనే ఉంది. ఆమె లక్ష్యమంతా బాగా చదువుకొని, మంచి ఉద్యోగం సంపా దించుకొని ఆడవాళ్లేమీ తక్కువకాదని నిరూపించటమే.

దమయంతి నివురుగప్పిన నిప్పులాం టిది. ఆమె మనసులో ఏముందో, ఆలోచ నలేమిటో ఆమెకి తప్ప ఎవరికీ తెలియదు. యశోదలా బయటపడదు కానీ నిజానికి దమయంతి లక్ష్యమూ అదేననిపిస్తుంది.

ఇప్పుడిప్పుడు మధ్యతరగతి ప్రజలలోను, అగ్రవర్ణేతర జాతులలోనూ ఆడపిల్లలు కొన్ని కుటుంబాలలో కాలేజీ చదువుల వైపు చూస్తున్నారు. అప్పటికి దేశంలో కుల రాజకీయాలు, మత రాజకీయాలు ఇంకా బలంగా వేళ్లూనుకోలేదు. మధ్య తర గతి స్త్రీలలో చాలామంది సాహిత్య రంగం లోకి వస్తున్నారు. పత్రికలలో కాల్పనిక సాహిత్యం ఎంతగా వస్తోందో దానికి సమాంతరంగా అభ్యుదయ సాహిత్యం కూడా వస్తుండటంతో పుస్తకాలు చదివే మధ్యతరగతి ఆడపిల్లల్లో చదువుకోవాలనే తపన, తమ కాళ్లపై తాము నిలబడే ఆర్థిక ప్రతిపత్తి సాధనకోసం ఆరాటం పెరగడం మొదలైంది.

చిన్నప్పటి నుండీ స్కూలుచదువు మానే సి పత్రికలలో సీరియళ్లు చదివి చదివి ఊహాజగత్తులో విహరించే కౌసల్యా కూడా నేలమీద కాలూని, మధ్యతరగతి జీవి తాలూ, అందులో పెరిగిన ఆడపిల్లల పరి స్థితులూ అనుభవపూర్వకంగా తెలుసుకుం టోంది. ఖాళీ సమయంలో పక్కింటామె దగ్గరికి వెళ్లి కుట్టుపనులు నేర్చుకుంటు న్నది. దమయంతి టైపు హయ్యర్, షార్టు హేండు పరీక్షలు పాసైంది. తను ఆర్థి కంగా నిలదొక్కుకోగల సామర్థ్యాన్ని పెం చుకునేందుకు కష్టపడుతోంది.

"ఇన్‌స్టిట్యూట్‌లో తనకు అసిస్టెంటుగా ఉండమని వకుళ నాన్నగారు అడిగారు. రెగ్యులర్‌గా జీతం కూడా ఇస్తానన్నారు. అదీగాక ఏవైనా జాబ్ వర్కులు చేస్తే అద నంగా డబ్బు వస్తుంది. నాన్నగారు ఏమం టారో అడిగి చెప్తానన్నాను" అంది దమ యంతి ఒకరోజు. నిజానికి తండ్రి అను మతి ఇవ్వకపోయినా చేరాలనే నిర్ణయంతో ఉన్నా, తన పెద్దరికాన్ని గౌరవించటానికే అడిగిందనే విషయం రామారావు కూడా గ్రహించాడు.

అంతకుముందు భారతి, యశోద కలిసి యశోదవాళ్ల డాబామీద కూర్చుని అనేక

విషయాలగురించి చర్చించుకునేవారు. ఒక్కొక్కసారి వాళ్ల సంభాషణల్లో దమయంతీ, కౌసల్యా కూడా పాలుపంచుకునేవారు. కానీ రామారావు వాళ్లతో స్నేహాన్ని వదిలిపెట్టమని ఆంక్ష పెట్టాక యశోదే లైబ్రరీకని చెప్పి భారతివాళ్లింటికి వెళ్తోంది.

రామారావు కూడా దగ్గరలోనే రిటైర్ కావటానికి సిద్ధంగా ఉన్నాడు. 'సర్లే.. పిల్లకి కూడా కాలక్షేపంగా ఉంటుంది' అనుకుని దమయంతి చెప్పిన విషయానికి అంగీకారంగా తల ఊపాడు.

తండ్రి అంత సులభంగా అంగీకరిస్తాడని అనుకోని దమయంతి సంబరపడింది. ఆయన కాదంటే ఒప్పించేందుకు మార్గాలు వెతకాలనుకున్న బాధ తప్పిందని ఊపిరి పీల్చుకుంది.

ప్రభాకరం కూడా బియ్యాడి పరీక్ష రాశాడు. తండ్రి రిటైర్ అయ్యేలోపున తనకు ఉద్యోగం వస్తే బాగుండును అనే ఆలోచనలో ఉన్నాడు.

ఇకపోతే యశోద డిగ్రీ చివరి సంవత్సరం పరీక్షలు రాసింది. కాలేజీ పుస్తకాలే కాక స్నేహితురాలు భారతి వలన ఇతర పుస్తకాలు చదవటం అలవాటైంది. వీలున్నపుడు భారతీ, యశోద కలసి లైబ్రరీలో పుస్తకాలు చదవటం, వాటిపై చర్చించుకోవటం చేస్తుంటారు. అప్పుడప్పుడు కొన్ని పుస్తకాలను ఇంటికి తెచ్చి కౌసల్యకి కూడా చదవమని యిస్తుంటుంది యశోద.

ఈలోగా కౌసల్యకి ఒక సంబంధం తెచ్చాడు రామారావు స్నేహితుడు. ఈసారి కౌసల్యకు పెళ్లిచూపులకు హాజరుకావాలని ఏమాత్రమూ లేదు. కానీ తండ్రిమాటని కాదనలేక నిరాసక్తంగా తయారైంది.

'ఈసారైనా కుదిరితే..' ఇదే అందరి మనసుల్లోనూ మెదిలే భావం. యథాప్రకారం అన్ని ఏర్పాట్లూ జరిగాయి.

వాళ్లు రావటం, పోవటం కూడా జరిగిపోయింది. వాళ్లనుండి రాబోయే వార్త కోసం మర్నాటి నుండీ ఎదురు చూశాడు

> ## కొత్తగాలి...
>
> **తరచూ గొడవల్లో**
> **పాల్గొంటున్నాడంటే**
> **కచ్చితంగా వాడు**
> **కాబోయే నాయకుడే!**
>
> – పి.వి.యల్. సుజాత,
> సికింద్రాబాద్

ఎప్పటిలాగే రామారావు.

వారంరోజులకి ఉత్తరం రానే వచ్చింది. కవరు చింపుతుంటే ఎప్పటిలాగే చేతులు వణికాయి. 'ఈసారైనా.. ఈసారైనా..' అదే మనసులో మెదులుతోంది.

మామూలు క్షేమసమాచారాలన్నీ అయిపోయాక - 'మీ పెద్దమ్మాయి కనీసం స్కూలుఫైనల్ వరకైనా చదువుకోలేదని అబ్బాయి యిష్టపడటం లేదు. కానీ మీ రెండో అమ్మాయి మావాడికి బాగా నచ్చింది. మేం అడిగినంత మీరు ఇవ్వలేనన్నారు. మీరు ఇవ్వగలనన్న కట్నానికే ఒప్పుకుంటాం, ఆ అమ్మాయిని ఖాయం చేసేటట్లయితే తెలియజేయండి..'

పొరపాటున చదివానేమోనని రామారావు మళ్ళీమళ్ళీ చదివాడు. ఏమీ తోచలేదు. 'పెద్దదానికి కాకుండా తర్వాత దానికి పెళ్ళి చేసేస్తే, కౌసల్యకి ఇక పెళ్ళికావటం కష్టమేమో..' అనుకున్నాడాయన.

"ఏమిటండీ! ఏమని రాశారు?" భర్త ఏమీ మాట్లాడకపోయేసరికి ఆత్రుతగా అంది కామాక్షమ్మ.

ఏం చెప్పాలో తోచక మౌనంగా మరోసారి చదివాడా ఉత్తరం.

"ఏమని రాశారండీ?" రెట్టిస్తూ గట్టిగా అడిగింది.

"మనం ఇస్తామన్న కట్నానికి సరే అ

న్నారు కానీ కౌసల్యని కాకుండా దమయం తిని చేసుకుంటారట" ఏదో లోకంలోంచి మాట్లాడుతున్నట్లే మెల్లగా అన్నాడు.

టైప్ ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళటానికి చెప్పులే సుకుంటూ ఉత్తరంలో వార్త విని వెళ్దామని నిల్చున్న దమయంతి ఉలిక్కిపడింది. పక్కగది కిటికీకి దగ్గరగా కుర్చీ లాక్కుని తండ్రిమాట వినేంత దూరంలో కూర్చుని చీరకి పూలు కుడుతున్న కౌసల్య తుళ్ళిప డింది. ఎవరికీ ఏం అనేందుకు తోచక మౌనంగా ఉండిపోయారు. నిశ్శబ్దం గదిలో తిరుగుతోంది.

దమయంతి చరచరా వెళ్ళిపోయింది.

ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళినా అవే ఆలోచ నలు. అసలే ముభావంగా ఉండే దమ యంతి మరీ మౌనమునిలా అయింది. దమయంతి రాగానే శుభవార్త చెప్పాలని కూర్చున్న వకుళ "ఏంటి దమయంతీ! అలా ఉన్నావు? ఒంట్లో బాగా లేదా?" అంటూ ప్రశ్నించింది.

ఏం మాట్లాడకుండా తనపని తాను చేసుకుంటున్న దమయంతి "ఏమిటోయ్! నాతో చెప్పవా?" అని అడిగిన వకుళ గొంతులో ధ్వనించిన ఆత్మీయతకు కదిలి పోయింది.

"ఏంలేదు వకుళా! ఎప్పటి సంగతులే" అంటూ మాట మార్చింది. అంతలోనే వెలి గిపోతున్న వకుళ ముఖం చూసి "ఏదన్నా విశేషమా..?" అంటూ ఆప్యాయంగా ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది.

"విశేషమే. నాకు ఉద్యోగం వచ్చింది. అప్పుడెప్పుడో రాసిన పరీక్ష ఈసారి క్లిక్ అయ్యింది. బ్యాంకులో ఉద్యోగం.." వకుళ కళ్ళు మెరుస్తున్నాయి.

"నిజంగా? చాలా సంతోషం.." మన స్ఫూర్తిగా అభినందించింది. "అయితే రేప టినుండి ఇక్కడికి రావేమో?" కొంచెం బెంగగా అంది.

"శని, ఆదివారాలు వస్తుంటాలే! రాక పోతే ఎట్లా? నిన్ను కలవటానికైనా వస్తాను" అంది వకుళ.

వకుళ ఆత్మీయతకి దమయంతికి కళ్ళు చెమర్చాయి.

ఇంటికి వచ్చేశాక కూడా తలంతా నొప్పిగా, బరువుగా అనిపించింది దమ యంతికి. చాపా తలగడా తీసుకొని వెళ్ళి డాబామీద నడుం వాల్చింది. సన్నగా వీచే గాలికి, గాలితోబాటు వచ్చే సన్నజాజి సుర భిళానికి కాస్సేపటికి సేద తీరినట్లయింది.

"చిన్నక్కా! ఇంట్లో వాతావరణమంతా సీరియస్‌గా ఉంది. పెళ్ళివారి నుండి ఉత్తరం వచ్చిందా ఏంటి? వాళ్ళని అడిగితే బాగుండదని ఇక్కడికొస్తే నువ్వేంటి ఇలా ముఖం వేలాడేశావ్?" అంటూ యశోద దమయంతి పక్కన చతికిలపడింది.

యశోద విషయాన్ని తేలిగ్గా తీసుకు న్నట్లు మాట్లాడుతున్నా ఆమె గొంతులో ఒక జీర బరువుగా కదిలింది. కొంచెంసేపు దమయంతి మాట్లాడలేదు కానీ యశోద రెట్టించి అడిగేసరికి అప్పుడు పెదవి విప్పింది. "వాళ్ళు అడిగినంత కాకపో యినా నాన్నగారు ఇస్తానన్న కట్నానికి నన్ను చేసుకుంటారట" నిర్లిప్తంగా అంది.

ఈసారి తెల్లబోవటం యశోద వంత య్యింది. "అక్కని చేసుకుంటే వాళ్ళడిగిన కట్నం ఇవ్వాలా? నిన్నయితే కనికరించి నాన్నగారిచ్చే కట్నానికి సరిపుచ్చుకుంటారా! ఇదేం కూరగాయల బేరమా? పోనీ అసలు కట్నం లేకుండా నన్ను చేసుకుంటా రేమో బేరం పెడదామా!

ఏమిటక్కా ఈ ఘోరం? మనింట్లోనే కాదక్కా చదువుకున్నా, చదువు లేకపో యినా, అందమున్నా, కురూపి అయినా ప్రధాన అంశంగా డబ్బే అవుతోంది. ఇందాక భారతి వాళ్ళింట్లో ఒక విషయం తెల్సింది. దానికే మనసు కలతపడి ఇంటి కొస్తే ఈ విషయం.. కౌసల్యక్కా, శారద క్కలతోబాటు చదివిన సుగుణ ఇప్పుడు

జూనియర్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచే స్తోంది కదా! ఆమెకీ చాలాకాలం నుండీ పెళ్ళిచూపులు అవుతూనే ఉన్నాయ్. 'ఎక్కువ చదువుకుంది.. ఇంట్లో మొగుడు చెప్పిన మాట వినదు' అని సంబంధాలు వెళ్ళిపోతున్నాయట. అంత చదువుకుని శల్యపరీక్షలకు ప్రతిసారీ బుద్ధిగా కూర్చుం టుందట. ఇప్పు డు విసుగెత్తి జోగారావుని చేసుకుందట. ఎంత హీనపరిస్థితో కదూ ఆడవాళ్ళకి!"

"ఏ జోగారావు..? " ఆశ్చర్యంగా అడి గింది దమయంతి.

"అతనే, నువ్వు చెప్పేదానివి కదా మీ ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చేవాడనీ, చవట జోగా రావంటారనీ అతను.." గుర్తుచేసి, మళ్ళీ తనే "నిన్న భారతి వాళ్ళింటికి వచ్చి సుగుణ పెళ్ళికార్డు ఇచ్చిందట" గొంతులో ఆవేశం పొంగిపొరలగా అంది యశోద.

"అక్కా! జీవితంలో పెళ్ళి అనివా ర్యమా? రెండు మనసుల కలయిక లేని పెళ్ళి కాకపోతేనేం? ఎవరో ఏదో అనుకుం టారని జీవితాన్ని శిథిలం చేసుకోవాలం టావా..? " సాలోచనగా అంది యశోద.

దమయంతి మాట్లాడలేదు.

"..ఇన్నాళ్ళూ సుగుణని కాలేజీలో అంతా ఆమె వెనక పెళ్ళికాలేదని, వృద్ధకన్య అని వేళాకోళాలు చేసేవారట. వాళ్ళ బాధ పడ లేక పెళ్ళికి ఒప్పుకొని ఉంటుందేమో! నిజంగా పిటీ కదూ! ఆడవాళ్ళ జీవితాలు ఇలా కావటానికి ఎవరు బాధ్యులు? " ఆవే శంతో ఊగిపోయింది యశోద.

ఆవేశంతో ఎర్రగా కందిపోయిన యశోద ముఖం చూస్తుంటే దమయంతికి ఆశ్చర్యమే కాక ఆనందం కూడా కలిగింది.

ఇద్దరూ చాలాసేపు సమాజంలో ఆడపి ల్లలపట్ల జరుగుతున్న అన్యాయాలు, వివక్షల గురించి మాట్లాడుకున్నారు.

అంతలో భోజనానికి రమ్మని కేక విన బడి ఇద్దరూ కిందికి దిగారు.

పెద్దపిల్లకి కాకుండా తరువాతివాళ్ళకి పెళ్ళి చేస్తే మరిక కౌసల్యకి పెళ్ళికావటం కష్టమని రామారావు ఇష్టపడలేదు. కానీ కామాక్షమ్మ ఎవరికి కుదిరితే వాళ్ళకి చేస్తే బాగుందునేమో అనే ఆలోచన వ్యక్తం చేసినా రామారావు ఏకీభవించలేదు. ఎది గిన పిల్లలతో ఒక మాట సంప్రదించాలనే భావన కన్నవాళ్ళిద్దరికీ రాలేదని ఆడపి ల్లలు ముగ్గురూ తమలో తామే బాధప డ్డారు. దమయంతి చూపుల్తో నిరోధించ టంతో యశోద కూడా నోరెత్తలేదు. కానీ కౌసల్య మాత్రం ఇకపై పెళ్ళి చూపుల ప్రసక్తి వస్తే కచ్చితంగా వద్దని చెప్పాలని గట్టిగా నిర్ణయించుకుంది.



**5**

**టై**ప్ ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చేవాళ్ళలో చాలావరకూ గ్రాడ్యుయేషన్ చేస్తున్నవాళ్ళో, ఉద్యోగవేటలో ఉన్నవారో. ఇది మరొక అర్హతగా ఉంటుందన్న ఉద్దేశం. అటువం టివాళ్ళలో రమణారావు ఒకడు. బీకాం పాసై రెండేళ్ళయింది. సర్వీసు కమీషన్ పరీక్షలు రాస్తూ టైపు నేర్చుకోవాలని వచ్చాడు.

ఆ రోజు తండ్రి నరసింహంగారు లేకపో వడంతో, వకుళ అతని పేరు రిజిస్టర్లో రాసుకొని దమయంతికి అప్పగించింది.

మిషన్‌లో పేపర్ ఎలా సెట్ చేయాలో చూపించి, ఎలా టైప్ చేయాలో చూపి రమణారావుని ప్రాక్టీసు చేయమంది దమ

యంతి. అతను మరోసారి చెప్పించుకోకుండా వెంటవెంటనే కొట్టసాగాడు. పైగా ఎ ఎస్ డి జె కె ఎల్ మాత్రమే చెప్పినా జి హెచ్ కూడా చూపుడువేలు సాచి టైప్ చేస్తున్న రమణ్రావుని ఆశ్చర్యంగా చూసింది దమయంతి.

"మీకు ఇంతకుముందే వచ్చా? " మెల్లగా అడిగింది.

"బీకాం చదివే రోజుల్లో చేరాను. కానీ కాలేజీ నుండి మళ్ళీ వచ్చి నేర్చుకోటానికి బద్ధకించి మానేశాను. ఇప్పుడిక ఉద్యోగాన్వేషణలో ఇదొక అదనపు అర్హత అని చేరాను" ఆశ్చర్యంతో విప్పార్చుకున్న దమయంతి కళ్ళని ఎంత పెద్దగా ఉన్నాయో కొలుస్తున్నట్లుగా చూస్తూ అన్నాడతడు.

సూటిగా చూస్తున్న అతని చూపుని తప్పించుకోటానికి పనున్నట్లు మరోవైపు వెళ్ళిపోయింది దమయంతి.

కానీ, ఇంటికి వెళ్ళినా అతని చూపు వెంటాడుతూనే ఉన్నట్లు అనిపించింది.

మర్నాడు ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళాలని బయల్దేరి రమణ్రావు చూపు గుర్తొచ్చి చికాకుగా అనిపించింది.

'ఏమిటిది.. ఎప్పుడూ లేనిది ఇలా నా మనసు చలిస్తోంది? సినిమాకు పోయినా బాగుణ్ణు' అనుకొని అప్పుడే భోజనం కానిచ్చి నవలేదో పట్టుకొని మంచంమీద బోర్లాపడుకున్న కౌలస్యని చూసి "అక్కా! సినిమాకు వెళ్దాం వస్తావా? " అంది.

"ఏం ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళవా? "

"ఈరోజు వెళ్ళాలని లేదు. నువ్వు తయారవ్వు సినిమాకు వెళ్దాం"

'ఇన్‌స్టిట్యూట్‌లో చేరిన తర్వాత దమయంతి మరీ మునిగిలా కాకుండా కొంచెం నోరు విప్పుతోంది. బహుశా సంపాదనాపరురాలు కావటం చేతనేమో!' మనసులో అనుకుంది కౌసల్య.

తననే చూస్తున్న కౌసల్యని "ఏంటక్కా.. రావా? " అంది.

"వస్తానిదిగో" అంటూ లేచి ముఖం కడుక్కోటానికి వెళ్ళింది.

యశోద లైబ్రరీకి వెళ్ళిందేమో ఇంకా రాలేదు. అందుకని వాళ్ళిద్దరూ కలిసి సినిమాకు వెళ్ళిపోయారు.

ఆ మర్నాడు ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళగానే వకుళ నవ్వుతూ మెల్లగా "అసాధ్యురాలివే" అంది.

ప్రశ్నార్థకంగా చూసిన దమయంతి "నిన్న అక్కా నేనూ సినిమాకు వెళ్ళాం" రమణ్రావు గురించి అంటున్నదేమోనని సంజాయిషీగా అంది.

"నన్ను పిలవకుండా అలా వెళ్ళిపోవటమేనా? అయినా దాని గురించి మరోసారి దెబ్బలాడుతాలే.." అని మళ్ళీ "మొన్న చేరిన కొత్త స్టూడెంటు లేడూ..? " అంది.

"మానేశాడా? " మధ్యలో అందుకుంది.

"అబ్బా! చెప్పనీ! ఒక్కరోజుకే నీ గురించి చాలాసార్లు అడిగాడు" నవ్వుతూ అంది.

ఆ సంభాషణ ఇష్టం లేకపోవడమే గాక టైపుకి వచ్చిన మిగతావాళ్ళు వింటారేమోనని పేపర్లు తీసుకొని తన కేబిన్ వైపు వెళ్ళిపోయింది దమయంతి.

దమయంతి సీరియస్‌నెస్‌ని గమనించి వకుళ తన ధోరణి తగ్గించి, ఆమె దగ్గరకు వెళ్ళి చేతిమీద చేయేసి "కోపమా? " అంది రాజీ ధోరణిలో.

"అంతమందిలో అలా మాట్లాడితే కోపం రాదా? " విసుగ్గా అంది.

"నిజమే! క్షమించవే" ఒప్పుకుంది వకుళ.

"ఇంతకీ.. ఏమిటంటావు? " కుతూహలంగా అడిగింది దమయంతి.

కేబిన్‌కి ఉన్న గ్లాస్ డోర్ వేసేసి వకుళ దమయంతి పక్కన కూర్చొని "మొన్న చేరిన రమణ్రావు రెండు మూడుసార్లు నన్ను అడగబోయి ఆగిపోయాడు. ఆఖరికి వెళ్ళేముందు 'ఇంకొక ఆమె.. నిన్న నాకు నేర్పించిన ఆవిడ కూడా ఇక్కడ ట్యూటరా? సీనియర్ స్టూడెంటా? ' అని

అడిగాడు. మళ్ళా నేను మరోలా భావిస్తా ననుకున్నాడో? ఏమో? 'ఇలా అడిగానని మరోలా భావించకండి, ఆమెని చూస్తుంటే ఎవరో తెలిసినామెలా అనిపిస్తేను.. అంతే!' అన్నాడు.

తర్వాత నాన్నగారు వచ్చాక ఆ అబ్బాయితో చాలాసేపు మాట్లాడితే అడిగాను 'అతను తెలుసా? ' అని. రమణ్రావు వాళ్ళ నాన్న మా నాన్నగారితోబాటే స్కూల్లో చదువుకున్నాడట! ఆ తర్వాత మిలటరీలోకి వెళ్ళిపోయాడట! ఈ ఊళ్ళో పొలా



లవీ ఉన్నాయట! సెలవులకి వచ్చినపుడు కలిసేవాడట! అతను బోర్డరులో ఉండేవాడట! మరో సైనికుడి చెల్లెలిని వివాహం చేసుకున్నాడట! అయితే చైనాతో భారత్ యుద్ధం జరిగినప్పుడు యుద్ధంలోనే మరణించాడు. తర్వాత తల్లీకొడుకూ ఇక్కడికి వచ్చేశారు. రమణ్రావు అప్పటికి చిన్నపిల్లాడట! వాళ్ళమ్మ అప్పటికి నర్సింగ్ ట్రైనింగ్ చేసిందట! ఆమెకి ఉద్యోగం ఇప్పించటానికి నాన్నగారు మరో స్నేహితుడితో కలిసి ప్రయత్నించగా ఓ హాస్పిటల్‌లో నర్సుగా ఉద్యోగం వచ్చిందట! రమణ్రావుని కూడా నాన్న చాలా మెచ్చుకున్నారు"

అవన్నీ విన్నాక దమయంతికి రమణ్రావు ఏమీ అల్లరిచిల్లరివాడు కాదన్న నమ్మకం కుదిరింది.

అంతలో గ్లాసుడోర్ దగ్గరకు ఎవరో వచ్చినట్లుంటే మాటలాపి వకుళ లేచింది.

అప్పుడే హాలులోకి అడుగుపెడుతోన్న రమణ్రావుని చూసిన దమయంతికి హృదయం చేస్తున్న కంపనం ఆమెకే వినిపించింది.

అప్పుడప్పుడు దమయంతితో సరదాగా మాటలు కలుపుతూ మాట్లాడినా రమణ్రావు తన హద్దు మీరలేదు. ఒక్కొక్కప్పుడు యింకా ఉద్యోగం రానందుకు బాధ వ్యక్తపరిచేవాడు.

"మీ మామయ్య, మీ నాన్నగారు మిలటరీలో ఉండేవారట కదా? నాన్నగారు చెప్పారు. మీరు చిన్నప్పుడు ఆ వాతావరణంలోనే పెరిగారు కదా. మీ అమ్మగారు మిమ్మల్ని మిలటరీలో జాయిన్ కమ్మని ప్రోత్సహించలేదా? " ఒకసారి మాటల సందర్భంలో వకుళ అడిగింది. అక్కడే ఉన్న దమయంతి కూడా కుతూహలం ప్రదర్శించింది.

కొంతసేపు మౌనం వహించిన తర్వాత చెప్పాడు "ఒకసారి అమ్మతో నేను అన్నాను 'మిలటరీలో చేరటం లేదేంటి? నీకిష్టం లేదా? ' అని అందరూ అడుగుతున్నారని.

'నేను మా అన్నయ్యవల్లా, మీ నాన్నగారివల్లా చాలాకాలం ఆ పరిసరాల్లో గడిపినదాన్ని. నేను కూడా నర్సింగ్ ట్రైనింగులోనే కాక అవసరమైనపుడు మిలటరీ కేంపుల్లో కూడా పని చేసేదాన్ని. ఆ కారణాలవల్ల దేశభక్తి కూడా ఎక్కువే వుంది. యుద్ధంలోను, ఇతర విపత్తులలోను అనేక దుఃఖాలను చూడటమేకాక స్వయంగా కూడా అనుభవించినదాన్ని. మరిక దుఃఖాన్ని మోసే శక్తి లేదురా. ఏదో నువ్వు నీడపట్టు ఉద్యోగం చేస్తే చాలని నా ఆశ' అని అమ్మ అంది" రమణ్రావు చెప్తున్నపుడు అతని కంఠంలో తల్లిమీద ప్రేమ, ఆరాధన వ్యక్తం అయ్యాయి.

అతని మాటలు విని వకుళ, దమయంతి దిగ్భ్రమకి లోనయ్యారు.

నాలుగు నెలలపాటు రమణ్రావు అక్కడ టైపు నేర్చుకున్నాడు.

పరీక్షలు కూడా రాసేక ఒకసారి రమణ్రావు ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చి మాట్లాడుతూ "అవసరం అయినపుడు ఇక్కడికి వస్తుంటాను. నన్ను మర్చిపోకండి" అన్నాడు సెలవు తీసుకుంటూ.

"ఇంత తక్కువకాలంలో కష్టపడి హయ్యరు పూర్తిచేసిన మీ వంటి మంచి స్టూడెంటుల్ని ఎలా మర్చిపోతాం? " అంది దమయంతి.

"ఏవైనా జాబ్‌వర్కులు టైపు చేయాల్సి ఉంటే నిన్ను పిలుస్తుంటాం" అన్నారు నరసింహంగారు.

★ ★ ★

రోజులు ఎవరికోసం ఆగవు! ఎంత ఎదురుచూస్తున్నా ఆ యింట శుభకార్యం మాత్రం జరగలేదు. కానీ ఎంతకాలంగానో మంచంమీదే ఉన్న కామాక్షమ్మ ఒక్క కూతురి వివాహాన్నయినా చూడకుండానే సెలవు తీసుకుంది.

ముత్తయిదువుగా చనిపోయిందని ఇరు వైపులవారు వచ్చి చావుని పెళ్ళిలా అనేకానేక ప్రతిపాదనలతో జరపటానికి తయారయ్యారు. చేస్తున్న కార్యక్రమాలు నచ్చకపోయినా ఈ వయసులో ఒంటరి అయిన తండ్రిని బాధపెట్టటం ఇష్టంలేక పిల్లలంతా వాటిని జరపటానికే నిర్ణయించుకున్నారు.

రామారావు రిటైర్ అయిన తర్వాత వచ్చిన సొమ్ముని కొంత కొంత చొప్పున పిల్లల పెళ్ళిళ్ళకి పనికొస్తాయని ఒక్కొక్కరి పేరున డిపాజిట్ చేశాడు. అవిపోగా మిగిలిన సొమ్ముని ఈ కార్యక్రమానికి ధారాళంగానే ఖర్చుపెట్టి ఘనంగా కామాక్షమ్మకి వీడ్కోలు చెప్పాడు.

ప్రభాకరం ఈ తంతులన్నీ అయ్యేవరకూ ఉండి తాను టీచరుగా పనిచేస్తున్న అనకాపల్లికి వెళ్ళిపోయాడు. వైజాగ్‌లో హాస్టల్‌లో ఉండి ఎమ్మెస్సీ చదువుతున్న యశోద కూడా తండ్రికి జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయింది. ఇంక మిగిలింది కౌసల్యా, దమయంతీ, రామారావూ.

పిల్లలు ఎవరి పనులమీద వాళ్ళు వెళ్ళిపోయాక ఒక్కసారిగా ఒంటరైనట్లుగా అనిపించింది రామారావుకి. పనేమీలేక రోజంతా కామాక్షమ్మతో గడిపిన జీవితాన్ని నెమరువేసుకుంటూ కాలక్షేపం చేయటంలో తన తప్పులు తానే గుర్తించి ఖిన్నుడైపోయేవాడు. మగపిల్లలే కావాలని కామాక్షమ్మ పట్ల అమానుషంగా ప్రవర్తించానని కనిపించని భార్యకి క్షమాపణలు చెప్పుకునేవాడు. పెద్దపిల్ల కౌసల్య కనిపిస్తే చదువుకి దూరంచేసి అన్యాయం చేశానని బాధపడేవాడు. ఏదిఏమైనా జరిగిపోయిన కాలం మరి రాదని నిస్పృహ చెందేవాడు.

తల్లి చనిపోయాక మూడువారాలు ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళడం కుదరలేదు దమయంతికి. తిరిగి ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళటం మొదలెట్టింది.

ఒకరోజు హడావుడిగా రమణారావు ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చాడు. దమయంతి కనబడగానే, మీ అమ్మగారు చనిపోయారని తెలిసిందని తన సంతాపాన్ని తెలియజేశాడు.

"మీ కోసం అప్పుడప్పుడు ఇటువైపు వస్తున్నానండీ" అన్నాడు.

ఆశ్చర్యంగా చూసింది దమయంతి. విశాలమైన ఆమె కళ్ళని ముచ్చటగా చూసి నవ్వి "రెండు వారాల క్రితం ఒక ఇంటర్వ్యూకి వెళ్ళాను. మొన్ననే కాల్ లెటర్ వచ్చింది. నేను జాయిన్ కావాలి. హైదరాబాద్ వెళ్ళిపోతున్నాను. ముందు మీకే ఈ

## అక్టోబరు - 2016
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.

1. **రావి లలిత**
   - ప్రసాదంపాడు, విజయవాడ
2. **మారెడ్డి ప్రభాకర్**
   - కొత్తపేట, హైదరాబాద్
3. **ఎ. హారతి**
   - గాంధీనగర్, కాకినాడ
4. **ఎన్. మైథిలి శర్మ**
   - బత్తలపల్లి, అనంతపురం
5. **యం. నర్సింహులు**
   - అంబేద్కర్ కాలనీ, వికారాబాద్

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. శ్రీరామ్ | 6. రమ్య |
| 2. బలరాం, కృష్ణ | 7. ధ్రువమిత్ర |
| 3. శాంతి | 8. కె. శివసుబ్రహ్మణ్యం |
| 4. సంపెంగ పూలు | 9. హెన్రీ |
| 5. న్యాయ వృత్తి | 10. తులసీకృష్ణ |

వార్త చెప్పాలని అనుకుంటే ఈ రోజుకి కుదిరింది" అతని గొంతులో పొంగుతున్న ఉత్సాహాన్ని అబ్బురంగా చూస్తూ అభినం దనలు తెలియజేసింది దమయంతి.

"అంతేకాదు దమయంతిగారూ! నేను త్వరలోనే మళ్ళా వచ్చి కలుస్తాను. మీరు మరొక వరం కూడా ఇవ్వాలి, ఉంటాను" అని మరోమాటకి అవకాశం ఇవ్వకుండా నరసింహంగారికీ చెప్పి వెళ్ళిపోయాడు.

మెరుపులా వచ్చి మనసులో తుపాను రేపి వెళ్ళిపోయాడనిపించిందామెకు.

వకుళ ఆ రోజు రాలేదు. ఉన్నా ఆమెతో తన మనసుని పంచుకునేదేమో. టైపు చేయాల్సినవి చాలా వున్నా వాటిపై మనసు లగ్నం కాలేదు. అలా కొంతసేపు గడిపి ఇంక ఉండలేక నరసింహంగారితో చెప్పి ఇంటికి వచ్చేసింది దమయంతి.

చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కొని, కాసిని తాగి ఒక పుస్తకం పట్టుకొని డాబా మీదికి నడిచింది. పుస్తకం తెరిచినా ఆలో చనలు వదలడంలేదు. 'ఏమిటో!.. రమ ణ్రావు తనని ప్రేమిస్తున్నాడా? అసలు ఏనాడూ నోరు విప్పి అతనామాట అన లేదు కదా! అయితేమాత్రం ఆ కళ్ళు ఎన్ని సార్లు తనని ఆత్మీయంగా చూపులతో చుట్టేశాయి. అంతా తన భ్రమేనేమో.. అతని చొరవను అపార్థం చేసుకుంటున్న దేమో. సరదాగా మాట్లాడే అతని తత్త్వమే అంతేమో.. తాను ఎక్కువగా ఊహించు కుంటోందేమో.. తాను పెరిగిన పరిస్థి తులు తన కుటుంబ ఆవరణ దాటి ఏనాడూ తనని ప్రేమ గురించి ఆలోచించ నీయలేదు. అక్క పరిస్థితిని ఊహ తెలిసిన దగ్గరనుండి చూసింది కావటాన ఈ ప్రేమలు, ఈ కట్నాలూ, ఆంక్షల మధ్య అనేక సంప్రదాయాల మధ్య నలిగిపోయే ఆడపిల్లల బతుకులు తనని తాను జీవి తంలో నిలదొక్కుకోవడం వైపు నడిపిం చాయి తప్ప ఇంకేమీ ఆలోచించనీయ లేదు. ఇప్పుడేమిటి ఇలా మనసు చంచలం అవుతోంది? అయినా యిప్పుడింతగా ఆలోచించడం దేనికి? అతను తనని పెళ్ళి చేసుకుంటానని అనలేదు కదా! అన్నప్పుడు ఆలోచిద్దాం' అనుకుంది.

అయితే ఆ రోజూ రానే వచ్చింది. రెండునెలలు తిరక్కుండానే రమణ్రావు రానేవచ్చాడు. పెళ్ళి ప్రపోజల్ తేనే తెచ్చాడు. అప్పటికి ఆమె ఏమీ సమాధాన మివ్వలేదు. ఆ సాయంకాలం వరకూ ఆమె ఇనిస్టిట్యూట్‌లో ఏపనీ చేయలేకపో యింది. ఒకటే ఆలోచనలు. తల దిమ్మెక్కి పోయింది. ఇంటికి వచ్చినా అదే స్థితి. ఎవరితో ఈ విషయం చెప్పాలో ఎలా చె ప్పాలో తెలియలేదు దమయంతికి.

అంతకంతకీ తల దిమ్ముగా అవుతున్న ట్లనిపించి మోకాళ్ళమధ్య తలని దూర్చు కొని కూచుంది దమయంతి. అప్పుడే వైజా గ్‌నుండి వచ్చిన యశోద బట్టలు మార్చు కొని కౌసల్యని పలకరించింది. దమయం తి గురించి అడిగితే పుస్తకాలు పట్టుకొని డాబా మీదకు వెళ్ళిందని చెప్పింది కౌసల్య.

తనకి, దమయంతికి గ్లాసులతో కాఫీ తీసుకొని డాబా మీదికి వచ్చింది యశోద.

దమయంతిని చూసి యశోద ఆత్రుతగా దగ్గరకు వచ్చి భుజం మీద చేయి వేసింది.

తలెత్తి చూసిన దమయంతికి యశోదని చూడగానే కొండంత ధైర్యం వచ్చింది.

"ఏంటి చిన్నక్కా! ఒంట్లో బాలేదా?" అంది ఆత్మీయంగా యశోద.

"బాగానే వుంది. కానీ ఒక సమస్య వచ్చింది. నువ్వయితే మంచి సలహా యివ్వగలవు" అంటూ మొదలెట్టి రమ ణ్రావు విషయం అంతా చెప్పింది. "అతను నన్ను పెళ్ళి చేసుకుంటానని.." అర్థోక్తిలో ఆగిపోయింది.

అంతా విని యశోద తేలిగ్గా నవ్వి "దీనికే ఇంత గాభరా పడుతున్నావేం టక్కా? అతనే ఆ ప్రసక్తి తీసుకువచ్చాడు

**అక్షరం**

పిల్లలకి ఎలా ఆలోచించాలో తప్పకుండా నేర్పించాలి.
కానీ ఏం ఆలోచించాలో మాత్రం కాదు.

**– మార్గరెట్ మీడ్,**
మానవ విజ్ఞాన శాస్త్రవేత్త



కనుక వాళ్ళమ్మగారిని తీసుకుని మన యింటికి రమ్మను. ఈలోపున నాన్నగారికి ఒకసారి నేను మెల్లగా ఈ విషయం చెప్తాను. నిక్షేపంగా పెళ్ళిచేసుకో! నువ్వు చెప్పినదాన్ని బట్టి అతను మర్యాదస్తుడులాగే అనిపిస్తున్నాడు. ఈలోగా కౌసల్య అక్కకి కూడా చెబుదాం! లేకుంటే అక్క చిన్నబుచ్చుకుంటుంది" అని దమయంతిని ప్రేమపూర్వకంగా కౌగిలించుకుంది.

దమయంతికి ఎంతో బరువు తీరినట్లు అయింది. అంతలో మెట్లదగ్గర అలికిడి అయ్యేసరికి ఇద్దరూ అటువైపు చూశారు. అప్పుడే మెట్లెక్కి వస్తోన్న కౌసల్య కనిపించింది. ఇద్దరూ ఒక్కసారి బిత్తరపోయారు. అక్క విన్నదేమో? వినుంటే బాధపడ్తుందేమో? తనకి చెప్పలేదని అనుకుంటుందా? - ఇలా అనేక ఆలోచనలు ఇద్దర్నీ చుట్టుముట్టాయి.

కౌసల్య ముఖంలో విషాదఛాయలు అలముకొన్నది నిజమే! అప్పటికే ఇకపై తన వివాహ ప్రతిపాదనలని తోసిరాజనాలనే నిర్ణయానికి వచ్చి ఉండడం వలన కావచ్చు, వడలిపోయిన నవ్వుతోనే దమయంతి దగ్గరగా వచ్చి, ఆత్మీయానురాగాలు ప్రవహించేలా ఆమె చేతుల్ని నొక్కి, బుగ్గల్ని చిదిమి, ముద్దుపెట్టుకొంది. తిరిగి వెళ్తూ చటుక్కున గుర్తొచ్చినట్లు ఆగి "భోజనానికి వేళైంది, కిందకి రండి" అని మెట్లు దిగి వెళ్ళిపోయింది.

అంతసేపు బొమ్మల్లా బిగుసుకుపోయిన అక్కాచెల్లెళ్ళు గట్టిగా ఊపిరి వదిలేరు.

కిందికి దిగి కాళ్ళూచేతులూ కడుక్కొని వంటగదిలోకి వెళ్ళారు. అప్పుడే తండ్రీ, ప్రభాకరం భోజనం పూర్తిచేసి లేస్తున్నారు.

మౌనంగానే వాళ్ళు తిన్న కంచాలు తీసి బైటకి తీసుకెళ్ళింది దమయంతి. మంచినీళ్ళగ్లాసులు సర్దుతూ ఏదో మాట్లాడబోయి ఆగిపోయింది యశోద.

కంచాలు కడిగి తీసుకొచ్చిన దమయంతికి మాట్లాడేందుకు ధైర్యం చాలలేదు. మౌనంగానే అక్కచెల్లెళ్ళు ముగ్గురూ భోజనాలను కానిచ్చేసి వంటగది సర్దుకొని పడకగదిలోకి వెళ్ళారు.

ఏదో నోట్సు రాసుకోవాలని చెప్పి పుస్తకాలు తీసుకొని ముందుగదిలోకి వెళ్ళిపోయింది యశోద.

చిరువెలుగులు ప్రసరిస్తున్న గదిలో నిద్రపోతున్నట్లుగా ఉన్నా అస్థిమితంగా కదులుతోన్న శరీరం ఇంకా కౌసల్య నిద్రపోలేదని తెలుపుతూనే ఉంది. ఆమెనే గమనిస్తోన్న దమయంతి గభాలున కౌసల్య పక్కన పడుకొని గుండెల్లో ముఖం దూర్చి వెక్కిళ్ళు పెట్టి ఏడవసాగింది.

దుఃఖంతో ఎగసిపడ్తోన్న దమయంతి వీపు మీద మెల్లగా నిమురుతూ "ఏమిటిది? " అంది కౌసల్య.

మెల్లగా దమయంతి జరిగినదంతా చెబుతూ "నేనసలు ఏనాడూ వివాహం గురించి ఆలోచించలేదు. నీ పెళ్ళికి కలుగుతున్న అవాంతరాలు, బేరసారాలు అన్నీ ఆర్థిక పునాదుల మీదే ఉండటం చూసి చూసి, వివాహం అంటేనే విముఖత ఏర్ప

డింది. అటువంటిది ఏ బలహీన క్షణం లోనో, రమ(శ్రా)ావు నాపై చూపుతోన్న అభి మానానికి కరిగిపోయానేమో. నిజానికి అతను ఎంతగా నాకు దగ్గర కావాలను కున్నా మన కుటుంబ పరిస్థితులు గుర్తు వచ్చి దూరంగానే ఉన్నాను. కానీ.. కానీ" ఇంకేమీ చెప్పలేకపోయింది.

"అంతగా అభిమానిస్తున్నవారు దొరక టం కూడా వరమేనే దమూ! నేను నాకు తెలియకుండానే ఈ సంసార బాధ్యతల్లో కూరుకుపోయాను. ఇప్పుడు నాకు వివా హం గురించి ఆలోచించే మనసూ, వయ సూ కూడా దాటిపోతోంది. ఇంకా నా జీవి తం గురించి ఆలోచనలు వదిలేసేయ్. నువ్వైనా సుఖపడితే అంతేచాలు" అంటూ (పేమగా దమయంతి నుదుటిని ముద్దుపె ట్టుకుంది కౌసల్య.

కౌసల్యకి దగ్గరగా జరిగి ఆమె గుండెల్లో తలను పెట్టుకొని కౌగిలించుకొని పడు కుంది. తల్లి (పేమని, తం(డి (పేమను పొందని దమయంతికి అపుడు ఎంతో ఊరట కలిగింది.

"వీలు చూసుకుని నాన్నగారికి ఈ విష యం చెబుతాను. ఆ తర్వాత అతన్ని.. పేరేమిటన్నావూ.. రమ(ణా)వు కదా! అతన్నీ వాళ్ళ అమ్మగారినీ తీసుకురమ్మని పిలవచ్చు. ఇంక పడుకో" అంది కౌసల్య పెద్దరికంగా.

మనసు తేలికైన దమయంతి ని(దలోకి జారుకుంది. ఆమెకు ని(దాభంగం కలగ కుండా నెమ్మదిగా కాస్త దూరంగా జరు పుతూ కౌసల్య పెద్ద నిట్టూర్పు వదిలింది.

నోట్సు రాసుకోవటం పూర్తయి పడుకోవ టానికి రాబోయిన యశోద, మూసిన తలు పులు తోయబోయి, వారిద్దరి సంభాషణ విని కాసేపు అక్కడే ఆగిపోయింది. అప్ప టికి అక్కలిద్దరూ ని(దపోతున్నారు.

తర్వాత రెండుమూడుసార్లు తం(డితో ఈ విషయం కదపబోయిన కౌసల్య మళ్ళా సమయం చూసుకొని ఇంకోసారి చెప్పొచ్చు నులే అని ఆగిపోయింది.

పదిహేను రోజుల తర్వాత కౌసల్య చెప్పిన విషయం విని ముందు రామా రావు ఒంటికాలిమీద లేచాడు. "నేను మన కులంలో సంబంధాలు తేలేను అనుకు న్నారా? ఇలా మీకు మీరే నిర్ణయాలు చేసేసుకుంటున్నారు" అంటూ తీ(వంగా అడిగాడు. కానీ కౌసల్య ఆరిందా అయి పోయి ఎంతో ఓర్పుగా, నేర్పుగా మాటాడి తం(డిని అతికష్టంమీద సమాధానపరచి ఒప్పించింది.

రెండురోజుల తర్వాత మంచిరోజు చూసి రమ(ణా)వువాళ్ళని రమ్మని చెప్పమ న్నాడు రామారావు.

రమ(ణా)వు, వాళ్ళ అమ్మ తమతోబాటు వకుళ వాళ్ళ నాన్నని మధ్యవర్తిగా తీసుకు వచ్చారు.

పిల్లాడు బుద్ధిమంతుడు, పెద్దలంటే భయభక్తులు ఉన్నవాడులాగే కనిపిస్తున్నా డు. ముఖ్యంగా వకుళ తం(డి సిఫారసు చేశాడు. ఇంకా చెప్పాలంటే కట్నాలు కాను కలు తీసుకోనన్నాడు. అందుకని రామారా వు కూడా మౌనంగా అంగీకరించాడు.

తప్పని పరిస్థితుల్లో దమయంతీ, రమ (ణా)వుల వివాహానికి అంగీకారం తెలిపిన రామారావుకి శారద కులాంతరం చేసుకుం దని ఆమెకు, కౌసల్యకి మధ్య స్నేహానికి అడ్డుకట్టవేసిన విషయం గుర్తుకురాలేదు కానీ కౌసల్యకి గుర్తువచ్చింది. విషాదంతో వెలిసిపోయిన చిరునవ్వు ఒక్క నిమిషం ఆమె పెదవులమీద వాలి, జారిపోయింది.

రమ(ణా)వు నిరాడంబరంగా రిజిష్టరు పెళ్ళి చేసుకుని బాగా దగ్గర బంధువులు, స్నేహితులకి మా(తం ఇంట్లోనే పార్టీ ఇవ్వాలనుకుంటున్నట్లు, ఇతర పెళ్ళి ఖర్చులు, తంతులు తనకు ఇష్టంలేదని అనేసరికి మళ్ళా రామారావు "అదెలా కుదురుతుంది? మంగళవాయిద్యాలు,

## హోమ్‌వర్క్ కోసం పోలీసులా?

చతుర సమగటుల

అమెరికా స్కూళ్లల్లో పిల్లలకి పోలీసుల సహాయం అవసరమైతే 911కి ఫోన్ చేయమని బోధిస్తుంటారు. కొందరు పిల్లలు వింత కారణాలకి 911కి ఫోన్ చేసిన విశేషాలు..

★ సౌత్ కరోలినాకి చెందిన రెండేళ్ల ఆలియాగారెట్ 911కి ఫోన్ చేసి పేంట్ తొడుక్కోవడం రావడం లేదని, సహాయం చేయమని కోరింది. డిప్యూటీ మార్తా వెళ్లి ఆలియాకి పేంట్ తొడిగింది! తలుపు తెరిచిన ఆలియా



తాతకి మనవరాలి ఫోన్ సంగతి తెలీదు.

★ కనెక్టికట్‌కి చెందిన పదేళ్ల జిల్‌మేన్ తన తండ్రి తాగి డ్రైవ్ చేస్తున్నాడని కారు నంబరుతో సహా ఫిర్యాదు చేశాడు. వెంటనే పోలీసులు ఆ కారుని ఆపితే, అది నిజమని తెలిసింది.

★ టెక్సాస్‌కి చెందిన ఐదేళ్ల రాబిన్సన్ ఫోన్ చేసి తనకి ఆకలిగా ఉందని, తినడానికి ఇంట్లో ఏమీ లేదని చెప్పాడు. పోలీసులు వచ్చి చూస్తే, ఇంట్లో రాబిన్సన్, పదినెలల చెల్లెలు ఒంటరిగా ఉన్నారు. మెక్‌డొనాల్డ్ నించి తెచ్చింది వాళ్లకి పెట్టి, పిల్లల్ని నిర్లక్ష్యం చేసినందుకు తండ్రిని అరెస్ట్ చేశారు.

★ అలబామాకి చెందిన నాలుగేళ్ల జానీ పోలీసులకి ఫోన్ చేసి, తనకి మేథ్స్ హోమ్‌వర్క్ ఎలా చేయాలో తెలీడం లేదని చెప్పాడు. 16 లోంచి 8 పోతే ఎంత? అని అడిగాడు!

★ అలబామాకి చెందిన ఐదేళ్ల అరోరి 911కి ఫోన్ చేసి, తన తల్లి సారా సరిగ్గా మాట్లాడడం లేదని ఫిర్యాదు చేశాడు. పోలీసులు వచ్చి చూస్తే సారా డయాబెటిక్ షాక్‌లోకి వెళ్లిందని తెలిసి ఆమెని రక్షించారు.

★ న్యూయార్క్‌కి చెందిన ఏడేళ్ల కేథీ ఓరియో బిస్కెట్స్ ఇవ్వలేదని, తన తల్లిని డొమెస్టిక్ వయలెన్స్ కింద అరెస్ట్ చేయమని ఫిర్యాదు చేసింది!

★ న్యూశాలిస్బరీకి చెందిన తొమ్మిదేళ్ల సబెక్క తమ ఇంట్లో టాయ్‌లెట్‌లోంచి నీళ్లు లీక్ అవుతున్నాయని ఫిర్యాదు చేశాడు.

---

పురోహితుడు లేకుండా పెళ్లేంటి?" అని మూర్ఖపు పట్టుదలకి పోబోయాడు.

అంతవరకూ ఏనాడూ తండ్రికి ఎదురుగా నిలబడి మాట్లాడని దమయంతి సూటిగా ఆయన వైపు చూసి "నాన్నగారూ! నామకరణోత్సవాలూ, బారసాలలూ, అక్షరాభ్యాసాలూ వగైరా వగైరా తంతులేవీ జరగకుండానే నేను పెరిగాను. పెళ్ళి కూడా అలా జరిగితేనే నాకిష్టం" అంది స్పష్టంగా.

ఆడపిల్ల అని నిర్లక్ష్యంగా పట్టించుకోని రామారావు మనసుకి మెత్తని వాత తగిలినట్లుగా చురుక్కుమంది. మరిక మాట్లాడలేకపోయాడు.

వైజాగ్‌లో చదువుకుంటున్న యశోదకి, ఉద్యోగరీత్యా ఊళ్ళో లేని ప్రభాకరానికి కూడా రావటానికి వీలుగా ఉండేలా దసరా సెలవుల్లో ముహూర్తం నిర్ణయించారు.

తానొక ఊర్లో, యశోద మరో ఊర్లో, తండ్రివాళ్ళు ఇంకో ఊర్లో ఉంటుండడం వలన ఒకరి విషయాలు ఒకరికి ఏమైనా అవసరంపడ్తే తెలుస్తుందని ఇటీవలే ఇంట్లో కొత్తగా టెలీఫోను పెట్టించాడు ప్రభాకరం.

ఆ రాత్రే యశోద, ప్రభాకరానికి ఫోన్లు చేసి శుభవార్తని తెలిపింది దమయంతి.

రిజిష్టరు పెళ్ళి అని తెలిసి యశోద, ప్రభాకరం కూడా "మన యింట్లో ఒక



కొత్త ఒరవడికి శ్రీకారం చుట్టావని" దమయంతిని ప్రశంసలతో ముంచెత్తారు.

పెళ్ళి సింపుల్‌గానే జరుగుతున్నా దమయంతి కొత్త కాపురానికి కావలసిన వస్తువులూ, బట్టలూ కొనటం, దగ్గర బంధువులకు తెలియజేయటం వంటివి తప్పవుకనుక ఆ పనులు మొదలుపెట్టారు. రెండు మూడు రోజులు కలిసివచ్చేలా చూసుకొని ప్రభాకరాన్ని రమ్మని ఫోను చేశాడు రామారావు. ప్రభాకరం వచ్చే సమయంలోనే యశోద కూడా షాపింగు పనుల సహాయంకోసం వచ్చింది.

ఒడిదొడుకుల మధ్యతరగతి సంసారమే కావటాన ఆడపిల్లలకు చెవులకు దుద్దులు తప్ప ఒంటిమీద వీసమెత్తు బంగారం లేదు. పెద్దపిల్ల కౌసల్యకి జతగాజులు, సన్నని చైను సంబంధాలు చూస్తున్నప్పుడే చేయించాడు. తల్లి చనిపోయేటప్పుడు ఆమె చేతికున్న గాజులు, సూత్రం గొలుసూ తర్వాత ఆడపిల్లల కోసం అలాగే ఉంచేశారు. కౌసల్య, దమయంతి, యశోద ఆ బంగారాన్ని కరిగించి దమయంతికి



గాజులు, గొలుసు చేయించాలని కంసాలి దగ్గరకు వెళ్ళారు.

తీరా వెళ్ళాక దమయంతి తనకువచ్చిన జీతంలో దాచుకున్న డబ్బు కూడా కలిపి తనకూ, యశోదకు కూడా చేయించమని కంసాలికి పురమాయించింది.

యశోద "అమ్మ ఉన్నప్పుడు చేయించిన ముత్యాల చైను ఉందిలే" అంది.

"అమ్మ గుర్తుగా ఈ బంగారాన్ని ఇద్దరికీ చేయించుకుందాం" అన్న దమయంతి మాటల్ని తోసిపుచ్చలేకపోయింది యశోద.

షాపింగు పూర్తిచేసుకొని వచ్చేసరికి ఇంట్లో తండ్రితో కబుర్లు చెబుతున్న పురుషోత్తం మామయ్య కనిపించాడు.

అక్కాచెల్లెళ్ళు ముగ్గురూ ఇంట్లో అడుగు పెట్టగానే పురుషోత్తం దమయంతిని చూసి "అదిగో! మోడర్న్ పెళ్ళికూతురు వచ్చేసింది. ఏమే ఇంత గప్‌చిప్‌గా పెళ్ళి చేసేసుకుంటున్నావు? " అన్నాడు కాస్తంత వెటకారం ధ్వనించగా.

"గప్‌చిప్‌గా ఏముంది మామయ్యా! మిమ్మల్ని పిలుస్తూనే ఉన్నాం కదా" అంది

## కొత్తగాలి...

**వాడికి**
**నోట్లమూట ఇష్టం!**
**నాకు**
**నోటిమూటే ఇష్టం!**

– శైలూషి,
హైదరాబాద్

దమయంతి.

"అదే మరి! నువ్వొక్కడివే వందమంది పెట్టు" ముక్తాయింపు ఇచ్చింది యశోద.

'అమ్మో! పిల్లలకి నోళ్ళు వచ్చేయి. ఎప్పుడూ పెదవి విప్పని దమయంతి కూడా మాటకి మాట అప్పజెప్తోంది. పూర్వంలా ఏదన్నా అంటే ఇప్పుడు వీళ్ళు పడరు' మనసులోనే అనుకున్న పురుషోత్తం మాటమార్చి వీళ్ళతోపాటే లోపలికి అడుగుపెట్టిన ప్రభాకరాన్ని చూసి అతని ఉద్యోగ వివరాలన్నీ కూపీ లాగాడు. అన్ని కబుర్లూ కానిచ్చాక "ఏరా ప్రభా! మరి ముహూర్తాలు ఎప్పుడు పెట్టించమంటావ్? " అన్నాడు.

"దసరాకి పెట్టించాం కదా.. ఇంకా ఏంటి? " ప్రశ్నార్థకంగా చూశాడు.

"దేనికేమిటిరా? చిన్నప్పటినుండీ అనుకున్నట్టుగా కుముదని నీకిచ్చి చేయటానికి" దబాయింపుగా అన్నాడు.

"ఇప్పుడే నాకు పెళ్లేంటి మామయ్యా? ఇంకా అక్కకి, యశోదకి జరగాలి. అప్పుడు.." తెలియనట్లు మాట్లాడతాడేంటి అనుకుంటూ అన్నాడు ప్రభాకరం.

"అంతవరకూ ఆగితే నా కూతురు ముసిల్ది అయిపోతుంది" కట్టె విరిచినట్లు అనేశాడు పురుషోత్తం.

అక్కడున్న అందరి మనసులూ చివుక్కుమన్నాయి. అక్కడే కూర్చుని వాళ్ళ మాటలు వింటున్న కౌసల్యా చటుక్కున లేచి లోనికి వెళ్ళిపోయింది. మాటలు మర్చిపోయినట్లు అంతా నిశ్శబ్దం ఆవరించింది. అంతవరకూ తేలికగా వున్న వాతావరణం ఒక్కసారిగా బరువైపోయినట్లు అప్పటికి గుర్తించిన పురుషోత్తం "అది కాదురా! నేననేది. నేను వూరికే నా కూతుర్ని ఇవ్వనులే. నేనిచ్చే కట్నంతో కౌసల్యా పెళ్ళి అయిపోతుంది. వచ్చే ఏడాది యశోదకి చేసేయొచ్చు" తన మాటలకి తానే టీకాతాత్పర్యం చెప్తున్నట్లు అన్నాడు.

"ఏం? సంబంధాలు చూసిపెట్టావా మామయ్యా? " ఉబికివస్తోన్న కోపాన్ని ఆపుకుంటూ వెక్కిరింతగా అంది యశోద.

ఆమె మాట వినిపించుకోనట్లుగానే తిరిగి ప్రభాకరాన్ని రెట్టించి అడిగాడు.

"లేదు మామయ్యా! ఇంకా నేను ఉద్యోగంలో స్థిరపడలేదు. ఇప్పుడే పెళ్ళి చేసుకోవాలనుకోవటంలేదు. అక్కకి, యశోదకి అయిన తర్వాతే ఆలోచిస్తాను" మరి తన మాటకి తిరుగులేదన్నట్లుగా, మరోమాటకి అవకాశం ఇవ్వకుండా లేచాడు ప్రభాకరం.

"పెళ్ళి చేసుకునే ఉద్దేశం నేను మానుకున్నాను. ఇంక నాకేమీ సంబంధాలు కూడా ఎవరూ చూడకండి" లోపలి నుండి వచ్చిన కౌసల్యా తీవ్రస్వరంతో అని గిరుక్కున వెళ్ళిపోయింది.

"నేనైతే చదువు పూర్తయి ఉద్యోగంలో స్థిరపడ్డాకగాని పెళ్లి విషయం ఆలోచించను. అప్పటికి ఎవడో ఒకడు నన్నిష్టపడేవాడు దొరక్కపోడు. మా కోసం నువ్వు మానుకోనక్కరలేదు ప్రభా! నీకు కుముదని చేసుకోవాలనుంటే ఎప్పుడంటే అప్పుడు చేసుకో! ఏ విషయమైనా స్పష్టంగా మామయ్యకు చెప్పు" కచ్చితంగా అంది యశోద.

నోట్లో నాలికలు లేవనుకున్న ఆడపిల్లలు ఇలా తన ఎదుటే స్పష్టంగా తీవ్రంగా వాళ్ళ దృక్పథాన్ని వ్యక్తపరుస్తుంటే రామా

రావుకి నోటమాట రాలేదు.

ప్రభాకరం ఒకసారి చెల్లెలివైపు సాదరంగా చూసి "నా ఫ్రెండింటికి వెళ్తున్నాను" అనేసి వెళ్ళిపోయాడు.

పురుషోత్తానికి ఏమనటానికీ తోచలేదు. దమయంతి తెచ్చిన టీ గ్లాసుని చేతిలోకి తీసుకుని మరికాసేపు రామారావుతో పిచ్చాపాటీ మాట్లాడి వెళ్ళిపోయాడు.




రమణారావూ, దమయంతీ కోరుకున్నట్లుగానే ఒక మినీబస్సు అద్దెకి తీసుకొని ఇద్దరి తరఫునా పదిమంది పెద్దల్ని తమ తో వెంటబెట్టుకొని వైజాగ్ వెళ్ళి అక్కడ రిజిష్టరాఫీసులో పెళ్ళి చేసుకొని తిరిగి ఇంటికి వచ్చేశారు. ఆ మర్నాడు ఇరువైపుల దగ్గరి బంధువులు, స్నేహితులు ఓ యాభైమందికి భోజనాలు పెట్టి సింపుల్‌గా పెళ్ళివేడుక పూర్తిచేసుకున్నారు.

తర్వాత ఇంట్లోవాళ్ళు తప్ప బంధువులు, మిత్రులు ఎవరిళ్ళకువారు వెళ్ళిపోయారు.

అంతవరకూ కట్టుకున్న సిల్కుచీర మార్చుకొని లేత అరిటాకు రంగు ఫుల్‌వాయిల్ చీర కట్టుకుంది దమయంతి.

విప్పిన చీరలు, సామాన్లు సర్దుతున్న దమయంతిని, యశోద తుపానులా వచ్చి ప్రేమగా వెనుకనుండి హత్తుకుంది.

"నాకెంత సంతోషంగా ఉందో దమూ! దమూ, నీకు గుర్తుందా? మనం హైస్కూల్లో చదువుతున్నప్పుడు మొదటి మహిళా ప్రధానిగా ఇందిరాగాంధీ ప్రమాణం చేసినపుడు ప్రార్థనా సమావేశంలో మన మాష్టార్లు అందరూ ఆడపిల్లల్ని అభినందించి, 'మొదటిసారి మనకు మహిళా ప్రధాని వచ్చింది. ఇకపై అన్ని రంగాలలో మహిళలదే పైచేయి. ఇకపై మీరంతా మీరనుకున్నట్లుగా ఏదైనా సాధించగలరు' అని ఉపన్యాసాలు ఇస్తే అంతగా అర్థం కాకున్నా ఇంక మనకి తిరుగులేదని, జీవితంలో అన్నీ సాధించేస్తామని అనుకుంటూ ఇంటికి వచ్చాం. కానీ, మనకు మన ఇంటి వాతావరణంలో ఏనాడూ మన మాటనీ, మన వ్యక్తిత్వాన్ని నిలుపుకునే అవకాశమే కలగలేదు. మరి 'మార్పు ఎక్కడ వచ్చింది' అని మనం అనుకున్నది గుర్తుందా? ఆఖరికి ఎలా అయితేనేం నేను చదువుకోవటానికి పోట్లాడి ఒక అడుగు ముందుకు వేశాను. నువ్వు ఎక్కువ చదువుకోకపోయినా ఆర్థిక స్వావలంబనకు మొదటిసారి మన కుటుంబం నుండి ముందడుగు వేశావు. ఈ రోజు మాత్రం ఇంకా ఛాందసంగా ఆలోచించే పరిస్థితుల్ని బద్దలుగొట్టి నువ్వు అనుకున్నది సాధించగలిగావు. అందుకు నీకు అన్ని విధాలా తోడ్పడేలా తగిన తోడు లభించింది. నాకు చాలా చాలా సంతోషంగా ఉందక్కా!" భావావేశంతో గొంతు జీరబోయింది యశోదకి.

దమయంతి కూడా అంతటి ఉద్వేగాన్నీ పొందుతూ కళ్ళనీళ్ళతో "నువ్వు కూడా నీ ఆశయాన్ని నెరవేర్చుకుంటావులే యశూ! నిజానికి నిన్ను చూసే నేను ఇంతవరకూ ఎదగగలిగాను" అంటూ ప్రేమగా దగ్గరకు తీసుకుంది యశోదను.

అప్పుడే మడిచిన పెళ్ళి చీరల్ని తీసుకుని వచ్చిన కౌసల్యని ఇద్దరూ రెండు వైపుల నుండీ కావలించుకున్నారు.

"అక్కా! అన్నీ నీ భుజాన వేసుకొని అమ్మలేని లోటు కూడా తెలియనీయలేదు.

అమ్మయినా అక్కైనా నీవే" అని దమయంతి కళ్ళనీళ్ళ పర్యంతమైంది

"ఛ! ఏమిటే ఇది? ఇటువంటప్పుడు కన్నీరు పెట్టుకోకూడదు" అంటున్న కౌసల్యకీ కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

పెళ్ళి అయినాసరే దమయంతి కొన్నాళ్ళు ఆ ఇంట్లోనే ఉండక తప్పలేదు. రమణావు ట్రైనింగు కోసం ఢిల్లీ వెళ్ళాడు. తర్వాత అతనికి ఎక్కడ పోస్టింగు వేస్తే అక్కడ జాయినవ్వాలి. వాళ్ళ అమ్మకి ఉద్యోగం మద్రాసులో. ఆమె కూడా సెలవులేదని వీలు చూసుకొని మద్రాసు ఇద్దర్నీ రమ్మని చెప్పి వెళ్ళిపోయింది.

దమయంతి ఎప్పటిలాగే టైపు ఇన్స్టిట్యూటుకి వెళ్తూనే ఉంది. అదీగాక కొత్తగా సార్వత్రిక యూనివర్సిటీ ఏర్పాటు కావటం తెలుసుకొని రమణావు ప్రోత్సాహంతో బియ్యే చదవడానికి ప్రవేశ పరీక్షకి కట్టింది దమయంతి. దాంతో మళ్ళీ చదువులో బిజీ అయిపోయింది.

తీరిక సమయం ఎక్కువగా ఉండడంతో దమయంతి తన మొదటి జీతంతో కొని యిచ్చిన కుట్టుమిషనుకి పనిచెప్పింది కౌసల్య. చుట్టుపక్కలవాళ్ళకి బట్టలు కుట్టటమే కాకుండా ఎప్పుడో నేర్చుకున్న అల్లిక పనులు, ఎంబ్రాయిడరీ పనులు మొదలు పెట్టింది. మొదట్లో కాలక్షేపంగా చేసినపని రానురాను తగిన ప్రతిఫలం కూడా లభించడంతో మరింత ఉత్సాహంగా ఆ పనుల్లో నిమగ్నమైపోయింది. దానితో ఆమెకు పూర్వంలా ఏవేవో ఆలోచనలుగానీ, నిర్వేదంగానీ బాధించటం లేదు.

రామారావు తనకి ప్రాధాన్యం తగ్గిపోతున్నట్లుగా గమనించి పూర్వంలా వాళ్ళపై ఆధిపత్యం చూపాలనుకొన్నప్పటికీ పరిస్థితులను అర్థం చేసుకుని నెమ్మదించాడు. తనేదైనా అని తిరిగి అనిపించుకోవటం ఎందుకనీ, వార్ధక్యం, అనారోగ్యం వలన కొంతా, మారుతున్న కాలాన్ని అర్థం చేసుకుని కొంతా తగ్గాడు.

అక్కాచెల్లెళ్ళు తమ తమ జీవితాల్ని ఉన్నతీకరించుకోవటం, ఆర్థిక స్వావలంబన కోసం తగిన అవకాశాల్ని సమకూర్చుకోవటం చూసి ప్రభాకరం కూడా దూరవిద్య ద్వారా పోస్టు గ్రాడ్యుయేషన్ చేసి కాలేజీ లెక్చరరుగా స్థిరపడితే బాగుంటుందనే ఆలోచన వచ్చి ఆ దిశగా ప్రయత్నాలు మొదలు పెట్టాడు.

పదేపదే పెళ్ళి ముహూర్తాల కోసం ఫోను చేస్తున్న పురుషోత్తానికి తన చదువు పూర్తికాగానే చేసుకుంటాననీ, కుముద అంటే తనకి కూడా ఇష్టమేననీ భరోసా యిచ్చాడు ప్రభాకరం.

★ ★ ★

రోజులు సాఫీగా జరిగిపోతున్నాయి.

ఒకరోజు దమయంతి ఇన్స్టిట్యూట్ నుండి ఇంటికి ఫోను చేసింది- 'వకుళ వాళ్ళ నాన్నగారు హార్ట్ఎటాక్ వచ్చి పోయారనీ, వాళ్ళింటికి వెళ్ళివస్తానని'

వకుళవాళ్ళ ఇంటిదగ్గర అంత్యక్రియల తంతులన్నీ పూర్తయ్యేసరికి సాయంత్రం అయింది. దిగులుగా, నీరసంగా యింటికి వచ్చింది దమయంతి.

'వకుళ తండ్రివల్లే తాను టైపు, షార్టుహ్యాండు నేర్చుకోగలిగింది. తన పెళ్ళికి కూడా ఆయనే మధ్యవర్తిత్వం నెరిపాడు. ఈనాడు తన కాళ్ళమీద తాను నిలబడగలిగిందంటే ఆయన చలవే' దమయంతి ఆయనతోగల అనుబంధాన్ని గుర్తుచేసుకొని తల్లడిల్లిపోయింది. వకుళపట్ల ఎంత ప్రేమ చూపారో దమయంతి పట్ల కూడా అంతటి ప్రేమాభిమానాలు పంచిపెట్టి అక్కడే ఉద్యోగాన్ని యిచ్చి, వాళ్ళ కుటుంబంలో మనిషిగానే చూశారని పదేపదే తలచుకుంది దమయంతి.

అవన్నీ ఒక్కొక్కటే కౌసల్య ముందు పరచి బాధపడింది.

దినాల వరకూ తనకు సాయంగా

రమ్మని వకుళ కోరటంతో ఇన్‌స్టిట్యూట్ బాధ్యత మధ్యాహ్నం పూట ఒక సీనియర్ విద్యార్థికి అప్పగించి రోజూ ఒక పూటంతా వకుళతోనే ఉండసాగింది దమయంతి.

దశదినకర్మ రోజుకి రమణ్రావు కూడా ట్రైనింగు నుండి అనుమతి తీసుకుని వచ్చాడు. ఎందుకంటే రమణ్రావు ఆయన శిష్యుడేకాక మిత్రుని కొడుకు కూడా. ఆ రోజు ఉదయాన్నే దమయంతి, రమణ్రావు బయల్దేరి వకుళవాళ్ళింటికి వెళ్ళారు.

తిరిగి వాళ్ళు వచ్చేసరికి సాయంత్రం కావచ్చింది. ఇద్దరూ స్నానాలవీ పూర్తిచే శారు. కౌసల్య వేడివేడి కాఫీ ఇచ్చింది. రమణ్రావు కాస్సేపు విశ్రాంతి తీసుకొని సాయంత్రం ట్రైనుకే వెళ్ళిపోయాడు.

రమణ్రావు వెళ్ళాక మౌనంగా పడకగది లోకి వెళ్ళిపోయింది దమయంతి.

రాత్రి వంటకి కావలసినవన్నీ పూర్తిచేసు కొని 'దమయంతి పడుకుందేమో' అనుకుం టూ గదిలో అడుగుపెట్టిన కౌసల్య నివ్వెర పోయింది.

దమయంతి మంచంమీద బోర్లా పడు కొని వెక్కిళ్ళు పెడుతూ ఏడుస్తోంది. రమణ్రావు వెళ్ళినందుకేమోనని ఆమె పక్కన కూర్చొని దమయంతి వీపు మీద చెయ్యి వేసింది కౌసల్య. దమయంతి ఆమె వైపు తిరిగి కౌసల్య ఒడిలో తల పెట్టుకొని బావురుమంది.

"ఏమిటే! ఎందుకంతలా ఏడుస్తు న్నావు? " మెల్లగా వీపు నిమురుతూ అడి గింది కౌసల్య.

"ఈ రోజు తెల్లవారుజాము నుండి వకు ళవాళ్ళ అమ్మగారికి చేస్తున్న తంతులు చూస్తుంటే దుఃఖం, కోపం, ఆవేశం తన్ను కొచ్చేసేయ్ అక్కా! ఏమిటీ ఆచారాలు? పుట్టిన దగ్గరనుండి ప్రతీ సందర్భంలోనూ ప్రతీది ఆడవాళ్ళ చుట్టే జరుగుతాయి. కానీ ప్రాధాన్యం మగవాడికి. శారీరకంగా,

# చతుర ప్రవేశిక

## నవంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. రామారావు పెద్దకూతురు? | 6. సాహిబా ప్రేమికుడు? |
| జ. | జ. |
| 2. మణీ జబ్బు? | 7. సాహిబా పెద్దన్నయ్య? |
| జ. | జ. |
| 3. రామారావు ఉద్యోగం? | 8. మీర్జా గుర్రం పేరు? |
| జ. | జ. |
| 4. దమయంతి భర్త? | 9. మధుమేహదినం ఎప్పుడు? |
| జ. | జ. |
| 5. కౌసల్య తమ్ముడు? | 10. 'కాలాతీతవ్యక్తులు' రచయిత్రి? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ------------------------------------ వయసు (    )

చిరునామా: ------------------------------------------------

-------------------------- పిన్‌కోడ్ :          ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

మానసికంగా హింసించే తంతులన్నిటికీ స్త్రీనే గురిచేస్తారు. ఏమిటక్కా ఎప్పటికీ ఇవి మారవా? ”

మౌనంగా కౌసల్య అలానే చూస్తుండిపోయింది. “పుట్టుకతో వచ్చిన పసుపు కుంకుమలు, పూలు భర్తకి ముడిపెట్టడమేమిటి? వాటితో చివరిసారిగా అంటూ ఆమెకు అలంకరించటం, తిరిగి తీసిపడేయడం నేను చూడలేకపోయాను అక్కా. తర్వాత తెల్లచీర కట్టించి, చీకటి గదిలో ముసుగేసి కూర్చోబెట్టి ప్రతి ఒక్కర్నీ వెళ్ళి ఆమె ముఖం చూసి రమ్మనటం.. అబ్బా! నేను తట్టుకోలేకపోతున్నాను. వకుళ అయినా ఆ తంతులు జరగనీయకుండా ఆపించితే బాగుండుననుకున్నాను. కానీ, ఆమె చెప్పబోతే వాళ్ళవాళ్ళంతా ‘చిన్నపిల్లవి నీకేం తెలీదు’ అని తీసిపారేశారు. పెద్దవాళ్ళు చాలామంది ఉండటంతో ఇష్టం లేకపోయినా ప్రేక్షకపాత్ర వహించక తప్పలేదు. ఏమిటీ అన్యాయం? ఏం చేస్తే ఈ దురాచారాల్ని పోగొట్టగలం? ” ఏడుస్తూనే ఒక్కొక్కటీ చెప్పసాగింది దమయంతి.

వింటున్న కౌసల్యకి కూడా తెలియకుండానే కళ్ళనుండి దుఃఖం ప్రవహించింది. దమయంతి వీపుని తడుతూ మౌనంగా ఉండిపోయింది.

అప్పుడప్పుడే అన్ని కులాలనుండీ ఆడపిల్లలు ఒకరొకరే ఉన్నత పాఠశాలల నుండి కాలేజీ మెట్లు ఎక్కుతున్నారు. అంతకు ముందువరకూ కొందరికే పరిమితమై ఉన్న ఉద్యోగాలూ, వ్యాపారాలు చేయటానికి నేడు అన్ని వర్గాల నుండి మహిళలు ముందుకు వస్తున్నారు. కానీ స్త్రీల జీవితాలలో మూలం నుండీ మార్పు వచ్చేకాలం ఎప్పటికో? ఇద్దరి మనసుల్లోనూ ఒకటే ఆలోచన కదిలింది.

“అక్కా మనింట్లోనే చిన్నప్పటి నుండి మనం మనకోసం ఎవరోఒకరం మౌనపో

## ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

**(పాఠకులకు నూటపదార్లు బహుమానం)**

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవలికలు, నవలావలోకనం, కాలాతీతం ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ.116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి!
మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ ఈ నెల 17.

– సంపాదకులు

నిబంధనలు : ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ‘ఉత్తమ సమీక్ష’కు ఎంపిక కాని సమీక్షలకు వీలైతే ‘మనసు ఉన్నదీ..’ శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 -23318181, Ex: 6658, 6532
e-mail: vipula.chatura@gmail.com

రాటం చేస్తూనే ఉన్నాం. బడికి వెళ్ళటానికో, చదువుకోటానికో, ఉద్యోగం చేయటానికో.. ఇంకిప్పుడు పెళ్ళిళ్ళకోసం. ఒక యింటిలోనే ఇంత పోరాటం జరిగితే ఈనాటికి వీటిని మనం పొందగలిగాం. నీకైతే అదీలేదు. అట్లాగే అమ్మ పోయినప్పుడు ప్రాణంలేని కట్టెకి ఏవేవో చేసి, చూసేవాళ్ళని హింసపెట్టేరు. కానీ నాన్నగారికేమీ చేయలేదు. అదే మగాడు పోతే భార్యకి అంత హింసపెట్టి శారీరకంగా, మానసికంగా జీవచ్ఛవాన్ని చేస్తున్నారు. అంతేకాదు పెళ్ళిళ్ళకి, శుభకార్యాలకి స్వంత పిల్లలను కూడా దూరంగా ఉంచుతున్నారు. ఏ సందర్భంలోనైనా హింసని భరించాల్సింది ఆడవారేనా? ఏమిటి అక్కా ఈ వివక్ష? స్త్రీకో నీతి, పురుషుడికో నీతీనా? ఏ హక్కులనైనా సాధించుకోవాలంటే ఆ స్త్రీయే పోరాటం చేయాలి తప్ప ఎంతకాలం గడిచినా, ఎందరు మహిళా నేతలు వచ్చినా, ఎన్ని చట్టాలు చేసినా లాభం లేదు కదక్కా! ఎందుకంటే అవన్నీ చట్టబద్ధం చేస్తున్నవాళ్ళు మగాళ్ళేకదా.." మానసిక వ్యథతో రగిలి దమయంతి వార్షుక మేఘమై అనేక సంఘటనల్ని తవ్వి తీస్తూనే ఉంది. ఆమె మనసులోని దుఃఖం అంతా వర్షించే వరకూ ఆమెకు శాంతిలేదని గ్రహించిన కౌసల్య తాను కూడా ఇన్నాళ్ళుగా బండబారిపోయిన బాధని కరిగించుకొంటూ దమయంతి దుఃఖంలో మమేకమైపోయింది.

అలా.. అలా.. వర్షించి వర్షించి.. ఎప్పటికో సేద తీరారు. అప్పటికి ఇల్లంతా చీకట్లు ముసిరాయి.

"ఏం చేస్తున్నారు చీకట్లో? ఇంకా వంట కాలేదా? " అంటూ వచ్చాడు రామారావు.

అప్పటికి ఈ లోకంలోకి వచ్చిన కౌసల్య నెమ్మదిగా లేచి వంటింట్లోకి నడిచింది.

★ ★ ★

ఎక్కడ ఏం జరిగినా కాలానికి పట్టదు కదా! రమణ్రావుకి ట్రైనింగు పూర్తయి బొంబాయిలో పోస్టింగు వచ్చింది. ముందుగా అతను వెళ్ళి అద్దెకి ఇల్లు దొరికిన తర్వాత దమయంతి కూడా వెళ్ళిపోయింది. ఈలోపున, దమయంతి ఓపెన్ యూనివర్శిటీ ప్రవేశపరీక్ష పాసై డిగ్రీలో చేరింది. అయితే పరీక్షలు ఏ ప్రాంతంలోనైనా రాయొచ్చని కౌసల్యకి చెప్పింది.

యశోద ఎమ్మెస్సీ చివరి సంవత్సరం చదువుతోంది. ప్రభాకరం కూడా ఎమ్మే మొదటి ఏడాది పూర్తయిన తర్వాత పురుషోత్తం ఒత్తిడికి తలొగ్గి కుముద మెళ్ళో మూడుముళ్ళూ వేశాడు. పురుషోత్తం ప్రయత్నం చేసి అల్లుడికి వున్న ఊర్లోకి ఉద్యోగం బదిలీ అయ్యేలా చేసేసరికి అందరూ కలిసే ఉంటున్నారు. రామారావుకి కూడా కొడుకు ఉద్యోగరీత్యా తిరిగి ఇదే ఊరికి రావటం సంతోషమే కలిగింది. కౌసల్యకి చెల్లెళ్ళు దూరమైన తర్వాత కొంత ఒంటరితనానికి గురై వుండటం వలన కుముద కూడా ఉండటంతో మాట్లాడే తోడు దొరికిందనుకుంది.

కానీ కుముద తరహా వేరు. కొత్త కాపురానికి వస్తూ తనతోపాటు అప్పుడప్పుడే మధ్యతరగతి కుటుంబాల ఇళ్ళల్లోకి వస్తున్న అతిథిలా మారిన టీవీని వెంట తెచ్చుకుంది. అప్పటికి జాతీయ, ప్రాంతీయ ఛానల్సు మాత్రమే నియమిత సమయంలో ప్రసారాలు జరుపుతున్నాయి. అవి వస్తున్నంతసేపూ టీవీ ముందే చూస్తూ కూర్చునేది కుముద. మిగతా సమయాల్లో ఇరుగుపొరుగు ఇళ్ళకి పెత్తనాలకి బయల్దేరేది.

ప్రభాకరం ఉదయం వెళ్ళి సాయంత్రానికి వస్తాడు. సాయంత్రం మళ్ళా ఎమ్మే క్లాసులకి నైట్ కాలేజీకి వెళ్తాడు. దాంతో ఇంటి విషయాలు పట్టించుకునే అవకాశం లేదు. రామారావు వయసు పెరిగింది. కీళ్ళనొప్పులతో బైటకు వెళ్ళలేడు. వార్తాపత్రిక కాసేపు తిరగేసి ఏవో ఆధ్యాత్మిక పుస్త

కాలు చదువుకుంటూ కూచుంటాడు.

పిల్లలంతా ఎవరికివాళ్ళే పెద్దలై నిర్ణయాలు తీసుకుంటున్నారని, భార్యపోయిన తర్వాత ఎవరి విషయంలోనూ జోక్యం చేసుకోవటంలేదు. ఇక కౌసల్యకి ఎప్పటి పనులే. ఖాళీ సమయంలో మాత్రం కుట్టు పన్లు యథాప్రకారం చేసుకుంటోంది.

అప్పుడప్పుడు ఫోనుల ద్వారా దమయంతి, యశోదల కబుర్లు తెలుస్తుంటాయి. యశోద కూడా పగలంతా క్లాసులు, ప్రాక్టికల్స్‌తో చివరి సంవత్సరం కావటంతో తీరిక లేకుండా ఉంది. అంతేకాక శని, ఆదివారాలు, సెలవు రోజుల్లోనూ ట్యూషన్లు చెప్తూ తన ఖర్చులకి డబ్బు సంపాదించుకుంటోంది. ఎవరినీ డబ్బు అడగటం ఇష్టం ఉండేది కాదామెకు. అందుచేత సెలవుల్లో కూడా ఇంటికి వెళ్ళటం మానేసింది. కానీ ఎప్పటికబుర్లు అప్పుడు కౌసల్యతో పంచుకుంటూనే ఉంటోంది.




"కంగ్రాచ్యులేషన్స్ యశోదా!"యూనివర్సిటీలోని పార్కులో చెట్టుకి చేరబడి దూరంగా ఎగురుతోన్న పక్షులను చూస్తూ ఒంటరిగా కూర్చున్న యశోద ఉలిక్కిపడి పక్కకి తిరిగి చూసింది. ఆ అదురుకు ఒళ్ళోని పుస్తకాలు కిందికి జారాయి. పుస్తకాలను దొంతు పెట్టుకుంటూ "మీరా మాస్టారు!" అంటూ లేవబోయింది.

"కూర్చో! కూర్చో! ఫర్వాలేదులే" అంటూ శ్రీకాంత్ కూడా ఆ పక్కనే చతికిలబడ్డాడు.

"ఎప్పుడొచ్చారు మాష్టారూ? ఇక్కడికి బదిలీ చేసుకున్నారా? " అంటూ ప్రశ్నలు సంధించింది యశోద, ఆయన అలా తన పక్కన చతికిలపడటానికి ఆశ్చర్యపోతూనే.

ఎప్పుడూ నవ్వుతూ చలాకీగా ఉండే యశోద రిజల్ట్సు వచ్చాక, అందులోనూ మెరిట్‌తో పాసైన తర్వాత కూడా దిగులుగా ఉండటం వింతగా తోచిందతనికి.

"తర్వాత ఏం చేయాలనుకుంటున్నావ్? పరిశోధన ఏమైనా చేస్తావా? ఉద్యోగ ప్రయత్నాలా? "

"ప్చ్. ఇంకా చదువా! ఇంతవరకూ లాక్కురావటమే పెద్ద ఘనకార్యమైంది. ఇంక లాభంలేదు. డిగ్రీ చదివేటప్పుడు మీరిచ్చిన ఉత్సాహంతో ఎలాగో పంతం పట్టి, ట్యూషన్లు చెప్పి ఇంతవరకూ రాగలిగాను. ముందు ఉద్యోగ ప్రయత్నం చేయాల్సిందే. మా యింట్లో కూడా పరిస్థితులు సవ్యంగా లేవు.." మధ్యలో ఆగిపోయింది.

యశోద కాలేజీలో తన విద్యార్థిగా ఉన్నప్పుడు ఆమె యింటిపరిస్థితులు ఆ నోటా ఈ నోటా కొంతవరకూ తెలుసు శ్రీకాంత్‌కు. అంతేకాక ప్రభాకరం అదే యాజమాన్యం కింద నడిచే కాలేజీలో విద్యార్థి.

లెక్చరర్ల కొరతవలన శ్రీకాంత్ రెండు కాలేజీలలోనూ క్లాసులు తీసుకోవలసి ఉండేది. అలా ప్రభాకరం చెల్లెలే యశోద అనే విషయమూ శ్రీకాంత్‌కి తెలుసు.

"మీ అన్నయ్య ప్రభాకరం అనుకుంటా కదా! ఏం చేస్తున్నాడు? " సడన్‌గా గుర్తొచ్చి అడిగాడు.

"టీచర్ ట్రైనింగు చేసి టీచరుగా మా ఊళ్ళోనే ఉద్యోగం చేస్తున్నాడు. ప్రస్తుతం అతను కూడా ఎమ్మే ప్రైవేటుగా చదువుతున్నాడు. పెళ్ళి కూడా అయింది"

"మీ నాన్నగారు? " అర్థోక్తిలో ఆగాడు.

"ఆరోగ్యం అంత బాగాలేదు. ఇప్పుడు ఎవరినీ పట్టించుకోవటం లేదు. ఆయన

ధోరణి ఆయనది. చిన్నక్కకి వివాహం అయిపోయింది. పెద్దక్క చేసుకోనంది. అయ్యో! మా గోలలు చెప్పేస్తున్నట్లుంది. మీ పరిశోధన పూర్తయ్యిందా? తిరిగి ఎక్కడ జాబు వచ్చింది? నిజానికి మీవల్లే నాకు భౌతికశాస్త్రం పట్ల ఇంత అభిరుచి ఏర్పడింది. మీరు పరిశోధన చేసేందుకు వెళ్ళేక తర్వాత వచ్చిన లెక్చరర్ కూడా బాగానే చెప్పేవారు. అదృష్టం బాగుండి క్లాసులో పాసవటం, నాకు నచ్చిన విషయంలోనే ఎమ్మెస్సీ సీటు రావటం జరిగిందనుకోండి.." అంటూ మళ్ళీ మామూలు ధోరణిలోకి వచ్చింది.

ఎప్పుడూ హుషారుగా ఉండే యశోద ఉండుండి నైరాశ్యంలోకి జారిపోబోతూ అంతలోనే ఆ నీడలు చెరిపేసుకొని మామూలుగా కన్పించటానికి చేస్తున్న ప్రయత్నాలు శ్రీకాంత్ గ్రహించాడు. అలా తదేకంగా ఆమె ముఖంలోకే చూస్తూ ఉండిపోయాడు. కళ్ళూ పెదాలూ నవ్వుతూనే ఉన్నా ముఖంలో కదులుతున్న నీలి నీడలు వాటిలోనూ ప్రతిఫలిస్తున్నాయి.

అతను అలా తన ముఖంలోకే చూడటంతో ఇబ్బందిపడి కళ్ళు తిప్పుకుంటూ "మాష్టారూ.. చెప్పరేంటి? " రెట్టిస్తూ అడిగేసరికి ఈ లోకంలోకొచ్చి "ఏమిటి చెప్పటం? " అన్నాడు శ్రీకాంత్.

"అదే.. మీరు నాకేమైనా ఉద్యోగ ప్రయత్నాలలో సాయపడగలరా? నా క్వాలిఫికేషనుతో ముందుగా చిన్నదైనా ఫర్వాలేదు. కాస్తంత కాలు నిలదొక్కుకోవటానికి" అంది యశోద.

"దాని గురించే ఆలోచిస్తున్నాను. నాకు బెంగాల్ యూనివర్సిటీలో పోస్టింగు వచ్చింది. దానికోసం నా పాత సర్వీసుకు సంబంధించిన పనిమీద ఈ వూరు వచ్చాను. అక్కడ అదే యూనివర్సిటీలో లాబ్ అసిస్టెంటు వేకెన్సీలు కూడా ఉన్నట్లు నేను అప్లికేషను పెట్టినపుడే చూశాను. ఆ వైస్‌ఛాన్సలర్ ఒకప్పుడు నేను చదువుకున్న కాలేజీలో నాకు లెక్చరరే. నేనంటే చాలా అభిమానం. నేను ఉద్యోగంలో చేరిన తర్వాత నీకోసం అడుగుతాను. ఈలోగా నీ బయోడేటా అవీ తయారుచేసి నాకివ్వు. నేను మరో రెండు రోజులు ఇక్కడే ఉంటాను. నీకు ఉద్యోగం ఇప్పించగలనని కచ్చితంగా చెప్పలేను, కానీ మన ప్రయత్నం మనం చేద్దాం.." అని తన ఇంటి ఫోను నెంబరు ఇచ్చాడు.

"థేంక్సు మాష్టారు! చాలా థేంక్సు! కాలేజీలో మీరు ఉన్నన్నిరోజులూ నాకు నోట్సు ఇవ్వటానికి, అవసరమైన విషయ సేకరణకీ చాలా సహాయం చేసేవారు. ఇప్పుడు కూడా నాకో ఉద్యోగం ఇప్పించటానికి కూడా.." ఉద్వేగంతో మాటలురాక మెరిసే కళ్ళతో ఆరాధనగా చూస్తూ శ్రీకాంత్ చెయ్యిపట్టుకొని ఊపింది యశోద.

శ్రీకాంత్ మనసు ఊయలలూగినట్లయింది. శ్రీకాంత్ వైజాగ్‌లో ఎమ్మెస్సీ చేసి, యశోద ఇంటర్ చదువుతున్న మహిళా కాలేజీలో లెక్చరర్‌గా జాయినయ్యాడు.

ఆ రోజుల్లో కాలేజీ చదువువరకూ వచ్చే మధ్యతరగతి ఆడపిల్లలు తక్కువే. అందులోనూ చరిత్ర, సాహిత్యం తప్ప గణితం, సైన్సు చదివే ఆడపిల్లలు మరీ తక్కువ. క్లాసులో పదిమంది అమ్మాయిలు ఉండేవారు. వారిలో ప్రత్యేకంగా చురుకుగా ఉన్న యశోదని మొదటిసారి చూసినప్పటి నుండి శ్రీకాంత్‌కి ఆమెపట్ల ఒక తెలియని అభిమానం కలిగింది.

యశోద తెలివితేటలు, ప్రత్యేకంగా తన సబ్జెక్టులో ఆమెకున్న శ్రద్ధ, చదువుపట్ల అంకితభావం అతన్ని ఆకర్షించాయి. శ్రీకాంత్ అప్పుడప్పుడూ తన దగ్గర వున్న నోట్సులుగానీ, లైబ్రరీలోని రిఫరెన్సు పుస్తకాల్నిగానీ ఇస్తుండేవాడు.

యశోద కూడా ఇంట్లో పరిస్థితిని బట్టి పుస్తకాలు కొనటానికి డబ్బులు లేక,

కొత్తగాలి...

**రైతుకు**
**గిట్టుబాటు కానివి**
**ప్రజలకు**
**అందుబాటులో ఉండనివీ**
**ధరలు!**

*– మామిడి మహేంద్ర,*
*పుణే, మహారాష్ట్ర*

తండ్రిని అడగటం ఇష్టం లేక తీరిక దొరికినప్పుడల్లా లైబ్రరీలో కూర్చొని నోట్సు తయారుచేసుకుంటూ ఉండేది. ఇంటరు తర్వాత బీయస్సీలో జాయినయ్యాక కూడా శ్రీకాంత్ అదే కాలేజీలో పనిచేయటంతో యశోద అతనికి శిష్యురాలిగా ఉంది. డిగ్రీకి వచ్చేటప్పటికి ఆ తరగతిలో చదివే ఆడపిల్లల సంఖ్య మరింత తగ్గిపోయింది. ఉన్న ఆరేడుమందిలో యశోద ఒకతే. ఉన్నవాళ్ళు కూడా పెళ్ళిళ్ళు చేసుకొని చదువు మానేసేవారు. దాంతో మాట్లాడే వాళ్ళు తగ్గిపోయి క్లాసు లేకపోతే లైబ్రరీలోనే చదువుకునేది యశోద.

యశోద స్నేహితురాలు భారతి స్పెషల్ క్లాసులో ఉండేది. అందుకని ఏవైనా సందేహాలు వస్తే యశోద లెక్చరర్లనే అడగటం అలవాటు చేసుకుంది. ఆ విధంగా కూడా లెక్చరర్ అయిన శ్రీకాంత్‌తో పరిచయం పెరిగింది.

యశోద రెండో సంవత్సరంలో ఉండగా శ్రీకాంత్ పరిశోధన కోసం ఉద్యోగం వదిలి వెళ్ళిపోయాడు. అంతే, ఆ తర్వాత అతని విషయాలు యశోదకి తెలియవు. మళ్ళీ ఇన్నాళ్ళకి కన్పించినా అదే అభిమానం ఇద్దరి మధ్యా కదిలింది.

శ్రీకాంత్ చెప్పినట్లుగా యశోద తన రెజ్యూమె తయారుచేసి శ్రీకాంత్ చెప్పిన అడ్రసుకి పంపింది. చదువు అయిపోవటంతో హాస్టలురూమ్ ఖాళీ చేయాల్సి ఉంటుందని తన చదువుకు పనికొచ్చే సర్టిఫికెటు కోర్సులో చేరింది. అందువల్ల మరో ఏడాది వరకూ రూమ్ సమస్య లేదు. ఒకవేళ ఉద్యోగం వస్తే అప్పుడు ఖాళీ చేయొచ్చనే నిర్ణయానికి వచ్చింది యశోద.

ఎప్పటికప్పుడు ఫోనుద్వారా విశేషాలన్నీ కౌసల్యకి తెలియచేస్తున్నప్పటికీ ఇంటికి వెళ్ళినప్పుడు కౌసల్యతో శ్రీకాంత్ చెప్పిన విషయాలు తెలియజేసింది. బెంగాల్‌లో యూనివర్శిటీ కాలేజీకి ఉద్యోగానికి దరఖాస్తు పెట్టిన విషయమూ చెప్పింది.

"నువ్వు కూడా దూరమైపోతావేమే?" దిగులుగా అంది కౌసల్య.

"ఎందుకక్కా ఇప్పటిలాగే ప్రతీవారం ఫోను చేస్తాను. ముందు ఉద్యోగం రానీ, ఇల్లు తీసుకొని నిన్ను కూడా తీసుకుపోతాను" కౌసల్య చేతుల్ని తన గుండెకి హత్తుకుంటూ అంది యశోద.

బెంగాల్‌లో ఉద్యోగానికి దరఖాస్తు పెట్టిందని తెలిసి "అంత దూరం ఎందుకే? ఇక్కడెక్కడా ఉద్యోగాలు దొరకవా?" తీవ్రంగానే అన్నాడు రామారావు.

"అయినా ఆలూ లేదు చూలూ లేదు. ఇంకా అప్లికేషను పెట్టే దశలోనే ఇన్ని గొడవలెందుకు? ఇక్కడ ఖాళీలుంటే ఇక్కడా పెడతాను. అక్కడ ఉన్నాయని కచ్చితంగా తెలిసింది కనుక పెట్టాను. ఇన్నిరోజులూ హాస్టలులో ఉండలేదా? అట్లాగే అక్కడ కూడా ఉంటాను" కాస్త చిరాకుగా అంది యశోద.

ఆ కుటుంబాలలో అంత చదువుకున్నవాళ్ళులేరు. అందువల్ల యశోదపట్ల గౌరవం ఉందో? లేదో? కానీ భయం మాత్రం ఉంది కుముదకు. ప్రభాకరానికి మొదటి నుండీ యశోద ధోరణి తెలుసు కనుక పట్టించుకోడు.

సమయం దొరికితే "నేను నీలాగ పెద్ద చదువులు చదవలేదులే" అని దెప్పుతుం

టుంది కుముద. అది విన్న యశోద, కుముదపై జాలి పడ్తుందే తప్ప పెద్దగా పట్టించుకోదు.

అప్పటికీ మొదట్లో కుముదతో పరీక్ష లకు కట్టించాలని చూసి ఆమెకి చదువు పట్ల ఆసక్తిలేదని గ్రహించి వదిలేసింది.

కౌసల్యకి యశోదని చూస్తుంటే ఆశ్చర్యం గానూ ఉంటుంది, అభిమానంగానూ ఉంటుంది.

శ్రీకాంత్ గురించి చెబుతున్నపుడు కౌసల్య సూటిగా యశోదని అడిగింది "శ్రీకాంత్‌ని ప్రేమిస్తున్నావా? " అని.

"ఏమో అక్కా! అంత ఆలోచించలేదు. చదువుకునే రోజుల్లో నాకు సహాయం చేస్తున్నాడనీ, పాఠాలు బాగా చెప్తాడనీ ఇష్టం ఉండేది. ఆ తర్వాత అతను వెళ్ళిపో యాడు. నా లక్ష్యం అంతా ఒక్కటే- బాగా చదువుకోవాలి. నా కాళ్ళమీద నేను నిల బడి ఉద్యోగం చేసి నేనేంటో నిరూపించు కోవాలి. ఆ లక్ష్యసాధనలో అతని గురించి మళ్ళీ ఆలోచించలేదు. ఇన్నాళ్ళ తర్వాత అకస్మాత్తుగా కలిశాడు. అదే అభిమానాన్ని వ్యక్తపరిచాడు. మరీ ముఖ్యంగా ఉద్యోగ సాధనలో సహకారం అందించేలా ఉన్నా డు. ఇది ఎంతవరకూ పోతుందో తర్వాత ఆలోచిద్దాం" తేలిగ్గా అనేసింది యశోద.

ఉద్యోగం వచ్చినప్పుడు చూద్దామని తేలిగ్గా అనేసింది కానీ నిజంగానే యశో దకు ఇంటర్వ్యూకి పిలుపు వచ్చింది.

ఇంటర్వ్యూకి వెళ్ళి వచ్చింది.

యశోద కలగన్నట్లే ఉద్యోగం వచ్చింది. తాను అనుకున్నది సాధించగలిగినందుకు ఆత్మవిశ్వాసంతో ఇంట్లోవాళ్ళందరికీ చెప్పి కావలసినవన్నీ అమర్చుకొని తన కాళ్ళపై తాను స్వతంత్రంగా బతకటానికి సంతో షంతో వెళ్ళిపోయింది యశోద.

★ ★ ★

కాలం గడుస్తున్నకొద్దీ దేశంలోనూ సామాజికంగానూ, ప్రామాణికంగానూ అనేక మార్పులు వస్తున్నాయి, పోతు న్నాయి. జీవనవిధానంలో, అలవాట్లలో, అభిరుచులలో, జన జీవనంలో మనిషి మార్పుకి లోనవుతున్నాడు.

ఇంటిపనిని సులభతరం చేసేందుకు కొత్త కొత్త పరికరాలు సాధారణ గృహిణు లకు కూడా అందుబాటులోకి వస్తున్నాయి. కానీ తీరిక సమయాన్ని మింగేసేవి కూడా అందుబాటులోకి వచ్చి కుటుంబాలలో కలిసి కబుర్లు చెప్పుకునే పరిస్థితులు దూర మైపోతున్నాయి.

ఆ కోవలోనే కుముద మరీమరీ పోరు పెట్టి నలుపు తెలుపు టీవీని మార్చి రంగుల పెట్టెని తెప్పించుకుంది. రోజంతా వచ్చే కార్యక్రమాలతో కుముద పూర్తిగా దానికి అంకితమైపోయింది.

కౌసల్యకి రానురాను మరీ ఒంటరితనం వేధిస్తోంది. ఎంత పూర్తిగా కుట్టుపనిలో లీనమైనా మాట్లాడే మనిషి లేనట్లుగా మూగపోయింది. అప్పుడప్పుడు దమ యంతి, యశోద చేసే ఫోన్లు మాత్రమే ఆమెని చైతన్య పరుస్తుంటాయి.

ఒకరోజు యశోద ఫోన్‌చేసి కౌసల్యతో "శ్రీకాంత్, తాను రిజిష్టరు మారేజి చేసుకు న్నామని, వాళ్ళింట్లో అందరికీ ఇష్టమేనని" చెప్పింది. "నాన్నగారికి, ప్రభాకరానికి నేను రావటం ఇష్టమేనంటే ఒకసారి మేమిద్దరం వచ్చి వెళ్తాం. మేం రావడం వాళ్ళు పరువు నష్టంగా భావిస్తే మరి రాము. నువ్వు ఎప్పుడు వస్తానంటే అప్పుడు నిన్ను మా దగ్గరికి తీసుకువస్తాం" అంది.

'యశోద ఏ పనిచేసినా ఇలా సంచలనం గానే చేస్తుంది. పెళ్ళి కూడా అలాగే చేసు కుంది' అనుకుంది కౌసల్య.

అది తెలిసి ప్రభాకరం ఏమీ స్పందించ లేదు. కుముద ఏదో అనబోయింది, ప్రభా కరం కోపంగా చూసేసరికి ఆగిపోయింది.

రామారావు కాసేపు కోపంగా గొణుక్కు న్నాడు. అతని ఆరోగ్యం అప్పటికే కొంతకా

లంగా క్షీణిస్తూనే ఉంది. ఓపిక తెచ్చుకొని తన పనులు తాను నెమ్మదిగా చేసుకోగలుగుతున్నాడు. కనుక ఏమీ పట్టించుకునే పరిస్థితులు లేవు.

అటువంటి పరిస్థితులలో కౌసల్యాని చూస్తే మాత్రం రామారావుకి దుఃఖం పొర్లిపోతుంది. కాఫీనో, మంచినీళ్ళో, మందో ఏదో తీసుకొని వచ్చినపుడు కౌసల్య చేయి పట్టుకొని "మూర్ఖత్వంతో నీకు అన్యాయం చేశాను తల్లీ!" అని కళ్ళ నీళ్ళు పెట్టుకుంటున్నాడు.

కౌసల్య తండ్రి చేతులు ఆప్యాయంగా నొక్కి వదిలేస్తుంది. అలాగే కొన్నాళ్ళు అనారోగ్యంతో బాధపడి ఒకరోజు తీవ్రమైన వైరల్ జ్వరం వచ్చి ఇంక తేరుకోలేక కన్నుమూశాడు. విషయం తెలిశాక దశ దిన కర్మకాండల సమయానికి యశోద భర్తతో వచ్చి హోటల్లో దిగి, కార్యక్రమానికి హాజరై వెంటనే తిరిగి వెళ్ళిపోయింది. కుముద, దమయంతి ఇద్దరూ గర్భవతులు కావటాన వాళ్ళకి తన అవసరం ఉందని చెప్పింది కౌసల్య. తనతో తీసుకు వెళ్ళాలనుకున్న యశోద ఏమీ అనలేకపోయింది. వెళ్ళేటపుడు దమయంతికి తన అడ్రసు ఇచ్చి 'ఎట్లా అయినా తమ ఇంటికి రావటానికి కౌసల్యక్కని ఒప్పించు' అని చెప్పింది.

కుముదకి వరసగా ఏడాది తేడాతో ఇద్దరు పిల్లలు, దమయంతికి ఒక కొడుకు. పురుళ్ళూ పుణ్యాలూ అన్నీ కౌసల్య చేతుల మీదగానే జరిగాయి. పిల్లాడికి నెలదాటక ముందే దమయంతి వాళ్ళింటికి వెళ్ళిపోయింది. కుముద తన పిల్లల బాధ్యత అంతా కౌసల్య మీదే వదిలేయటంతో పూర్తిగా తీరికలేకుండా అయిపోయింది. అప్పుడే యశోదకి కూడా పాప పుట్టిందని తెల్సింది. కానీ కౌసల్యని పంపడానికి ప్రభాకరంవాళ్ళు ఇష్టపడలేదు. కౌసల్య వెళ్ళిపోతే పిల్లలని చూసేవాళ్ళు ఉండరని వాళ్ల భావన. దాంతో కౌసల్యకు ఇల్లు కదిలే వీలు లేకపోయింది.

★ ★ ★

అంతే అక్కడితో నోటుపుస్తకంలో కౌసల్యక్క రాత ఆగిపోయింది. తర్వాత రాయటానికి సమయం లేక రాయలేదో? ఇష్టం లేక రాయలేదో మరి?

ఆలోచనల్లో ఉండిపోయాను నేను.

రేపు ఉదయమే కౌసల్యక్కకి ఫోనుచేసి వీకెండులో వస్తానని చెప్పాలి. అంతకన్నా ముందు శాంతకి మెయిల్ చేయాలి. ఈ హడావుడిలో పడి ఆవిడకి అక్క విషయం చెప్పటమే మరిచాను.

గభాలున లేచి లాప్‌టాప్ ముందు కూర్చొని శాంతకి అక్క విషయం వివరంగా మెయిల్లో తెలియజేశాను. తనకి శాంతవాళ్ళ సమాజంలో ఆశ్రయం ఇవ్వటమేకాకుండా, తగిన అంశంలో ఆర్థికంగా ఉపాధి కల్పించాలని కోరాను. మెయిల్ 'సెండ్' కొట్టిన రెండో నిమిషంలోనే శాంత చాటింగులోకి వచ్చి మరిన్ని వివరాలు అడిగింది. కౌసల్యక్కకి కుట్టుపనిలోనూ, ఎంబ్రాయిడరీ పనిలోనూ ఆసక్తి ఉందని తెలిసి చాలా సంతోషించింది.

వాళ్ళ సమాజంలో చాలామంది డిజైనర్ దుస్తుల తయారీలో శిక్షణ పొందటమేకాకుండా స్వయంగా కూడా పనిచేస్తున్నారని తెలియజేసింది. ఇందులోనే మరింత విస్తృతపరచి షోరూమ్ తెరవాలని, మార్కెటింగు పట్ల ఆసక్తి ఉన్న యువతులకు దాని బాధ్యత అప్పజెప్పాలని ఆలోచిస్తున్నానని చెప్పింది.

రెండువారాల లోపునే అక్కని శాంతదగ్గరికి తీసుకువస్తానని తెలియజేశాను.

ఇప్పుడు నాకు సంతృప్తిగా అనిపించింది. రేపు ఉదయమే యశోదకి ఈ విషయాలన్నీ ఫోను చేసి చెప్పాలి. లేకపోతే కంగారు పడుతుంది. అలసిపోయి ఉన్నానేమో పక్కమీద వాలగానే నిద్రపట్టేసింది.

★ ★ ★

**అక్షరం**

మనం చిన్నారులకి
జీవితం అంటే ఏమిటో నేర్పించబోతే
వాళ్ళు మనకి జీవితంలో ఏముంటుందో నేర్పిస్తారు.

– ఏంజెలా ష్విండ్,
గృహ శిక్షకురాలు



ఫోను రింగవుతుంటే అప్పుడే గాఢనిద్ర పట్టిందేమో బలవంతంగా కళ్ళుతెరిచి ఫోను అందుకున్నాను. యశోద ఫోను. "భారతీ! వచ్చేశావా? లేదా? అనుకుంటూనే ఫోను చేశాను. మీ మనవరాలు ఎట్లా ఉంది!" అంటూ పరామర్శలు చేసింది. తర్వాత అసలు విషయంలోకి వచ్చింది. "శాంతావాళ్ళు వాళ్ళ సమాజం తరఫున షోరూమ్ తెరవటానికి ఏర్పాట్లు చేస్తున్నారట. కౌసల్యక్క అక్కడకు వెళ్ళాక తన సృజనాత్మకతకు పదును పెట్టుకోవటానికి ఆసక్తి చూపుతోందట. కొత్తకొత్త డిజైన్లు తయారుచేయటమే కాకుండా ఆమె కూడా మిగతా వాళ్ళతోబాటు పనిచేస్తోందట. నేను అక్కని ఎన్నిసార్లు రమ్మన్నా 'అక్కడి భాష తెలియదు, మనుషులు, సంస్కృతి కూడా కొత్తే! నేనుండలేను' అనే వంకపెట్టి నా దగ్గరికి రావటానికి ఇష్టపడలేదు. అందుకని నాకు కోపం వచ్చి కొన్నాళ్ళు ఆమెని కాంటాక్టు చేయడం కూడా మానేశాను. నాది తప్పే. ఆమె పరిస్థితి అంచనా వేయటంలో నేనూ పొరపాటే చేశాననిపించింది. అందరం ఆమెని ఉపయోగించుకొన్నాం. కానీ ఆమెకేం కావాలో అందించలేకపోయాం. వృద్ధాశ్రమంలో చేర్చితే ఆమె సంతోషంగా ఉంటుందేమోనని ఆలోచించి అందరం కలిసి అందులో చేర్చాం.

కానీ అవసరం తీరాక గొడ్డుని కబేళాకి పంపినట్లు ఆమె శక్తిని అంతటినీ కుటుంబమంతా పీల్చేసుకొని ఇలా వదిలేశామనే ఆలోచన చేయలేకపోయాం. విషయం తెలిసి నీవు తీసుకున్న నిర్ణయానికి ఏ రకంగా ధన్యవాదాలు తెలియజేయాలో అర్థం కావటంలేదు" ఉద్వేగంతో యశోద చెప్పుకుపోతూనే ఉంది. ఆమె కంఠంలోని దుఃఖపు జీర ఫోనులో సైతం నాకు వినబడుతూనే ఉంది.

ఆమె మనసులో ఉన్నదంతా చెప్పనిచ్చి అప్పుడు "నిన్ననే ఈ దేశంలో దిగాను. ఇంకా జెట్ లాగ్ తగ్గలేదు. అదీకాక మా అమ్మాయికి అకస్మాత్తుగా రెండు వారాల ముందే డెలివరీ కావటంతో నా ప్రయాణం హడావుడిగా చేయాల్సి వచ్చింది. అక్కడ కూడా చంటిపిల్ల పనితో, అమ్మాయి లేవలేక పోవటంతో బాగా అలిసిపోయినట్లయింది. రెండురోజుల్లో అలసట తీరగానే అక్కడికి వెళ్తాను. నీకేమైనా రావటానికి కుదురుతుందా? " అడిగాను.

"అక్క ముఖం చూడటానికి నాకు సిగ్గుగా ఉంది. ఆమె కాళ్ళమీద పడి క్షమాపణ అడగటానికైనా వస్తాను. ఈ శని ఆదివారాలలో రానా? " అంది యశోద సంతోషంగా.

మరికాసేపు కబుర్లు చెప్పుకొని ఇంక ఫోను పెట్టి ఇంటిపనిలో పడ్డాను.

నాకు ఆయనకి కూడా దీర్ఘకాలిక సెలవు ఇంకా మరో వారం ఉంది. ఈలోగా అయిదు నెలలుగా వదిలేసిన ఇంటిని చక్కదిద్దుకోవాలి అనుకొంటూ సూట్ కేసులలోని సామాన్లు, బట్టలు, బీరువాల్లో సర్దటం మొదలెట్టాను.

అన్నట్లుగానే యశోద శనివారం వచ్చేసింది. ఇద్దరం భోజనాలు చేసి శాంతవాళ్ళ

సమాజానికి బయలుదేరాం. పెద్ద కాంపౌండు, గార్డెనుతో ప్రశాంతంగా ఉంది. మొక్కలన్నీ విరబూసిన పూలతో తలలూపుతూ స్వాగతిస్తున్నాయి.

లోపలికి వెళ్ళగానే ముందు ఆఫీసుగ దిలోని శాంత దగ్గరికి వెళ్ళాం. ఎప్పుడూ చలాకీగా హుషారుగా ఉండే శాంత ముఖం గంభీరంగా ఉంది. ఫోనులో మాట్లాడుతూనే మమ్మల్ని స్వాగతిస్తూ తలవూపి కూర్చోమని సైగచేసింది.

"నిన్న జరిగిన సంఘటన గురించి ప్రచారం వద్దండీ. అనుకోని పరిస్థితుల్లో కొత్తగా ఆమె మా దగ్గరికి వచ్చింది. మొద ట్లో డిప్రెషన్‌వల్ల ఇలా జరగటం సహ జమే. ఆమె ఇప్పుడు కోలుకుంటోంది"

అంతలో మరో ఫోను రింగయ్యేసరికి "ఒక నిమిషం అండీ!" అంటూ రెండో ఫోను తీసి "డాక్టరు విజయగారా! ఆc ఆమె బాగానే ఉందండీ. అంత రాత్రి సమ యంలో వచ్చి సహాయం చేసినందుకు థేంక్స్ డాక్టర్! ఆమెకి ఇప్పుడు కౌన్సిలింగు ఇప్పిస్తున్నాం" అంది శాంత.

ఆ ఫోను పెట్టి మొదటి ఫోనులో మాట్లాడబోయి వాళ్ళు ఫోన్ ఆఫ్ చేయటం గుర్తించి తానూ పెట్టింది.

"ఎప్పుడొచ్చారు భారతీ? యశోదా నువ్వు కూడా వచ్చినందుకు చాలా సంతో షంగా ఉంది" అంది శాంత.

"అక్క ఎలా ఉంది? " అని అడిగిన యశోదకు సమాధానం చెబుతూనే "పదం డి, కౌసల్య దగ్గరికి వెళ్దాం. ఆమె ఇక్కడికి వచ్చాక తనకి ఎలా ఉందో తన ద్వారానే విందురుగాని" అంటూ లేచింది.

శాంత ఫోనులో మాట్లాడిన మాటలు యశోదకి, నాకు కూడా కొంత కంగారు కలిగించాయి.

శాంత తమ సమాజంలో జరుగుతున్న పనులూ, అక్కడివాళ్లు తమ సృజనాత్మక తకు ఎలా మెరుగులు దిద్దుకుంటున్నారో చెప్తోంది. అందరం ఒక రూమ్ దగ్గర ఆగాం. గది తలుపులు దగ్గరగా వేసి ఉ న్నాయి. లోపలి నుండి మాటలు మంద్రం గా వినిపిస్తున్నాయి. పరిశీలనగా ఆలకిస్తే ఆ మాటలు కౌసల్య అక్కవే అనిపించింది.

"..నిజమే, నిన్ను ఎవ్వరూ ఆదరించే వాళ్ళు లేరంటున్నావు. 'ఎవ్వరికీ నేను అక్ఖ రలేదు' అంటూ ఉదయం నుండీ బాధప డుతూనే ఉన్నావు. నువ్వు అక్ఖరలేదను కునేవాళ్ళ గురించి ఏడ్చి, బాధపడి నీ మనసూ శరీరం పాడుజేసుకోవడం ఎందుకూ? ఇక్కడ ఇంతమంది ఆడపి ల్లలు పసికందుల దగ్గర నుండి ముది వగ్గులవరకూ ఉన్నారు. వాళ్ళంతా ఎవ్వ రికీ అక్కరలేనివారే.

ఇప్పుడు ఇక్కడ అందరికీ కావలసినవా రిగా లేరా! ఇంతకుముందు నీకు, నాకు టీ తీసుకు వచ్చిన పాపని కన్నతండ్రి, సవతి తల్లితో కలిసి శారీరకంగా, మానసికంగా హింసించారు. ఆ దారుణంలో ఒళ్ళంతా కాలిన మచ్చలతో చాలాకాలం ఆస్పత్రిలో ఉండి ఇక్కడ చేరింది. అలా ఎంతమందో! వాళ్ళందరికీ శరీరం మీదే కాదు, హృద యం నిండా గాయాల మచ్చలు ఉంటాయి. అందుకోసమని భయపడి ప్రాణాల్ని బలవంతాన తీసుకుంటుంటే ఈ నేలమీద ఎంతోమంది మిగలరు. మనం బతకాలి. మనలాంటి వారిని బతికించాలి. బతకటానికి పోరాటం చేయాలి. కావలసి నది పిరికితనంకాదు. ఏదో ఒకటి సాధించి మనం ఏంటో నిరూపించుకోవల సిన ఆత్మవిశ్వాసం!"

ఇంకా.. ఇంకా.. ఒక తల్లిలా, ఒక స్నేహితురాలిగా, ఒక ఆత్మీయురాలిగా కౌసల్యక్క కంఠం!

తలుపు తోయబోయిన శాంత చేతిని పట్టుకొని యశోద ఆపింది.

వెళ్ళిపోదామని శాంతకు సైగచేసి చెప్పి నేనూ యశోదా వెనుతిరిగాం. ©

పంజాబీ జానపద నవలిక

# మీర్జాసాహిబా

**పంజాబీ సుప్రసిద్ధ జానపద కథలలో 'మీర్జాసాహిబా' ఒక అపురూప ప్రేమకావ్యం!**
**హీర్ రాంఝా, లైలా మజ్ను వంటి ప్రేమకథల సరసన చేరదగిన ఇతివృత్తం..**
**ఇప్పటికే ఈ కథ అనేక పత్రికలలోనూ, పుస్తకాలుగానూ**
**వచ్చి పాఠకులను ఆకట్టుకుంది.**
**అనేకమార్లు చలన చిత్రంగా వచ్చి ప్రేక్షకులను ఉర్రూతలూగించింది.**
**అంతర్జాలంలో దీనికి సంబంధించి లభించిన కొన్ని వివరాలు,**
**సినిమాల ఆధారంగా ఈ కథకు నాగరత్న స్వేచ్ఛానువాదం చేయగా**
**రసజ్ఞులైన 'చతుర' పాఠకులకు అందిస్తున్నాం.**

**నా** పేరు సాహిబా. అరవయ్యెక్క సంవత్సరాల నేను జీవన సాయంసంధ్యలో వున్నాను. శీతాకాలపు ఎండలా జ్ఞాపకాల్ని నెమరేసుకుంటూ శేషజీవితాన్ని వెళ్ళదీస్తున్నా. పిల్లలు చేసిన ఎంబ్రాయిడరీ కుట్లు పరిశీలిస్తూ మిగిలున్న దారప్పోగుల్ని ముడేయడమో లేక కుట్లు సరిగా పడనివి సరిచేయడమో చేస్తుంటాను. ఎప్పుడైనా ఆడపిల్లల్లో ఎవరో ఒకరు ఏదైనా ప్రత్యేక వంటకం చేయమని అడుగుతారు. లేదా అరుదైన వంటకం ఎలా చేయాలో చెప్పమని అడుగుతారు. కానీ అలా అడగడం చాలా అరుదు. సాధారణంగా పిల్లలే ఇంటి సంగతులన్నీ చూసుకుంటారు. నిజం చెప్పాలంటే గతంలో నేను వ్యవహరించిన దానికంటే పిల్లలు చాలా మెరుగ్గా ఉంటున్నారు.

అద్దంలో ముఖాన్ని చూసుకుంటే, ఒకప్పుడు కాంతులు వెదజల్లుతూ మెరిసిన కళ్ళు ఇప్పుడు పేలవంగా కనిపిస్తున్నాయి. నల్లటి ఒత్తయిన కురులు ఇప్పుడు నెరిసిపోయి పల్చగా, తేజోహీనంగా కనిపిస్తున్నాయి. ఒకప్పుడు కాంతులీనిన అందమైన శరీరం ఇప్పుడు పాలిపోయి ముడతలు తేలింది. ఒకప్పటి మహా సౌందర్యమంతా తరిగిపోయినందుకు నాకేం చింత లేదు. మంచి భార్యగా, మంచి తల్లిగా సంపూర్ణ జీవితాన్ని గడిపాను. అందులో సుఖసంతోషాలూ వున్నాయి, దుఃఖాలూ వున్నాయి. చాలా బాధ, ఆవేదనా వున్నప్పటికీ అవన్నీ ఎప్పుడో హరించిపోయాయి. ఇదంతా ఆలోచించి చూస్తే నిజంగా నేను చాలా పొంది, గొప్పగా జీవించాననే చెప్పాలి.

వెచ్చటి, ఆహ్లాదకరమైన నీరెండలో ఏమీ పనిలేకుండా ఖాళీగా కూర్చుని, తోటి వృద్ధ మహిళలతో ఉబుసుపోకకి గాలికబుర్లు చెప్తూ గంటో, రెండు గంటలో కాలక్షేపం చేస్తుంటాను. కాసేపు వార్తలు, ఇంకాసేపు గతస్మృతులు! జ్ఞాపకాలు అంటే పెళ్ళి తర్వాతి విషయాలే గుర్తొస్తాయి. అంతకుముందు జరిగినవాటిని తవ్వి తీయడానికి ఇష్టపడను. పెళ్ళికంటే ముందు జీవితానికి, ఇప్పటికీ మధ్య తొలగించడానికి

వీలుకాని గట్టిగోడ ఏర్పడినట్టుంటుంది..

అయితే ఎప్పుడో ఒకసారి.. చాలా అరుదైన సందర్భాల్లో.. పడకగదిలో నా భర్త కౌగిట్లో కరుగుతున్నప్పుడు ఆ అడ్డుగోడ విరిగి ముక్కలుచెక్కలైపోతుంది. అప్పుడు మీర్జానే గుర్తొస్తాడు. నా భర్త తనపని వేగంగా ముగించేసి అటు తిరిగి పడుకున్నప్పుడల్లా హృదయం గతంతో నిండిపోతుంది. అప్పటి మధురానుభూతి, దాని పర్యవసానపు బాధ అన్నీ తలపుకొస్తాయి. రెండోవైపుకి తిరిగి చీకట్లోనే నిశ్శబ్దంగా కన్నీరు కారుస్తాను. అప్పుడు గుండె బద్దలై ఆనకట్టకు గండిపడినట్లు ఒక్కసారిగా జ్ఞాపకాలు వెల్లువలా తన్నుకొస్తుంటే అందులో కొట్టుకుపోతూ యమ యాతన పడుతుంటాను.

★ ★ ★

మీర్జా మా బంధువులబ్బాయి. వరసైనవాడు కూడా. తల్లిదండ్రుల్నొదిలి మా ఊళ్ళో వుండటానికి వచ్చినప్పుడు అతనికి పదకొండేళ్ళు. అప్పటి అతని రూపం నాకు బాగా గుర్తుంది. సన్నగా, బక్కపల్చగా ఎప్పుడూ చీమిడి ముక్కుతో వుండేవాడు. నాకంటే కొన్ని నెలలే పెద్దవాడు. నేను పొడగరిని కనుక మీర్జాకంటే మూడంగుళాలు పొడుగ్గా వుండేదాన్ని. కారుతున్న ముక్కును నా దుపట్టా అంచుతో తుడుచుకోవడం అతనితో నా మొట్టమొదటి జ్ఞాపకం. చిన్నపిల్లాడిలా కనిపించడంతో నేనతని పనిని ఏవగించుకోలేదు.

నేను స్కూలుకు నడుచుకుంటూ వెళ్తుంటే అతను వీధిలో ఆడుకుంటూ నావైపు చూసేవాడు.

"ఏంటి మీర్జా! స్కూలుకు రావడం లేదా? " అనడిగితే లేదన్నట్లు తల అడ్డంగా ఆడించి మళ్ళీ ఆటలో మునిగేవాడు.

ఒకరోజు అలాగే అడిగితే రావడంలేదని చెప్పాడు. అయితే తిరిగి ఆటలో పడకుండా నా దగ్గరికొచ్చి "కానీ నీ కోసం నీ పుస్తకాలసంచి స్కూలు వరకూ మోసుకొస్తాను" అన్నాడు.

ఇక అప్పట్నుంచీ అది అతని దినచర్యగా మారింది. మా ఇంటి నుంచి, మీర్జా ఇంటిదాకా వెళ్ళగానే అతను నా పుస్తకాల సంచి అందుకుని స్కూలు వరకూ నడిచేవాడు. కారుతున్న ముక్కుతో బక్కపల్చగా వుండి చదువంటే గిట్టని అతను నా కోసం పుస్తకాలు మోసుకొచ్చేవాడు. నేనేమో అందమైనదాన్ని.. వయసుకు మించిన పొడవు! స్కూల్లో వున్న ప్రతీ క్షణాన్నీ ఆనందిస్తాను. బహుశా మా జంట చూపరులకు వింత గొల్పేది. స్కూలుకు రాగానే పుస్తకాలసంచిని నాకిచ్చేసి పరుగున వెళ్ళిపోయేవాడు. స్కూలు ముగిసే సమయానికి నాకోసం ఎదురుచూస్తూ సంచి అందుకుని మా ఇంటివరకూ మోసేవాడు.

ఒకరోజు మా ఇంటిదాకా వచ్చి సంచి నా చేతిలో పెట్టగానే "చాలాసార్లు నా పుస్తకాలు మోసుకొచ్చావుగానీ, ఒక్కనాడూ వాటిని తీసి చూళ్ళేదు. పోన్లేగానీ ఇప్పటికైనా స్కూలుకు రావడం మొదలుపెట్టు" అన్నాను.

"నీకు నేను రావాలనుందా? " అనడిగాడు.

"అవును" అన్నాను.

అంతే! మర్నాడు అతనిది, నాది కూడా సంచులు పట్టుకుని స్కూలుకొచ్చాడు. క్లాసులో తన స్థానంలో కూర్చున్నాడు.

మీర్జా స్కూలుకు రావడం గమనించిన మౌల్వీ చిరునవ్వు నవ్వి, "ఓహ్! ఎవరొచ్చారో చూడండి.. పండుగనాటి చంద్రుడు! పండక్కంటే చాలా ముందే వచ్చాడు" అన్నారు.

మౌల్వీ మాటలకి పిల్లలంతా పగలబడి నవ్వుతుంటే మీర్జా ముఖం సిగ్గుతో ఎర్రబారడం చూశాను. కానీ, అతనేమీ బదులు చెప్పలేదు. పుస్తకాల్లో తల దూర్చేసి చదువుమీదికి దృష్టి మళ్ళించాలనుకున్నాడు.

## రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# స్నేహానికి అర్థం చెప్పిన నవల




మణి వడ్లమాని నవల 'జీవితం ఓ ప్రవాహం' శీర్షికకు తగినట్లుగా ఉంది. జీవితంలో ఒడుదొడుకులు ప్రవాహంలాగా వస్తున్నా ఆ ఆటుపోటులను తట్టుకుని ముందుకు సాగాలని తెలియచేస్తుందీ నవల. 'స్నేహమేరా జీవితం, స్నేహమేరా శాశ్వతం...' అనే పాటలాంటిది శ్రీరామ్, కృష్ణ, బలరామ్, గౌతమీల స్నేహం. ఈ రోజుల్లో స్నేహాన్ని నటించేవారే ఎక్కువ. మనముందు స్నేహం నటిస్తూనే మన వెనుక గోతులు తవ్వేస్తుంటారు. నిజమైన స్నేహం స్నేహితులలోని లోపాలను ఎత్తిచూపదు. అదే కపటస్నేహం లేని లోపాలను సైతం చూపుతుంది. ఇందులో శ్రీరామ్, అతని మిత్రుల స్నేహం ఆదర్శవంతమైనది., అపురూపమైనది. ఇలాంటి స్నేహం మనకు ఎందుకు లభించలేదా అనిపించకమానదు. అలా వారి స్నేహం ఆద్యంతం మూడు పూవులు, ఆరు కాయలుగా సాగుతూ స్నేహమంటే ఇదేరా అన్నట్లుగా నవల ప్రారంభంనుంచి ముగింపు దాకా సాగుతుంది. బలరామ్ భార్య ఉష, కృష్ణ భార్య శాంతి కూడా వారికి తగిన భార్యలు కావడం బంగారానికి మెరుగులు దిద్దినట్లుగా ఉంది.

ప్లీడరుగారు నాటకాలు, దానాలంటూ ఆస్తులు కరిగించడం, కూతురు గౌతమి విషయంలో ముందుచూపు లేకపోవడం, అనర్హునితో వివాహం చేయడం.. ఇదంతా ముందుచూపు లేకుండా ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేసి వారి జీవితాలను సుడిగుండంలోకి నెట్టే తండ్రులకు ఉదాహరణ. కానీ ఈ తరం ఆడపిల్లలు గౌతమిలాగా మోసపోరు. అవసరమైతే గుణపాఠం చెప్పగలరు. ఒకవేళ తెలియక అనర్హునికిచ్చి పెళ్ళి చేసినా తల్లిదండ్రులు తప్పు తెలుసుకుని కూతుర్ని కాపాడుకుంటారు. అంతేకానీ గౌతమిలాగా అణిగి వుండటమో లేక ప్లీడరులాగా నిస్సహాయంగా చూస్తూ కూర్చోవడమో చేయరు.

ఈ రోజుల్లో కొందరి వైవాహిక జీవితాలు అస్తవ్యస్తంగా, నీతివిరుద్ధంగా వుంటున్నాయి. ఇతను కాకపోతే మరో అతను అన్నట్లు భర్తలను మార్చే భార్యలు, ఈమె కాకపోతే మరొకరు అన్నట్లు భార్యలను మార్చే భర్తలు వున్నారు. అలాంటిది ప్రేమించిన గౌతమిని మర్చిపోకుండా, మరో వివాహం జోలికి పోకుండా, తనను చేసుకోవాలని ఆశపడిన శంఖరూప, రేఖలను దూరంగా వుంచి అవివాహితుడుగా వుండిపోవడమేగాక గౌతమి చివరి కోరిక ప్రకారం రమ్యని తన కూతురుగా చేరదీయడం, సమాజసేవకు అంకితమైపోవడం, ఆదర్శప్రాయం. శ్రీరామ్ పేరుకు తగినట్లుగా శ్రీరాముడే అనిపించుకున్నాడు.
అతని బాబాయి ధృవమిత్ర కూడా మూణ్ణాలముచ్చటగా ముగిసిన తన వైవాహిక జీవితంలో భార్యను ప్రమాదంలో పోగొట్టుకున్నా మళ్ళీ వివాహం చేసుకోకుండా ఉండిపోవడం కథకు మరో మలుపు. రచయిత్రికి నా అభినందనలు.

*– నండూరి లీలా ప్రసూనాదేవి*
వెస్ట్ వెంకటాపురం, సికింద్రాబాద్.

కానీ అది వ్యర్థ ప్రయత్నమైంది. అసలే చదువులో చాలా వెనుకబడినవాడు. అందునా చాలా ఆలస్యంగా పుస్తకాలమీద శ్రద్ధ పెట్టాడు. దాంతో చదువు అతని తల కెక్కలేదు. మౌల్వీ ప్రయత్నాలు ఫలించక పోవడంతో మీర్జాని బద్ధకస్తుడని, మొద్దు మొహమని తిట్టడమే కాకుండా బెత్తాని క్కూడా పని చెప్పేవారు. గురువుగారు పిల్లల్ని ఎప్పుడైనా కొట్టడం అనేది మామూలే! అదేం చెప్పుకోదగ్గ విషయం కాదు. కానీ మీర్జా సంగతి అలాక్కాదు. ఇతర పిల్లల్ని వారానికి ఒకసారో రెండు సార్లో కొడితే మీర్జాని రోజులో కనీసం డజ నుసార్లు కొట్టేవారు. ఇది చాలా మామూ లైపోయింది.

ఒకరోజు ఉదయం మౌల్వీ రెండోసారి మీర్జాని కొట్టబోతుంటే నా హృదయం ద్రవించింది. 'ఈయనింత నిర్దాక్షిణ్యంగా, పక్షపాతవైఖరితో వున్నారేంటి? ' అని దిగు లుపడి "మౌల్వీసాబ్! దయచేసి అతన్నింక కొట్టకండి. అతన్ని చదివించే పూచీ నాది. ఇకపై అతను శ్రద్ధగా చదువుతాడని నేను మాటిస్తున్నా" అన్నాను.

ఆ రోజు మీర్జా గురించి నేనలా మాటెలా ఇచ్చానో, మౌల్వీగారు అందుకె లా ఒప్పుకున్నారో ఇవాళ్టికీ నాకర్థంకాదు.

మొత్తానికి మౌల్వీగారు బెత్తాన్ని కిందికి దింపి, "సరే! ఇతని బాధ్యత నీదే. చూద్దాం, నువ్వేం చేస్తావో" అన్నారు కోపా వేశాల్ని దిగమింగుతూ.

ఆ రోజు సాయంత్రం మా ఇంటిదగ్గర నా పుస్తకాల సంచి చేతికిస్తూ "నిజంగా నాకు చదువులో సాయం చేస్తావా? " అన డిగాడు మీర్జా. అలా చేయాలనే కోరిక అతని కళ్ళలో, స్వరంలో కనిపించింది.

నిజానికి మౌల్వీ దెబ్బల నుండి అతన్ని కాపాడాలని మాత్రమే నేనలా అన్నాను. కానీ అతను నా కళ్ళలోకి చూసి అలా అడిగాక మాట నిలుపుకోవడం నా కర్తవ్యం అన్పించింది.

"అదే నీ కోరికా? " చిరునవ్వుతో అతన్ని అనుకరించి అడిగాను.

"అవును" అన్నాడతను.

"అయితే సాయంత్రం భోజనమైపో యాక బైరో అత్త ఇంటికొస్తాను. అక్కడ కలిసి చదువుకుందాం" అన్నాను.

మీర్జా నేననుకున్నదానికంటే నెమ్మదని, బొత్తిగా చదువులో మొద్దని అర్థమైంది. మొదట్లో అతనెప్పటికీ మెరుగుపర్చలేనే మోనని నిరాశ కలిగింది. కానీ మీర్జా చాలా కష్టపడ్డాడు. అదంతా నన్ను మెప్పించడం కోసమేనని నాకు స్పష్ట మైంది. ఏమైతేనేం, క్రమంగా అతనిలో చెప్పుకోదగ్గ మార్పే వచ్చింది. ఈ మార్పుని మౌల్వీసాబ్ కూడా గుర్తించారు.

మీర్జా తెలివితక్కువ కుర్రాడేం కాదు. చాలా విషయాల్ని పుస్తకాల చదువుతో పోల్చి చూడలేం. అతనెంతో తెలివిగా, అప్రమత్తంగా వుంటాడు. అతను పుస్తక జ్ఞానంతో ఒనగూరేదేం వుండదంటాడు. అందువల్ల చదువుమీద శ్రద్ధపెట్టడు గానీ ఇతర విషయాల్లో నేర్పరే. మగపిల్లలు చేసే దుడుకుపనులన్నీ చాకచక్యంగా చేస్తాడు. ఇతర్ల తోటల్లోంచి పక్వానికి రాని పండ్లని దొంగిలించడం, పక్షుల వేట, కాకులు, పిచ్చుకలు పెట్టిన గూళ్ళలో వెదికి గుడ్లను దొంగిలించడం, గాలిపటాలు ఎగ రేయడం లాంటివి బ్రహ్మాండంగా చేస్తాడు. ఏవో అద్భుతాలు చేసి వాటిని ఉత్కంఠభరితంగా చెప్తాడు. 'అరేబియన్ నైట్స్' లాంటి కథలు చదివి వినిపిస్తుంటే అప్పుడు పుస్తకాల్లో కూడా మీర్జాకి ఆనందం కన్పిస్తుంది. ఇలాంటి గడుగ్గాయి, తుంటరిచేష్టలకు ఆకర్షితుడై వాటిని మహా ఇష్టంగానే కాదు గొప్ప అంకితభావంతో చేస్తాడు. తనను తాను హీరోలతో పోల్చు కుంటాడు. నిస్సహాయులకోసం వీరోచి తంగా పోరాడ్డం, అవసరమైతే మృత్యువు

అంతుచూడ్డం నాయకుడి లక్షణమంటాడు. నిజంగానే హీరోలకు మల్లే అతని కళ్ళలో అంతులేని దయ కనిపిస్తుంది. మీర్జాలో ఈ లక్షణాల్ని పసిగట్టిన నేను వాటిని నాకు అనుకూలంగా ఉపయోగించుకోవడం నేర్చుకున్నాను. అతను ఉత్సాహంగా లేనప్పుడు నేను ఏదో కథ చదివి వినిపిస్తాను. ఒకవేళ సోమరిగా, మరీ నెమ్మదిగా వుంటే ఒక్క కథ కూడా చదవకుండా శిక్షిస్తాను.

రోజులు వేగంగా వారాలు, నెలలుగా జరిగిపోతూ ఇట్టే మూడేళ్ళు గడిచిపోయాయి. మీర్జా నా రెక్కలకిందికొచ్చాడు. మౌల్వీసాబ్ మునుపట్లా తరచూ కోప్పడ్డం లేదు. ఒక దశలో మానేశారు. ఇది నా ఘనతే అనుకున్నానంటే అది నా అవగాహనా రాహిత్యమే. నిజానికి మీర్జా ఎదిగాడని, గట్టిగా, దృఢంగా తయారయ్యాడని నాకు తెలిసొచ్చింది. నాకంటే బాగా పొడవయ్యాడు. అతనికి ఇంటిపట్టున వుండటం నచ్చదు. బయట తిరగడం, ఏవో దుడుకుపనుల్లో పాల్గొనడం, ఆటపాటలూ ఇష్టం. మీర్జా పీలగానే వున్నప్పటికీ శరీరం మాత్రం మహా దృఢంగా తయారైంది. ప్రతినిత్యం చూస్తుంటాను గనుక అతనిలో వచ్చిన ఈ మార్పుని నేను గమనించలేదు. ఝూంగ్‌కి అప్పుడప్పుడూ వచ్చి వెళ్ళే మా అంకుల్, మీర్జావాళ్ళ నాన్న ఈ మాటన్నారు.

మీర్జా తన చదువు చక్కగా కొనసాగిస్తున్నాడని అతన్ని సంతోషపెట్టడానికి ఓ కథల పుస్తకం తీసుకుని ఆ సాయంత్రం బైరోఅత్త ఇంటికెళ్ళాను. ఆ సమయానికి అత్తతోబాటు ఆమె బావగారు బింజాల్ జాట్.. మీర్జావాళ్ళ నాన్న ఇంటిముందున్న విశాలమైన ఖాళీస్థలంలో కూర్చుని కుటుంబ వ్యవహారాలేవో మాట్లాడుకుంటున్నారు. మీర్జా ఓ పక్కగా వసారాలో నిలబడి కాలివేళ్ళతో నేలమీద బొమ్మలు గీస్తున్నాడు. నా రాకను గమనించి తల తిప్పి చూశాడేగానీ పలకరింపైనా లేకుండా తిరిగి తన పనిలో లీనమయ్యాడు. తండ్రీకొడుకుల ఆందోళన అంత తీవ్రంగా వుంది.

బింజాల్ నన్ను చూసి "ఏంటమ్మా అది.. ఏం కావాలి నీకు? " అనడిగాడు బిగ్గరగా.

ఆ స్వరానికి భయపడుతూ "మీర్జాకోసం ఓ పుస్తకం తెచ్చాను" అని మెల్లగా చెప్పి నిశ్శబ్దంగా నిలబడ్డాను.

"హు..! నా కొడుక్కిప్పుడు పుస్తకాలా? చొక్కాలోపల వాడి ఛాతి ఎంత విశాలంగా ఎదిగిందో నువ్వు చూడలేదా? ఇప్పుడు వాడు నవయువకుడు. గుర్రప్పందాలు, ముష్టిఘాతాలు, మల్లయుద్ధాలు, కత్తియుద్ధాలు లాంటి విద్యలన్నీ నేర్చే వయసులో ఉన్నాడు. వాణ్ణి తిరిగి దనాబాద్ తీసికెళ్తున్నాను" అన్నాడు మీర్జావాళ్ళ నాన్న.

నేను కాస్త వెనక్కి అడుగులేసి మీర్జా వంక చూశాను. అవును, అంకుల్ చెప్పింది నిజమే. ఇప్పటిదాకా అదేం గమనించలేదు. మీర్జా దనాబాద్ వెళ్ళడమే సముచితం అన్పించింది.

అక్కణ్ణించి ఎలా నిష్క్రమించాలో తెలీక మౌనంగా నిలబడివుండగా మీర్జా తన తండ్రివైపు తిరిగి "ఇప్పుడే దనాబాద్ నేను రాను" అన్నాడు. అతని స్వరం వణికినప్పటికీ పట్టుదల మాత్రం స్థిరంగా వుంది.

కొడుకలా ఎదురుచెప్పేసరికి ఆయనో క్షణం దిమ్మెరపోయి కోపంగా, "ఏమన్నావ్? " అన్నాడు.

తండ్రి కళ్ళలోకి సూటిగా చూస్తూ "ఇప్పుడు దనాబాద్ రాను" అన్నాడు మీర్జా. అతని ముఖంలో భయం కనిపిస్తున్నా కంఠం మట్టుకు స్థిరంగా వుంది.

బింజాల్ మావయ్య కొడుకువైపు కొన్ని అడుగులేసేసరికి, అత్త గబుక్కున అటు నడిచింది. నా గుండె వేగంగా కొట్టుకోసాగింది. అయితే మావయ్య ఉన్నట్టుండి ఆగి, నావైపు తిరిగాడు. కొన్ని క్షణాలు

నావంక కిందినుంచి పైకి ఎగాదిగా చూశాడు. నా ఆకృతి చూసి మీర్జాకంటే పెద్దదానిలా జమకట్టినట్టున్నాడు. కొడుకు ప్రవర్తనాతీరుకి నేనే బాధ్యురాలినన్నట్టుగా వుంది ఆయన వైఖరి. భృకుటి ముడిచి కోపంగా చూశాడు. కానైతే ఏమీ అనలేదు.

అంతలోనే కోపం మాయమైపోయి మెరుస్తున్న కళ్ళతో నవ్వుతూ రెప్ప వేయ కుండా నావంకే చూశాడు.

"నీకు తగిందే" అని, కొడుకువైపు తిరిగి "అన్నట్టు నీకోసం బ్రహ్మాండమైన అరబ్ గుర్రాన్ని తెచ్చాను. అది చూట్టానికి చిన్నగా వున్నా చక్కటి తల, మెడతో మహా సొంపుగా వుంది. గాలికంటే శరవే గంగా పరిగెత్తుతుంది. దాన్ని స్వారీ చేయ తగినవాడివి నువ్వే" అన్నాడు.

క్షణంలో మీర్జా ముఖం పరమానం దంతో వెలిగింది.

ఏదైనా కథ వింటున్నానా? అనిపిం చింది. కానీ కథ కాదు. ఆయన కొడుక్కి నిజంగానే గుర్రాన్నిస్తున్నాడు. యుక్తవయ సులో వున్న కొడుకును తనతో తీసికెళ్ళడా నికి అతనికిష్టమైంది బహుమానంగా ఇచ్చే పన్నాగం. తెలివైన యోచనే. అతని ఉద్దే శమల్లా కొడుకును వెంట తీసికెళ్ళడం.

మీర్జా ఓ క్షణం నావంక చూసి, తండ్రి వైపు తిరిగి "అయితే ఇంటికి రేపే వె ళ్దామా? " అన్నాడు.

మావయ్య విజయగర్వంతో చూశాడు నావంక. అలా చూడడం ఎందుకో నాక ర్థంకాలేదు. మీర్జాని ఇక్కడే ఝూంగ్‌లో వుంచాలనే ఉద్దేశం నాకేంలేదు. మౌల్వీ మళ్ళీమళ్ళీ కొట్టకుండా రక్షించడానికి మాత్రమే మీర్జాని గురించి పట్టించుకుంటు న్నాను తప్ప అంతకుమించి మరే తపనా లేదు. బక్కపల్చగా, చీమిడిముక్కుతో వుండే అతని శరీరంపట్ల నాకెలాంటి ఆక ర్షణా లేదు. మహా అయితే రోజూ ఒక రెండు గంటలు కలిసి మాట్లాడుకుం టున్నాం కనుక కొంచెం మిస్సవుతానేమో. అదీ కొద్దిరోజులుండొచ్చు. ఎందుకంటే మా ఇద్దరిమధ్యా అనుబంధం అంతే!

మరి మావయ్య ఎందుకలా అనుమా నంగా చూస్తున్నాడో నాకర్థంకాలేదు. ఈ గడిచిన మూడేళ్ళల్లో మీర్జా తీరు సవ్యంగా లేదని, అందుకు కారణం నేనేనని అనుకుం టున్నాడాయన. అందుకే నానుండి దూరంగా తీసికెళ్ళాలనుకున్నాడు.

రెండోరోజు ఉదయానే మీర్జా నాకూ, మా పెద్దవాళ్ళకి వీడ్కోలు చెప్పేందుకు మా ఇంటికొచ్చాడు. వీలైనప్పుడల్లా వస్తా నని మాటిచ్చాడు. తండ్రి తెచ్చిన గుర్రం సొంతమౌతున్నదనే ఆనందం అతని కళ్ళలో ప్రస్ఫుటంగా ప్రతిఫలిస్తోంది. అతను మళ్ళీ వస్తానన్న మాట నిలుపుకుం టాడని నాకేం నమ్మకం లేదు. మీర్జా వెళ్ళిన వారానికల్లా అతని గురించి మర్చి పోయాను. కారుతున్న ముక్కును నా దుపట్టా అంచుతో తుడుచుకోవడం, స్కూలుదాకా నా పుస్తకాలు మోయడం ఈ రెండే అతని ఉనికిని గురించి నాకు గుర్తున్న జ్ఞాపకాలు.

★ ★ ★

ఒకట్రెండు సంవత్సరాల తర్వాత మీర్జా గుర్రపు స్వారీలో ఉద్దండుడయ్యాడనే వార్తలు వినవచ్చాయి. గాలితో పోటీపడ్తూ గుర్రాన్ని పరుగులు తీయిస్తాడట. అతను పరుగులు తీయిస్తోంటే అసలా గుర్రం కాళ్ళు భూమ్మీద ఆనడంలేదేమో అన్పిస్తుం దట. మీర్జా నేర్చిన మరోటి విలువిద్య. గురి తప్పకుండా బాణాలేస్తాట్ట. నా స్నేహి తురాళ్ళలో ఒకతె మునీరా. ఆమె తన అత్తతో కలిసి పొరుగూరులో సంతకి వెళ్ళి నప్పుడు మీర్జా విలువిద్యా ప్రావీణ్యాన్ని చూసింది. ఆ పోటీలో పాల్గొని తన సత్తా చూపించాడట. అయితే ఈ భోగట్టా విని నేను అద్భుతపడలేదు, ఆరాధన కలగ లేదు. అతన్ని మళ్ళీ కలవాలని కూడా



అన్పించలేదు.

నా ప్రపంచం మరోవైపు మళ్ళింది. అందులో నాకు ఒకప్పుడు తెల్సిన చిన్న పిల్లాడు మీర్జాకి ఎంతమాత్రం చోటులేదు.

నా శరీరం చక్కగా ఎదిగింది. ఇప్పుడు నేను గంభీరంగా, గర్వంగా నడుస్తాను. నన్ను అబ్బాయిలంతా కళ్ళప్పగించి

చూస్తుంటారు. నా చర్మం పాలరాయిలా మెరుస్తుంటుంది. అందానికి ఆరోగ్యం జత కలిసి ఆకర్షణీయంగా కనిపిస్తున్నాను. నా కళ్ళు, ముక్కు, కురులు ప్రతిదీ బాగున్నా యని చెప్తున్నారు. వెళ్ళినచోటల్లా నా అందచందాల గురించే మాట్లాడుస్తున్నారు. ఇది సామాన్యమైన సౌందర్యం కాదు, చాలా అరుదైంది అంటూ మెచ్చుకుంటు న్నారు. ఈ పొగడ్తలన్నీ నాలో అతిశ యాన్ని నింపాయి. ఇప్పుడు నాకు నేను రాణీలా భావించుకుంటున్నాను. నన్ను నేను అభినందించుకుంటున్నాను, ఆరాధిం చుకుంటున్నాను. అద్దంలో ప్రతిబింబాన్ని గర్వంగా చూసుకుంటున్నాను. దేవుడు మరీ ఉదారుడేం కాదు, అందరికీ ఇంత అందాన్నివ్వడు.

నేను ఒకేఒక్క ఆడపిల్లని, అందులో అందరికంటే చిన్నదాన్నీ కనుక నా ఆరు గురు అన్నలూ నామీద బోల్డంత ప్రేమ కురిపిస్తారు. వాళ్ళ ప్రేమాభిమానాల మధ్యే నేను ఎదిగాను. ఇప్పుడు వాళ్ళంతా నన్నో వికసించిన సుమంలా చూస్తారు. వాళ్ళ గారాబమంతా ఇప్పుడు గౌరవంగా మారింది. చిన్నప్పుడు బొమ్మలు, మిఠా యిలు ఇచ్చిన ఆ చేతులు ఇప్పుడు అంద మైన దుస్తులు, ఆభరణాలు ఇస్తున్నాయి. ఇదంతా మా వదినలకి గిట్టలేదు. నన్నింత అల్లారుముద్దుగా చూసుకోవడం వాళ్ళకు అసూయ కలిగించింది. వాళ్ళంతా అన్నలతో పోట్లాడేవారు. నేను అందులో జోక్యం చేసుకోకుండా ఓ నవ్వు నవ్వి వెళ్ళి పోతుంటాను. అన్నయ్యలకు మట్టుకు నా తర్వాతే వాళ్ళ భార్యాపిల్లలు!

రానురాను పేదాసాదా స్త్రీలపట్ల నాకు చిన్నచూపు పెరిగింది. నేను అహంకారిగా, నా గురించి మాత్రమే ఆలోచించుకునే స్వార్థపరురాలిగా మారడానికి ఇంకో కారణం కూడా వుంది. అదేంటంటే చందా రన్ అధిపతి నాసిర్‌ఖాన్ కొడుకు తాహి ర్‌తో నా పెళ్ళి నిశ్చయమవడం! ఈ చుట్టుపక్కల ఆయన్ని మించిన ధనికుడు, సమర్థుడు, శక్తిమంతుడు ఇంకెవరూ లేరు. కేవలం తండ్రి గొప్పతనమే కాదు, తాహిర్ కూడా మహా పేరున్నవాడు. అందరూ ఏమంటారంటే అతన్నోసారి చూస్తే చాలు ఏ అమ్మాయయినా తనను తాను సర్వస్వం అర్పించేసుకుంటుందని. గుర్రపు స్వారీ, కత్తియుద్ధాల్లో పరిపూర్ణత సాధించి, ఊరూవాడా ప్రఖ్యాతుడయ్యాడు. మా వాళ్ళు తాహిర్ గురించి చెప్పేటప్పుడు వా రి మాటల్లో గొప్ప ఆరాధన కనిపిస్తుంది. అవన్నీ విన్నాక అంతటివాణ్ణి భర్తగా పొందబోతున్న నేనెంత ప్రత్యేక వ్యక్తిని అనిపించేది. ఈ హోదా ఇంకాస్త గర్వాన్ని నింపి మరింత ఉబ్బిపోయేలా, గాల్లో తేలి పోయేలా చేసింది.

నా అహంకారం, అతిశయాలు ఊళ్ళో చాలామంది నుండి దూరం చేశాయి. నేను నిర్లక్ష్యంగా, నిర్మొహమాటంగా మాట్లాడ్డంతో వాళ్ళంతా నాకు దూరంగా వుండసాగారు. నేను చిన్నపిల్లగా వున్న ప్పుడు అందరూ తెగ ప్రేమించేవారు. కానీ యుక్తవయసుకొచ్చాక నా మాటతీరువల్ల ఎవరూ ఇష్టపడ్డం లేదు. అయితే ఈ విషయం నన్నేం బాధించలేదు. 'ఛట్, వాళ్ళెంత? నన్ను ప్రేమగా చూసుకోడానికి మా అన్నల్లేరా? బయటివాళ్ళ కంటే వీళ్ళదే నిజమైన అభిమానం కదా' అనిపిం చింది. పైగా నన్ను చేసుకోబోయేవాడు తాహిర్. ఈ అదృష్టం ముందు వాళ్ళనగా ఎంత అనుకున్నాను.

క్రమంగా ఝూంగ్‌లో, పుట్టింట్లో గడుపు తున్న జీవితం గురించి ఆలోచిస్తున్నప్పుడు చందారన్‌లో తాహిర్‌తో గడపబోయే అస లైన జీవితానికి తరగని కాలం వున్నట్లుగా అన్పించింది. దానికోసం సుదీర్ఘ నిరీక్షణ. వైవాహిక జీవితం గురించి బోల్డన్ని ఊహలు. రోజురోజుకీ తాహిర్‌తో గడప

## కొత్తగాలి...

**ఎవరన్నారు మనదేశం**
**వృద్ధి చెందలేదని**
**వృద్ధాశ్రమాలు ఏటేటా**
**వృద్ధి చెందుతూంటే!**

– పి.వి.ఎన్. ప్రసాద్,
తాడేపల్లి, గుంటూరు జిల్లా

బోయే అందమైన జీవితపు పగటికలలు రంగులమయంగా వుంటున్నాయి. అవి వాస్తవాల్లా భ్రమింపచేస్తున్నాయి. నిజం చెప్పాలంటే అవి భవిష్యత్తు గురించి నేను కంటున్న కలల్లా అస్సలు లేవు. అతనితో చాలాకాలం కలిసి జీవించినట్టు, ఆ అనుభవాలు, అనుభూతులన్నీ ఇప్పుడు స్ఫురణకు వస్తున్నట్లుగా వుంది. తాహిర్‌ని లెక్కలేనన్నిసార్లు చూసినట్టు, అతని స్వరంలోంచి వెలువడిన ప్రతి మాట, అతని మనసులోని ప్రతి భావం నాకు తెలిసినట్టు, అతని శరీరంలో కదలికలు, ముఖ కవళికలు అన్నీ నాకు చిరపరిచితమైన భావన. తాహిర్ స్మరణ మాత్రంతో అతని స్పర్శ నాకు అనుభూతమౌతున్నది.

ఈ ఊహలు, కలలు నా ఉనికిలో భాగమైపోయాయి. ఇవన్నీ నా తిండి, నిద్రలపై తీవ్ర ప్రభావం చూపించాయి. బరువు బాగా తగ్గిపోయాను, కళ్ళకింద నల్లచారలొచ్చాయి. ఎవరూ పక్కన లేకుండా ఒంటరిగా వుండాలనిపిస్తోంది. ఒకవేళ ఎవరన్నా వున్నా అస్సలు మాట్లాడాలన్పించడంలేదు.

నాకు బాగా నమ్మకమైన కొద్దిపాటి స్నేహితులు నన్ను తమతో కలుపుకుని ఆటపాటల్లో భాగస్వామిని చేయాలనుకున్నారు. సాయంత్రాలు నన్ను వాళ్ళతో పాటు తీసికెళ్ళి నది ఒడ్డునో లేక జలకాలాటలలోనో సరససల్లాపాలు ఆడాలనుకున్నారు. బ్రతిమాలీ బామాలీ నచ్చజెప్పేసరికి నేను వాళ్ళతో బయటికెళ్ళడం మొదలుపెట్టాను. కానైతే అవన్నీ భయంకరమైన పిల్లకాయల ఆటలు కావడంతో నాకు ఆడాలన్పించలేదు. నాకిష్టమైన చోట కూర్చుని వాళ్ళ ఆటపాటల్ని నవ్వుతూ చూసేదాన్ని. ఎక్కువ సమయం నా ఊహల్లో నేనుండేదాన్ని.

అలా నేస్తాల ఆటలు గమనించడమో లేదా నా కలల్లో వుండడమో వల్ల ఓ గుర్రం శరవేగంగా నావైపు వస్తున్న సవ్వడి నా చెవులకి సోకలేదు. కాదు కాదు.. ఇప్పుడిన్ని సంవత్సరాల తర్వాత ఆలోచిస్తే ఆ గుర్రపు డెక్కల శబ్దం నా చెవులకి బాగానే విన్పించింది. కాకపోతే ఊహాలోకాల్లో విహరిస్తున్న నేను ఆ శబ్దాన్ని పట్టించుకోలేదు. నీళ్ళల్లో ఆడుతున్న నా నెచ్చెలులు గోలగోలగా అరిచేసరికి నేను ఉలిక్కిపడి ఈ లోకంలోకొచ్చాను. పక్కనే అశ్వారోధకుణ్ణి చూడగానే చిరాకేసింది. అతను నది ఒడ్డున గుర్రాన్నాపి నీళ్ళలో వున్న అమ్మాయిల్ని రెప్పవేయకుండా చూస్తున్నాడు. ఈ కొత్తవ్యక్తిని మునుపెన్నడూ చూడలేదు. అయినా అతనిపట్ల ఆకర్షితురాలినయ్యాను. అందంగా వున్నాడు. తాహిర్ అంత కాకున్నా చాలా మంది మగవాళ్ళకంటే చాలా అందంగా వున్నాడు. అతని అందం కంటే కళ్ళల్లో కాంతి, హుందాతనం, తెల్లటి గుర్రంమీద రాజసంగా కూర్చున్న తీరు ఎవరి చూపుల్నాయినా తనవైపుకి తిప్పుకుంటాయి. అతనితీరుకి ముచ్చటేసింది. గొప్ప ఆత్మవిశ్వాసం కనిపిస్తోంది. గుర్రంమీద కాళ్ళు పెట్టిన తీరు, మోకాళ్ళ వత్తిడితో దాన్ని అదుపుచేసేలా కళ్ళేలు చేపట్టిన విధానం- ప్రతిదీ చాకచక్యంగా వుంది. గుర్రం విషయంలో ఇంతకంటే నేర్పు ఇంకెవరికైనా వుంటుందా? అన్పించింది. ఆఖరికి అతను

అమ్మాయిల్ని చూసే తీరు కూడా అదో ర కమైన నిర్లక్ష్యవైఖరితో గమ్మత్తుగా వుంది.

మా గుంపులో నస్రీన్ మహా ధైర్యవంతురాలు. ఆమె జలకాలాట ఆపేసి ఒక్కుదుటున ఒడ్డుకు వచ్చింది. చున్నీ వున్నప్పటికీ తడిచిన చొక్కాలోని అందాలను ఎంత మాత్రం కప్పివుంచలేకపోయింది.

"ఎవరు నువ్వు? ఆడపిల్లలం ఆడుకుంటుంటే మర్యాదామన్ననా లేకుండా వచ్చి చూస్తున్నావ్? " కోపంగా అడిగింది నస్రీన్.

"క్షమించండి! నేను మిమ్మల్నిలా చూడాలనే కాంక్షతోనో, మర్యాద తెలియకుండానో రాలేదు. నేను కొత్తవాడిని. గుర్రాన్ని వేగంగా పరిగెట్టించడమే ధ్యేయంగా వెళ్తున్నాను. బాగా దాహమేయడంతో కాసిని మంచినీళ్ళు దొరుకుతాయేమోనని ఇటుగా వచ్చాను. తప్పంటారా? " అన్నాడతను. ఆ కళ్ళలో, స్వరంలో గొప్ప నిజాయితీ కనిపించింది. నేనేం మాట్లాడకపోయినా ఆ సుందరుడిపట్ల ఆకర్షితురాలినయ్యాను.

"లేదులేదు, ఇదెంత మాత్రం తప్పు కాదు. దాహార్తుడైన ప్రయాణీకుడికి మంచి నీళ్ళివ్వడం మా కనీస ధర్మం" అని నస్రీన్ ఒడ్డునున్న మట్టికుండ తీసికెళ్ళి నదిలో ముంచి నీళ్ళు తీసుకుని బాటసారి దగ్గరికొచ్చింది. ఆమె నీళ్ళు పోస్తుంటే దాహార్తితో దోసిలిపట్టి చక్కగా తాగాలి కదా! కానీ అతనా శ్రద్ధ పెట్టకపోవడంతో నీళ్ళన్నీ కిందే ఒలికిపోయాయి.

"ఏంటిది? దాహమన్నావు కదాని నీళ్ళు తెస్తే? " చిరాగ్గా అడిగింది నస్రీన్.

"ఎంత దాహంగా వున్నా ఆ నీళ్ళు తాగలేకపోయాను"

"ఎందుకని? "

"ఎందుకని అడుగుతున్నావా? ఆ కుండలో నీ బొటనవేలు మునిగివుంది. ఇప్పటికీ అలాగే వుంది చూడు"

ఆ మాటకు సిగ్గుపడిన నస్రీన్ చేతిలో వున్న కుండను గబుక్కున కింద పెట్టేసింది. ఆమె అవమానభారాన్ని చూసి నాకు జాలి, బాధ కలిగాయి. ఆ కొత్తవ్యక్తి నా వైపు దృష్టి సారించినప్పుడు నేనతన్ని చూశాను. అతని మాటలు విని ముఖకవళికలు గమనించాక అతను తమతో ఆడుకుంటున్నాడని అర్థమైంది.

కాసేపటికి నీళ్ళలో వున్న నెచ్చెలులందరూ అతని చుట్టూ గుమిగూడారు.

నూరాన్‌కు అందమైన అబ్బాయిలంటే బహు ముచ్చట. నస్రీన్ తర్వాత ఆమె కుండ తీసికెళ్ళి నీళ్ళు ముంచుకొచ్చింది. ఆమె అతని దగ్గరికెళ్ళి దోసిట్లో నీళ్ళు పోసే సమయానికి ఒక ఎండిపోయిన ఆకు కుండలో పడింది. నీళ్ళు పోద్దామని చూస్తే అతను చేతులు చాచలేదు.

"ఏమయింది? " అడిగిందామె.

"పాత్రలో ఆకు పడటం చూడలేదా? అలా కలుషితమైన నీటిని తాగుతానని నువ్వెలా అనుకున్నావు? " అని ఎదురు ప్రశ్న వేశాడు.

నూరాన్ తర్వాత తక్కినవాళ్ళంతా నీళ్ళు ముంచుకొచ్చారు. కానీ ప్రతిసారీ అతనేదో వంక చెప్పాడే తప్ప నీళ్ళు తాగలేదు. తాగడం తిరస్కరించిన ప్రతిసారీ నా వైపు తిరిగి నా చూపుతో, నవ్వుతో కలపాలని చూశాడు. నేను కోపంగా, ముభావంగా వున్నప్పటికీ అతని వ్యవహారం ఉల్లాసం కలిగించింది. అతనెలాగైనా సరే నన్ను కదిలించాలని చూస్తున్నాడు.

నీళ్ళు తేవడంలో సఖులందరి వంతూ అయిపోయాక ఏం చేయాలో పాలుపోక వాళ్ళంతా ఏం చేయాలా అని గుసగుసలాడారు. అందర్లోకీ నూరాన్ మాటకారి కదా! అందుకే బాధ్యత తనే తీసుకుంది. వాళ్ళందర్నీ తోసుకుని నా దగ్గరికొచ్చి "సాహిబా, నువ్వు ప్రయత్నిస్తావా? " అని అడిగింది.

నేను నవ్వుతూ "నా స్నేహితులతో

# పోలీసులు - ప్రత్యేక శిక్షణ

చతుర సమాచారం

పోలీసులు లేని సమాజం ఉండదు. వారి కిచ్చే ప్రత్యేక శిక్షణ.. దేశం, ప్రాంతాలను బట్టి మారుతుంది.

★ న్యూయార్క్ సిటీ పోలీసులకి ప్రఖ్యాత చిత్రాలని గుర్తించే శిక్షణనిస్తారు. దొంగిలించిన చిత్రాలని వారు తేలిగ్గా గుర్తించేందుకు ఇది ఉపయోగపడుతుంది.

★ పోలీసు ఉద్యోగాల్లో ఒత్తిడి ఎక్కువ.



దాన్ని అధిగమించడానికి కెనడాలోని అంటారియో పోలీసులకు ధ్యానంలో శిక్షణ ఇస్తున్నారు. స్థానిక బౌద్ధాలయంలో పద్మాసనంలో కూర్చుని 'ఓం'ని స్మరించాలి. అమెరికాలో కూడా ఈ శిక్షణ అమలులో ఉంది.

★ నెదర్లాండ్స్ పోలీసులకి గద్దలతో ఆకాశంలో ఎగిరే డ్రోన్స్‌ని నాశనం చేసే శిక్షణనిస్తున్నారు. ఎయిర్‌పోర్టులు, ఇతర బహిరంగ ప్రదేశాల్లో ఈ గద్దలని వినియోగిస్తున్నారు.

★ కనెక్టికట్‌లోని చెషైర్ పోలీసులకి ఆటిజం పిల్లలని హేండిల్ చేసే శిక్షణ ఇస్తున్నారు. అలాంటి పిల్లలు తమకు తెలియకుండా ఇంట్లోంచి వెళ్లిపోతుంటారు. వారిని వెదికి పట్టుకున్నాక హేండిల్ చేయడంలో ఈ శిక్షణ ఉపయోగపడుతుంది.

★ బ్రెజిల్ పోలీసులకి శిక్షణ ముగిశాక బేడ్జ్‌పిన్‌ని వారి ఛాతికి గుచ్చుతారు! రెండో ప్రపంచ యుద్ధ కాలంలో అమెరికా సైనికులకి ఇలా చేసేవారు. ఇప్పుడు దాన్ని అమెరికాలో నిషేధించారు. నొప్పి భరించే శిక్షణ ఇది!

★ బాల్టిమోర్ పోలీసులకి పిచ్చివాళ్ళని హేండిల్ చేసే శిక్షణ ఇస్తారు.

★ దాదాపు అన్ని దేశాల పోలీసులకి ఫస్ట్ ఎయిడ్, తుపాకులని ఉపయోగించడం, క్యాంపులని చెదరగొట్టడంలో శిక్షణ ఇస్తారు.

మర్యాద లేకుండా మొరటుగా ప్రవర్తించిన వ్యక్తితో శాంతంగా, సహనంగా వుండటం నాకిష్టం లేదు. కాకపోతే దాహంతో వున్న బాటసారికి నీళ్ళివ్వకుండా పంపడం సబబు కాదు, మానవత్వం అనిపించుకోదు గనుక..." అంటూ లేచాను.

నేను, నూరాన్ మెల్లగా మాట్లాడుకోవడాన్ని అతను గమనించడం నాకు తెలుస్తోంది. అతనిప్పుడు సహనంగా లేడు. నేను లేవడానికి ప్రయత్నిస్తుండగానే అతను స్వరాన్ని పెంచి "మీలో ఎవరు కూడా ఒక బాటసారి దాహం తీర్చలేరా? ఝూంగ్‌లో వున్నవాళ్ళంతా మానవత్వం లేనివారా? లేక ఇక్కడి నీళ్ళు తాగడానికి పనికిరానివా? " అన్నాడు.

మా ఊరన్నా, ఈ నది అన్నా నాకు బోల్డంత గౌరవం. అందుకే అతని నిందోక్తులు, ఎత్తిపొడుపులు విని వేగంగా అడుగులేశాను.

"ఝూంగ్ ఊరంటేనే మానవత్వానికి పెట్టింది పేరు. బహుశా నువ్వు చాలా దూరప్రాంతం నుండి వచ్చయినా వుండాలి, లేదంటే ఈ సంగతి నీ చెవుల్లో పడక పోయి ఉండొచ్చు. ఇక మా నది విషయానికొస్తే ఈ నీళ్ళెంత తియ్యగా వుంటాయంటే ఒకసారి తాగితే ఇక తక్కినవన్నీ మర్చిపోతారు" అని నేనంటున్నప్పుడు అతని కళ్ళు చమక్కుమని మెరిశాయి.

తను ఆశించిందే నేను చేశానన్న భావన కనిపించింది.

నేను వేగంగా నది దగ్గరికి నడిచి మట్టి పాత్రలో నీళ్ళు ముంచుకుని అతని వద్దకొచ్చాను. అతని దోసిట్లోకి నీళ్ళు వంపితే తాగకుండా నన్నే తదేకంగా చూస్తున్నాడు.

నేను కుండని కొంచెం పైకి లేపి "ఏంటిది? చూడబోతే నీకసలు దప్పికున్నట్టే లేదే? " అన్నాను.

"లేదు, నాకు నిజంగానే దాహమేస్తోంది" మెల్లగా గొణుగుతున్నట్లుగా అన్నాడు. మళ్ళీ తనే "కానీ, నీ దివ్య సౌందర్యం నా దాహాన్ని తీర్చి, శాంతింపచేసింది" అన్నాడు. అతని మాటలు నా చెవులకు మాత్రమే విన్పించాయి.

ఇలాంటి ప్రశంసలు గతంలో లెక్కలేనన్నిసార్లు విని విసుగుచెందాను. ఆ పొగడ్తలు నాలో గర్వాన్ని పెంచి అవిధేయంగా మార్చడంతో మహా నిర్లక్ష్యంగా ప్రవర్తించే దాన్ని. ఇప్పటికీ నేనంతే. కాకపోతే ఇతడి పట్ల ఏదో తెలీని ఆకర్షణ కలగడంతో అతన్ని అవమానించాలి లేదా ఏడ్పించాలనే కోరిక కలగలేదు.

"ఇతర్లెవరూ నాతో ఇలా చెప్పలేదు. ఇప్పటిదాకా అబ్బాయిలంతా నా ముఖాన్ని, మేని సౌందర్యాన్ని చూస్తే తమకు విపరీతమైన దాహార్తి కలుగుతుందని చెప్పారు" అన్నాను కళ్ళతో నవ్వుతూ. ఆ నవ్వుల మెరుపు అతని శరీరాన్ని తడిమింది. ఎందుకంటే ఆ మేనులో కొద్దిపాటి ఆకర్షణే కాదు, ఆరాధించేంత మహత్తు వుంది. అతను సన్నగా, బక్కపల్చగానే వున్నప్పటికీ అతనిలో గొప్ప సామర్థ్యం, మగతనం కనిపిస్తున్నాయి.

"వాళ్ళు శరీరదాహం గురించి చెప్పివుంటారు, నేను ఆత్మదాహం గురించి మాట్లాడ్తున్నాను" అన్నాడు.

"నిగూఢంగా మాట్లాడ్తున్నావే? "

"ఎలాంటి నిగూఢార్థాలూ లేవు, సాదాసీదాగానే మాట్లాడ్తున్నాను. మునుపెన్నడూ నా అనుభవంలోకి రాని మహత్తేదో ఇప్పుడు కనిపిస్తోంది. అది చూసి నా అంతరాత్మ మురిసిపోతోంది" అన్నాడు.

అప్పుడతని కళ్ళలోకి సూటిగా చూశాను. ఆ మాటల్లో నిజాయితీకి కలవరపడ్డాను. ఎందరు ఎన్నిరకాల పొగడ్తలు గుమ్మరించినప్పటికీ ఇలా ఎవరూ చెప్పలేదు. అతని మాటలకు పడిపోయాను.

"నా మాటలకు అర్థం బోధపడకపోతే ఈ రాత్రికి హీర్ తోటకి రా.. నేనేంటో నీకర్థమయ్యేలా చేస్తా" అన్నాడు. అతనెంత గొంతు తగ్గించి మాట్లాడ్తున్నాడంటే అవి నా చెవులకి సోకడానిగ్గానూ మరీమరీ దగ్గరగా జరిగాను. అతను చెప్పిన తోటలోకి వెళ్ళాలనే కోరిక లేదు. కానీ నన్ను లోబర్చుకున్న అతని మాటని ఎలా కాదనాలో అర్థంకాలేదు.

అతను చాలాసేపటి వరకూ అక్కడే నిలబడి నన్నే చూస్తున్నాడు. నా ముఖంలో ప్రతి భాగాన్నీ తనలో నింపుకుంటున్నట్టు వుంది. ఎదురుగా ఊరిస్తున్న యాపిల్‌ను ఎలాగైనా తినాలన్న ఉద్విగ్నత, పట్టుదల కనిపిస్తున్నాయి.

"సాహిబా! నేన్నీకు తెలీదా? గడచిన కాలం నాలో గుర్తుపట్టలేనంత మార్పు తెచ్చిందా? నేనంత మారిపోయానా? ఇప్పటికైనా నీ మీర్జాని గుర్తుపట్టు" మృదువుగా, లాలనగా నా గడ్డం పట్టుకున్నాడు.

ఆ మాట విని 'మౌల్వీ చేతిలో నిర్దయగా దెబ్బలు తిన్న ఆ నిస్సహాయ పిల్లాడా!' అని నమ్మలేనట్టుగా అతనివంక చూసి "అవున్నిజమే!" అన్నాను. ఆశ్చర్యానందాలతో నా కళ్ళలోంచి ఆనందబాష్పాలొచ్చాయి. నేను కూడా గొణగడం కంటే మెల్లగా "చాలా ఏళ్ళయింది కదా, నీలో విపరీతమైన మార్పొచ్చింది. నువ్వు నాకు తెల్సిన పిల్లాడివి కాదు, ఒక పూర్ణపురుషుడిలా ఎదిగిపోయావు" అన్నాను.

అతని చేయి నా మెడమీదికొచ్చి నన్ను బలంగా తనవైపు లాక్కునేసరికి సిగ్గుపడి పోయాను. అప్పటిదాకా గుసగుసలు పోయిన నెచ్చెలులు ఒక్కసారిగా నిశ్శబ్దమై పోయి మా వంక చూశారు. వాళ్ళేమను కుంటే నాకేంటని నేను పట్టించుకోలేదు.

"నువ్వు కూడా అప్పటిలా లేవు సాహిబా. నీ ఆత్మసౌందర్యం కళ్ళలో ప్రతి ఫలిస్తోంది. నీలో వచ్చిన మార్పు వెలు గులు చిమ్ముతూ నీ ముఖం మెరిసిపో తోంది" చెవిలో గొణిగాడు.

అతని మాటలు నన్ను సుఖంగా వుండ నీయలేదు. ఎందుకంటే నేనెప్పుడూ నా గురించే ఆలోచించుకునే మనిషిని. అతి శయంగా, నిర్లక్ష్యంగా వ్యవహరిస్తాను గనుక ఆత్మసౌందర్యం లాంటి సుగు ణాలు నాలో వున్నాయని చెప్పినంతలో ఆమోదించలేను.

చివరికి "రాత్రికి తోటకి రా!" అని చెప్పి అతను పక్కకు జరిగాడు.

నేను బదులు చెప్పనూ లేదు, అతని కళ్ళలోకి చూడనూ లేదు. తల వంచుకునే సరేనన్నట్లు పంకించాను. తర్వాత నా సఖులవైపు తిరిగి "ఈ బాటసారి ఎవరో మీకు తెలుసా?" అనడిగాను, వాళ్ళ ముఖాల్ని పరిశీలిస్తూ. వాళ్ళంతా అతన్ని బాగా దగ్గరగానే చూశారు. కానీ ఒక్కళ్ళు కూడా మీర్జాని గుర్తుపట్టక తెల్లముఖాలే యడం చూసి "అతను మీర్జా!" అన్నాను.

ఒకామె నవ్వింది. ఇంకొకామె బొత్తిగా నమ్మకుండా "ఉహూ కాదు" అంది.

"నాక్కొంచెం పోలిక కనిపించింది. విలు విద్య పోటీలో చూశాను" అంది మునీరా.

వెంటనే అమ్మాయిలందరూ మీర్జాను చుట్టుముట్టారు. మీర్జా ప్రతి ఒక్కరినీ పల కరించాడు. కుశల ప్రశ్నలడిగాడు, తను తెల్సుకున్నవి చెప్పాడు. కొద్దిసేపట్లోనే అత నెంత దగ్గరివాడయ్యాడంటే కొన్నేళ్ళుగా అతను దూరంగా వున్నాడనే అనిపించ లేదు. చీకటి కమ్ముకొచ్చేదాకా సమయం

## కొత్తగాలి...

**కొడుక్కి ఉద్యోగం**
**కూతురికి వివాహం**
**భార్యకు ఆరోగ్యం**
**అన్నీ సొంత ప్రార్థనలే!**
**విశ్వప్రార్థనలెక్కడ!**

*– శివప్రసాద్ పండా,*
*పాలకొండ, శ్రీకాకుళం జిల్లా*

తెలీనేలేదు.

"మా బైరోఅత్త ఇంటికి వెళ్ళే టైమైంది" అంటూ మా దగ్గర వీడ్కోలు తీసుకుని గుర్రాన్నెక్కి వెళ్ళిపోయాడు మీర్జా.

మేమంతా ఊళ్ళోకి తిరిగెళ్తున్నప్పుడు తక్కిన అమ్మాయిలు మీర్జా భలే మారిపో యాడంటూ ఆనందాన్ని వ్యక్తం చేశారు. నాకతనిపట్ల కలిగిన అభిమానాన్ని మన సులో దాచుకున్నానే తప్ప ఏమీ మాట్లాడ లేదు. మౌనంగా వాళ్ళ మాటలు వింటుం డిపోయాను. నా అనుకున్న వ్యక్తిని వాళ్ళు మెచ్చుకోవడంతో గర్వంగా వుంది.

ఇంటికి వెళ్తూనే వాకిట్లోంచే "మీర్జా ఇక్కడే వున్నాడు.. అతనెంత మారిపోయా డంటే, నేనతన్ని గుర్తుపట్టనేలేదు.." అని బిగ్గరగా అరిచినట్లు చెప్పాను. వాళ్ళేవో కొద్దిపాటి ప్రశ్నలడిగారు. తర్వాత రో జువారీ కార్యక్రమాల్లో పడిపోయాం. సాయంత్రపు భోజనం అయ్యాక "బైరో అత్త ఇంటికెళ్తున్నాను, మీర్జాని కలిసొ స్తాను" అన్నాను, ఎవరైనా వద్దని అడ్డు కుంటారేమోనని అనుమానిస్తూ.

వెళ్ళొద్దని అడ్డుకోలేదు కానీ "మరీ ఎక్కు వసేపు వుండకు" అంది అమ్మ.

'హమ్మయ్య!' అనుకుని ఊపిరి పీల్చుకు న్నాను. మీర్జా ఇంకా చిన్న పిల్లాడే. నేన క్కడికెళ్ళినంతలో అతని వల్ల హాని వుండ

దనుకుంటున్నారని నాకర్థమైంది.

వేగంగా ఇంట్లోంచి బయటపడి, బైరో అత్త వుండే వీధిలోకెళ్ళేసరికి, మీర్జా నా కోసం ఇంటి బయట ఎదురుచూస్తూ నిల బడ్డాడు. మేం గబగబా నడుచుకుంటూ ఊరు దాటి పొలాల్లోంచి చెట్లుపుట్టలూ దాటెళ్ళి ఓచోట ఆగాం. కలిసి కబుర్లు చెప్పుకోడానికి అనువైన చక్కటి చోటది. హీర్ అత్త తన మనోహరుడితో ఆనందంగా గడిపిన ప్రదేశమిది. ఆవిడ ప్రేమకు జ్ఞాపకంగా కట్టిన ఆ సమాధి స్థలంలో ప్రతి గురువారం దీపం వెలిగించడం ఆనవాయితీ. అంతకుమించి దాదాపుగా ఇటు ఎవరూ రారు. ఒకవేళ మా కోసం వెతకాలనుకున్నా ఇక్కడుంటామని ఎవరూ ఊహించలేరు. కనుక మేం దొరకడానికి చాలా తక్కువ ఆస్కారం వుంది.

ఇద్దరం కూర్చున్నాం. మీర్జా నా అందం గురించి, మాయచేసే నా కళ్ళు, పట్టుకుచ్చులాంటి కురులు, సున్నితం, సుకుమారమైన నా మేను గురించి ఏమీ మాట్లాడలేదు. దానికి బదులు మనిషిపై కలిగే ప్రేమ, ఆత్మని ఎంత ఉన్నతంగా మలిచి సుసంపన్నం చేస్తుందో; దయాశీలురు, కరుణామయులు అయ్యేందుకు తోడ్పడ్తుందో చెప్పాడు. అప్పుడు నేను "నువ్వు చెప్తోందేంటో నాకర్థం కావడం లేదు, నేను ఊహించింది ఇది కాదు" అన్నాను.

తర్వాత మీర్జా తన ఇల్లు, గుర్రం, అతను చాలా ఇష్టపడే తన సోదరి షీబోల గురించి చెప్పాడు. నాకు నిరాశ కలిగినా శాంతంగా వున్నాను. బహుశా మీర్జాని మళ్ళీ కలవకపోవచ్చు కనుక చాలా సౌమ్యంగా వుండేందుకు ప్రయత్నించాను. అయితే ఓ గంట తర్వాత ఇళ్ళకు వెళ్ళేందుకు లేచినప్పుడు మీర్జా ఒక్కుదుటున నన్ను లాగి బలంగా హత్తుకుని "రేపు కూడా వస్తావా? " అనడిగాడు.

ఇవాళ్టి కలయికే విసుగ్గా అనిపించినా ఏదో తెలియని ఇది నన్ను తలూపేలా చేసింది. "ఆ.. వస్తాను" అన్నాను.

మర్నాడు గురువారం కావడాన ముస్లిం సమాధులపై సంప్రదాయబద్ధమైన దీపాలు వెలిగించడం మామూలే. హీర్ సమాధి మీద కూడా దీపం కాంతులు చిమ్మింది. మీర్జా అందమైన, దృఢమైన శరీరం మీద నా చూపు నిలిచింది.

"ఎందుకంత దూరంగా కూర్చున్నావ్? " అని మీర్జా అక్కణ్ణించి జరిగి నాకు దగ్గరగా వచ్చి "నీకు తెల్సా, నువ్వెంత అందంగా వున్నావో? నీ సొగసుని వర్ణించడానికి నా దగ్గర మాటల్లేవు" అన్నాడు.

అతని మాటలు చెప్పలేనంత సంతోషాన్ని కలిగించాయి. నా బుగ్గలు వేడెక్కినా తలెత్తి చూసే ధైర్యం లేకపోయింది.

చెట్లమీంచి వచ్చిన చల్లటిగాలి నా శరీరాన్ని హాయిగా తాకింది. ఒణుకుతున్న నా భుజాలపై చెయ్యేసి నన్ను దగ్గరగా తీసుకున్నాడు. అతని ఒంటి వెచ్చదనం అనుభూతికొచ్చింది.

మీర్జా నన్ను బలంగా గుండెకు హత్తుకున్నప్పుడు సంతోషం ఉప్పొంగి నిట్టూర్పులాంటి శబ్దం నాకు తెలీకుండానే వచ్చింది. తర్వాత కౌగిలి వదిలి ప్రేమోద్రేకంతో నా ముఖంలోకి చూస్తూ తల్లోకి వేళ్ళు పోనిచ్చి మృదువుగా దువ్వాడు. బుగ్గలు నిమిరాడు. అతని చేష్టల్లో వ్యక్తమైన ప్రేమ నన్ను ఉక్కిరిబిక్కిరి చేసి గుండె ఆర్ద్రమయ్యేట్లుచేసింది. ఆ క్షణంలో మళ్ళీ దగ్గరకు లాక్కుని నా కురుల్ని ముద్దాడాడు. నేను కాస్త జరగ్గా అతని పెదాలు నా బుగ్గల్ని, ముక్కుని, నుదుటిని ప్రేమగా స్పృశించి చివరాఖరికి పెదాల్ని చుట్టుముట్టాయి. ఆ సుదీర్ఘమైన, ఉద్రేకభరితమైన ముద్దుతో వివశురాలినయ్యాను. తర్వాత అతని చేతులు నా శరీరాన్ని స్వాధీనం చేసుకున్నాయి. నన్నలా పొదుపుకుంటే సురక్షితంగా అనిపించింది. అంతులేని

ఆనందంతో నన్ను నేను మర్చిపోయాను. మాటలకందని ఉద్విగ్నత చోటుచేసుకుంది. మీర్జా నన్ను సొంతం చేసుకుంటున్నా అందులో తన అవసరం తీర్చుకోవడం కంటే నన్ను సంతృప్తిపరచడమే స్పష్టంగా వుంది. నా కళ్ళు నీళ్ళతో నిండాయి.

మా సంగమం నన్నెంత గొప్ప సంతృప్తికి లోనుచేసిందంటే మా ఇద్దరి మధ్యా పటిష్టమైన, ఎప్పటికీ తెగిపోని అనుబంధం ఏర్పడిందని, అతను నాకు కట్టుబడి వుంటాడని అనిపించింది. కలయిక చివరికొచ్చాక తక్కిన మగవాళ్ళలా వదిలేయలేదు. మళ్ళీ నన్ను దగ్గరికి తీసుకున్నాడు. అతని పెదాలు నా బుగ్గలు, ముక్కు, నుదురు, కురుల్ని ప్రేమగా ముద్దాడాయి.

బుగ్గలమీద కన్నీటి చారికల్ని చూసి "ఏంటిది? బాధపెట్టానా? !" అంటూ బుగ్గ మీద ముద్దు పెట్టుకున్నాడు.

కాదని తలాడించానేగానీ నోరు మెదపలేదు. నా హృదయంలో వున్న భావాన్ని వ్యక్తం చేయడానికి మాటలుంటే కదా!

"చెప్పు" అన్నాడు దగ్గరగా పొదువుకుని. నా తలని తన ఉదరం మీద వుంచుకుని "చెప్పు సాహిబా, ఏంటిది? " అన్నాడు.

"అద్భుతమైన మనోల్లాసాన్నిచ్చావు. ఇంత మనోజ్ఞమైన భావన మునుపెన్నడూ అనుభూతికి రాలేదు. నీ ఆత్మీయస్పర్శకి ఏడ్పొచ్చింది" అన్నాను.

కొద్దిసేపట్లోనే మీర్జా మళ్ళీ మరోసారి నన్ను ఆక్రమించుకున్నాడు. ఇది మొదటి కలయిక కంటే ఇంకా మధురంగా వుంది. చివరికి అతను పక్కకు జరిగి, లేచి కూర్చున్నాడు. వేగంగా శ్వాస తీసుకుంటూ వెళ్ళడానికి సిద్ధమై "అల్లా నన్ను క్షమించుగాక" అన్నాడు గొణుగుతున్నట్లుగా.

నేను వెంటనే "ఏమైంది? " అనడిగాను.

"పక్కకు తిరిగేసరికి హీర్ సమాధి నా కాలికి తగిలింది. మనల్నిలా చూస్తే ఆవిడేమంటుందో? " అన్నాడు మీర్జా.

> ## కొత్తగాలి...
>
> **తెలుపును, నలుపును**
> **వేరు చేయడానికి**
> **సబ్బుంది!**
> **మనిషిని మనసును**
> **వేరు చేయడానికి**
> **డబ్బుంది!**
>
> – పాతగొలుసు యోబు,
> ముదునూరు, ప.గో. జిల్లా

"ఆవిడేమీ అనదు. తన కల మన ద్వారా నెరవేరినందుకు నిశ్చింతగా, సంతోషంగా చిరునవ్వు నవ్వుతుంది" అన్నాను.

"తన కలా? "

"అవును తన కలే. రాంఝాతో హీర్ అత్త ప్రేమ వ్యవహారం అందరికీ తెలీడంతో కుటుంబీకులంతా ఆవిడ నడవడి బాగాలేదని సిగ్గుపడ్డారు. హీర్ తల్లి, నాన్నమ్మలు తను చెడిపోవడమే కాకుండా మొత్తం అందరి పరువూ తీసిందంటూ తిట్టిపోశారట. అప్పుడు హీర్ వాకిట్లో నిలబడి బాగా నవ్వి.. ఆవిడ చాలా పొడుగ్గా వుండేదట.. బిగ్గర గొంతుతో 'మీకు కళంకం తెచ్చే, మీ పరువుతీసే పనేదీ చేయలేదు. నేను చేసిందల్లా ప్రేమించడం, ఆ ప్రేమకు కట్టుబడి వుండటం.. అంతే! ఈ పని మీకు తప్పుగా, సిగ్గు కలిగించేలా వుందంటే ప్రతీ తరంలో ఒక హీర్ పుడ్తుంది.. ప్రేమ ఎన్నటికీ సిగ్గు పడాల్సింది కాదని మీకు తెలిసొస్తుంది' అని స్పష్టంగా చెప్పిందట" అంటూ నాకు తెల్సిన సంగతులు క్లుప్తంగా చెప్పాను.

★ ★ ★

ఇప్పుడు జీవితంలో మా కలయికలు ప్రధానమయ్యాయి. ఎప్పుడెప్పుడు ఇక్కణ్ణించి పారిపోయి నా ప్రేమికుని దగ్గరికెళ్తానా, అతనితో మధురానుభూతులు

పంచుకుంటానా అని రోజంతా పొద్దుగూక డంకోసం ఎదురుచూసేదాన్ని. మీర్జా బాహుబంధంలో గడిపే ఆ గంటా లేదా రెండుగంటలు మాత్రమే నాకు సజీవంగా అన్పించేవి. తక్కిన సమయమంతా ఆ క్షణాలకోసం ఎదురుచూస్తున్నట్లుండేది. మెలకువగా వున్న ప్రతి క్షణం మీర్జా గురించి తప్ప మరో ఆలోచనే వుండేది కాదు. నిద్రలో కూడా అతను నన్ను పర వశంలో ముంచిన అంశాల్నే కలగనేదాన్ని.

రోజురోజుకీ రెండు నిమిషాలు ముందుగా ఇంట్లోంచి బయల్దేరి, రెండు నిమిషాలు ఆలస్యంగా ఇల్లు చేరుతు న్నాను. మా ఇంట్లో అందరూ నిజంగా సహనవంతులనే చెప్పాలి. నా రాకపోకల గురించి ఎవరూ ప్రశ్నించలేదు. కారణం ఒకే ఒక్క ఆడపిల్లని కావడం, అందునా ఆఖరిదాన్ని కావడం. దాంతో నాకు ఇవ్వా ల్సిందాని కంటే చాలా ఎక్కువ స్వేచ్ఛని చ్చారు. నా పట్ల కుటుంబసభ్యులు చూపిన ఔదార్యం, సహనం చాలా ఎక్కు వే. కానీ క్రమంగా తరచూ ఇంటికి రాక పోవడం గమనించాక అవి నిలవలేదు.

పదిరోజుల తర్వాత ఓ రాత్రివేళ ఇంటికి తిరిగొచ్చాను. అప్పటికే ఇంట్లో పరివార మంతా నిద్రలోకి జారుకున్నారు, ఒక్క మా పెద్దన్నయ్య షామీర్ తప్ప. ఆయన వాకిట్లోనే ఓ మూల కూర్చుని హుక్కా తాగుతున్నాడు. నా తీరుని గమనిస్తూ "కాస్త నా కోసం హుక్కా గొట్టం నింపాలి.. చేయగలవా సాహిబా? " అనడి గాడు, నన్నే చూస్తూ.

హుక్కా గొట్టం నింపి చేతికిచ్చి, నా గది లోకెళ్ళబోతుంటే షామీర్ నా చేయి పట్టు కుని ఆపి "ఇటు రా సాహిబా! వచ్చి కాసేపు కూర్చో! ఈమధ్య నిన్ను చూట్టమే అరుదైపోయింది.. నాకెందుకో నువ్వు పరాయిదానివైపోయినట్లుంది" అన్నాడు.

ఏం జరగబోతోందో నాకు అర్థమైంది. దాన్నెలాగైనా తప్పించుకోవాలని వుంది. కానీ అన్నయ్య గురించి బాగా తెలుసు. ఉక్కుచేతిలా బిగించి పట్టుకున్నాడు. పారి పోయే అవకాశమే లేదు. తన పక్కనే ఓ మోడా వుంచాడు. దానిమీద కూర్చోవడం తప్ప ఇంకో మార్గం లేదు. నాతో ఏం మాట్లాడాలో, ఏ చర్య తీసుకోవాలో రిహా ర్సల్ చేసినట్లుగా వుంది. ఇప్పుడిక ఆ ప్రకారమే నడుస్తుంది.

"నీకిప్పుడు బైరో అత్త మీద మోజు చాలా ఎక్కువైంది కదూ! అందరూ ఆ సంగతే మాట్లాడుకుంటున్నారు" అన్నాడు షామీర్, హుక్కా పొగను గట్టిగా పీల్చి.

అతని ముఖంలోకి చూశాను. అణచు కున్న కోపం కళ్ళల్లో తొంగిచూసింది గానీ వెంటనే మామూలుగా ముఖం పెట్టాడు.

"కనీసం నువ్వయినా నాతో నిజాయి తీగా మాట్లాడన్నయ్యా.. నువ్వేం చెప్పాల నుకుంటున్నావంటే నేను తరచూ మీర్జాని కలవడం గురించి గుసగుసలుపోతున్నా రని.. అంతే కదా? " అన్నాను.

అన్నయ్య కళ్ళల్లో ఉత్సాహం కన్పిం చింది. నా దగ్గరికొచ్చి భుజాల మీద చెయ్యేశాడు. ఇది సాధారణంగా అన్నాచె ల్లెళ్ళ మధ్యనుండే బంధానికి చిహ్నం కాదు. భయ్యా నాకంటే చాలా పెద్దవాడు. తనెప్పుడూ నన్ను సోదరిగా కంటే కన్నకూ తురిలానే చూశాడు. తనిలా ఆదరంగా చెయ్యేసే పద్ధతి నాకు చాలా ఇష్టం. బోల్డంత ఆనందించేదాన్ని. కానీ, ఇప్పుడు కాస్త కూడా హాయిగా లేదు.

"అవును..! అదే చెప్పాలనుకుంటున్నది" అన్నాడు.

"జనాల మాటల గురించి బాధపడితే మనకు నచ్చినట్లు జీవించలేం, ఇతర్లు చెప్పి నట్లు మాత్రమే బతకాల్సిన పరిస్థితి వస్తుంది" అన్నాను.

"నిజమే! నువ్వెంత తెలివైనదానివో నీ మాటలు చెప్తున్నాయి. అయితే ఇది నీ

జీవితానికి చాలా ప్రమాదం తెచ్చిపెడ్తుంది. వాళ్ళ మాటలు నిన్ను స్వర్గానికి బదులు నరకానికి తీసికెళ్తాయి. నువ్వు నీ చిన్ననాటి మిత్రుణ్ణి కలవడానికి వెళ్తున్నావని, కొన్ని సంవత్సరాలుగా జరిగిన సంగతులన్నీ పరస్పరం పంచుకోడానికని, బైరో అత్త ఇంటికెళ్ళడానికి ఇంతకుమించిన కారణం ఏమీ లేదని మనిద్దరికీ తెలుసు. కానీ, జనానికిదంతా పట్టదు. వాళ్ళల్లా ఓ అందమైన అమ్మాయి.. మొత్తం పంజాబ్ రాష్ట్రంలోనే సొగసైన అమ్మాయి మరో అందమైన అబ్బాయిని కలవడానికి వెళ్తోందని.. ఎవరికి వాళ్ళు తమకు తోచిన విధంగా ఊహాగానాలు చేస్తారు. ఈ మధ్య జనాలంతా మీ ఇద్దరి గురించి తరచూ మాట్లాడ్తున్నారంటే కారణం.. నువ్వు మీర్జాని రహస్యంగా కలవడం వల్లే! పైగా మన గొడ్ల కాపరి రాంఝూ కారణంగా హీర్ అత్త సమాధిపాలైన స్థలమది.." అంటూ షామీర్ ఆగాడు.

నా గుండె వేగంగా కొట్టుకుంది. నా కళ్ళల్లో దాగివున్న రహస్యాన్ని ఎక్కడ కనిపెడ్తాడోనని తనవైపు చూట్టానికి ధైర్యం చాల్లేదు. అన్నయ్యకంతా తెలుసు. మా అనుబంధం గురించి నిస్సందేహంగా తెలుసు.

ఓ నిమిషమాగి షామీరన్నయ్య "మీరిద్దరూ మళ్ళీమళ్ళీ కలుస్తోంటే వదంతులు ఇంకా ఇంకా వ్యాపిస్తాయి. ఇవాళో రేపో ఆ పుకార్లు తాహిర్ చెవుల్ని సోకుతాయి. ఆపైన అతని కుటుంబీకులూ వింటారు. ఆ తర్వాత సంభవించే పరిణామాలేంటో నీకు కచ్చితంగా తెలిసేవుండాలి" అన్నాడు.

తను మళ్ళీ కొంచెం ఆగినపుడు ఆ మాటల గురించి లోతుగా ఆలోచించాను. మీర్జాపట్ల నిండిపోయిన మోహావేశాలతో అతన్ని కలుస్తున్నానేగానీ ఈ పరిణామాల గురించి నేను ఆలోచించలేదు. గతంలో చాన్నాళ్ళపాటు తాహిర్‌ని నా మనసులో నిలుపుకున్నాను. అతన్ని గురించిన ఊహలతో బోల్డన్ని కమ్మటి కలలు కన్నాను. అలాంటి తాహిర్‌ని నా జీవితంలో లేకుండా చేసుకోడానికి సిద్ధంగా లేను.

"అయితే నేను మీర్జాని కలవకుండా నిషేధిస్తావా? " అన్నాను తలెత్తకుండానే.

భయ్యా మెల్లగా నవ్వడం వినిపించింది. "నిన్ను ఏ విషయంలోనయినా అడ్డుకోవడం కల్ల. నీ మీద ఏమైనా నిషేధాజ్ఞలు పెట్టానంటే నేనో తెలివితక్కువ వాడినన్నమాట. నువ్వేం చేస్తున్నావో నీకు తెలియ చెప్పానంతే. నీ మనసు, బుద్ధి ఏం చెప్తే అలా చేయి. కాకపోతే మీర్జాని కలవడంవల్ల వచ్చే దుష్ఫలితాల గురించి హెచ్చరించాను. కనుక ఎలా నడచుకోవాలో నువ్వే ఆలోచించు" అన్నాడు.

ఓ క్షణమాగి అదే మృదువైన స్వరంతో "ఇప్పటికే చాలా ఆలస్యమైంది.. ఇక వెళ్ళి పడుకుందాం పద" అని నా భుజమ్మీద చెయ్యేశాడు. నా గొంతులో ఏదో అడ్డం పడినట్లయింది. నా భుజం భయ్యా ఉదరం మీద పెట్టి సేదతీరడం బొత్తిగా నచ్చలేదు, ఏదో అసహనంగా వుంది. అందుక్కారణం నా అపరాధ భావనే! తప్పు చేశానన్న భావనతోనే అలా చేయబుద్ధి కాలేదు.

"నువ్వన్నది నిజమే. పడుకునే వేళైంది. శుభరాత్రి" అన్నాను, తలొంచుకుని.

రాత్రంతా ఆలోచనల వెల్లువలో కొట్టుకుపోయాను. నిద్రపట్టలేదు. గుండెలనిండా చిక్కటి అంధకారం అలుముకుంటున్న భావన. మీర్జాతో నా రహస్య సమావేశాల గురించి షామీర్‌కి తెలిసిపోయిందని స్పష్టమైంది. కానీ, ఎలా తెలిసిందో నాకర్థంకాలేదు. ఇప్పుడు తను చెప్పినట్లు చేయకపోతే అన్నయ్య తప్పకుండా చర్య తీసుకుంటాడు. ఆలోచనలు ఎంతకీ తెగలేదు. రేపు సాయంత్రం మీర్జాని కలవబోతున్న సంగతి గుర్తొచ్చి, ఆ మధురోహల్లో తేలిపోయాను చాలాసేపు.



తర్వాత ఈ సంగతి మీర్జాకి చెప్పిన ప్పుడు "ఇకపై కలిసేటప్పుడు పరిసరాల్ని గమనించి జాగ్రత్తగా, అప్రమత్తంగా వుందాం" అన్నాడు.

మా అప్రకటిత ఒప్పందం ప్రకారం రాత్రిపూట కలవడాన్ని బాగా తగ్గించేశాం. సాయంత్రాలు సఖులతో కలిసి నది ఒడ్డున ఆటలకు వెళ్ళినప్పుడు మీర్జా దూరంగా వున్న చెట్ల నీడన నాకోసం కాపు కాసేవాడు. నేను అవకాశం దొరకగానే మీర్జా దగ్గరికి పారిపోయేదాన్ని. అక్క ణ్ణించి నది, బాటల మధ్యనున్న మాకను కూలమైన చక్కటి ప్రదేశానికి వెళ్ళేవాళ్ళం. అక్కడి ఒత్తయిన చెట్లు, పొదలు ఇతర్లకు కనపడకుండా మమ్మల్ని కాపాడ్తున్నట్లుం డేవి. ఆ సురక్షితమైన స్థలంలో మేమిద్దరం ఆహ్లాదంగా సమయం గడిపేవాళ్ళం.

"నీకు చాలా అతిశయం" అన్నాడోరోజు మీర్జా, చాలా మృదువుగానే.

ఏం జరిగిందంటే- మా అన్నయ్య సంత నుంచి ఆకుపచ్చ, బంగారు, ఎరుపు రంగుల గాజులు చాలా తెచ్చాడు. ఆ గాజుల్ని ఎలా అయితే అందంగా వుంటాయా అని మార్చిమార్చి వేస్తూతీస్తూ న్నందువల్ల గంటల సమయం గడిచిపో యింది. మొత్తానికి అందమైన అమరిక కుదిరాక నా చేతులవంక చూసుకుంటూ అతనివైపు తిరిగాను. ఓపిగ్గా కూర్చుని నవ్వుతూ చూశాడు.

"ఏం, ఎందుకుండకూడదు? నేనీ పంజాబ్ లోనే అందగత్తెని అం టారు తెల్సా? అందం విషయాని కొస్తే వేరే ఏ అమ్మాయికీ నా పాదాలను తాకే అర్హత కూడా లేదు" అన్నాను.

"అవును, నిజమే చెప్పావ్! కానీ ఆ మాత్రానికి గర్వపడటం సరైందేనా? శారీరక సొగసు తాత్కాలికం. అంతకంటే గొప్పది ఆత్మ సౌందర్యం. ఇది ఎల్లకాలం నీతో వుంటుంది, ఆఖరికి దేహం నశించా క్కూడా. అందుకే మానసిక సౌందర్యం

కోసం ప్రయత్నించాలి" అన్నాడు.

మీర్జా ఇలాంటి వేదాంతాలు వల్లించిన ప్పుడల్లా నాకు చిరాకేస్తుంది. ఇప్పుడు కూడా ఓ క్షణం విసుగ్గా చూశాను.

"ఏంటి! మనసు, ఆత్మ అంటున్నావు? దానికోసం నాకెందుకు తపన? నాకు అందమైన శరీరం· వుంది, అది చాలు. ఎప్పుడో ఓ రోజు ఇది నశిస్తే ఏంటి? ఆ



రోజు ఇప్పుడప్పుడే రాదు, చాలా దూరంగా వుంది" అన్నాను.

ఇది జరిగాక మీర్జా కొన్నిరోజులు సంయమనంతో వున్నాడు. ఆ రోజు సాయంత్రం నది ఒడ్డున మీర్జా కళ్ళలోకి చూసినప్పుడు అతను కూడా ఏదో కోల్పో యినట్లుగా వున్నాడని నాకర్థమైంది. నా స్నేహితురాళ్ళంతా నదిలో దిగి, జలకాలా టల్లో మునిగేవరకూ ఓపిగ్గా ఎదురుచూసి ఆపైన శరవేగంగా మా రహస్యస్థలానికి పారిపోయాం. అంతకు ముందురోజు ఆహ్లాదకరమైన వర్షం పడి తాజాదనాన్ని మోసుకొచ్చింది. వాన ప్రభావంతో చల్లటి గాలి వీస్తూ వాతావరణం హాయిగా వుంది. ఇద్దరం పక్కపక్కన నడుస్తోంటే నా గుండెసవ్వడి వేగాన్నందుకుంది. అత

నెంత ఉద్విగ్నంగా వున్నాడో తెల్సుకోడానికి తలెత్తి చూడాల్సిన అవసరమే లేదు. మా సంగమస్థలాన్ని చేరేందుకు నడిచేమార్గం గుండా పల్లానికి కొంచెం దిగామో లేదో ఒక ఎద్దులబండితో ఓ ముసలాయన ఎదురయ్యాడు. ఆ బండి బురదలో ఇరుక్కుపోయి అవస్థ పడ్తున్నాడు. అతను ఎడ్లను ఎంత అదిలిస్తున్నా, చర్నాకోలతో కొడ్తున్నా లాభంలేకపోయింది. అవి బురదలో చిక్కుకున్న బండిని బయటకి లాగలేకపోతున్నాయి. ముసలాయన బాగా బక్కపల్చగా, క్షీణించిపోయి వున్నాడు. శరీరంలో కండన్నది లేక ఎముకలకు చర్మం కప్పినట్లున్నాడు. దుస్తులు మురిగ్గా వున్నాయి. ఒక్కక్షణం ఆ పెద్దాయనపట్ల జాలేసింది. మరుక్షణం నా ప్రియసఖుని సాన్నిహిత్యంలో కలిగే ఆనందం తలపుకొచ్చి అక్కణ్ణించి కళ్ళు తిప్పుకున్నాను.

"పాపం, పెద్దాయన! బండిని బయటికి లాగలేకపోతున్నాడు" అన్నాడు మీర్జా. అతని గొంతులో జాలి, దయ కనిపించగానే అర్థమైపోయింది, ఏం చేయబోతున్నాడో. అప్పుడు నా దేహంలో కోరిక ఎంత బలంగా వుందంటే, దాన్ని వదులుకోడానికో, వాయిదా వేయడానికో ఎంత మాత్రం సిద్ధంగా లేను. గతంలో మాదిరిగా బాధ, ఒత్తిళ్ళని ఇంకోసారి పెంచిపోషించదల్చుకోక మీర్జా భుజమ్మీద చెయ్యేసి "ఎవరో ఒకరు వచ్చి సాయం చేసేదాకా అతను ఆగుతాడులే పదపద" అన్నాను.

మీర్జా నా చేతిమీద చెయ్యేసి "అతన్నలా వదిలేయకూడదు" అన్నాడు.

"ఎందుక్కూడదు? మన సమస్యలు మనకున్నాయి. ముందు వాటి సంగతి చూడాలి. మనకి చాలా తక్కువ సమయం ఉంది. మళ్ళీ ఇలాంటి అవకాశం ఎప్పుడొస్తుందో తెలీదు" అన్నాను.

"మనం ఆ సమయం కోసం ఎదురుచూడొచ్చు. కానీ ఆయన పరిస్థితి అలా కాదు"

నేను కోపంగా నా చెయ్యి లాగేసుకుని "అంటే నీ ఉద్దేశమేంటి? మనకు దొరికిన ఈ కాసింత సమయాన్ని ఆ ముసలోడి కోసం వెచ్చిస్తావా? " అన్నాను.

"ఉహూ, నువ్వనుకుంటోంది నిజం కాదు. అతను అత్యవసరంలో వున్నాడంటున్నాను.. అంతే"

"మరి నా కోరిక సంగతేంటి? అది కూడా చాలా బాధపెడ్తోంది. ఇంకెవరైనా వచ్చి అతడికి సాయపడొచ్చు. కానీ, నా అవసరాన్ని తీర్చగల్గింది నువ్వు మాత్రమే. మీర్జా దయచేసి వెళ్ళొద్దు. నాకు నువ్వు కావాలి. ఇప్పుడు నిన్నెంత కోరుకుంటున్నానంటే, మునుపెన్నడూ లేనంత తీవ్రంగా.. ఇప్పుడు నాకు నువ్వు కావాలి"

"నాక్కూడా నువ్వు కావాలి. మునుపటికంటే చాలా బలమైన కోరికే వుంది. కానీ మన స్వార్థమే చూసుకుని ఇతర్లను పట్టించుకోకపోతే పనికిమాలిన వ్యర్థమనుషుల మౌతాం" అని మీర్జా తన పాదరక్షలు విప్పి పక్కన పెట్టాడు. తన చొక్కా విప్పి నా చేతిలో పెట్టి బండివైపు కదిలాడు.

నా కోపం ఆక్రోశంగా మారింది. "ఇంకెప్పుడూ నీ దగ్గరికి రాను. ఇప్పుడడిగినట్లు ఇంకెన్నడూ అడగను" అన్నాను కోపోద్రిక్త స్వరంతో.

మీర్జా వెనుదిరిగి నా చుట్టూ చేతులేయాలని చూశాడు గానీ నేను తోసేశాను.

"నీ కోపావేశాలు తగ్గాక నేనేం చేశానో నువ్వు అర్థం చేసుకుంటావు. అప్పుడు నా కోసం హీర్ సమాధి దగ్గరికొస్తావు.. నేన్నీ కోసం ఎదురు చూస్తుంటాను" అని చిరునవ్వు నవ్వి బండి దగ్గరికి వెళ్ళాడు. తన భుజస్కందాల బలాన్ని చూట్టానికి నేను ఆగాను. మీర్జా బండికి భుజాన్ని ఆనించి అతి కష్టమ్మీద బండిని బురదలోంచి బయటికి లాగడం చూశాక అతని చొక్కాని పాదరక్షల మీదికి విసిరికొట్టి వెనక్కెళ్ళిపోయాను, నా నెచ్చెలుల దగ్గరికి.

ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు. అతన్ని తిట్టుకుంటూ, ఏడ్చుకుంటూ గడిపాను. కానీ అతను మంచి పనే చేశాడనిపించింది. తెల్లారేసరికి కోపం తగ్గిపోయింది. నిస్సహాయంగా వున్న ముసలాయనకి సహాయపడకుండా మీర్జా వెళ్ళలేడని నాకు బాగా తెలుసు.

ఆ రాత్రికి హీర్ అత్త సమాధి దగ్గరికెళ్ళాను. మీర్జా అప్పటికే నా కోసం ఎదురు చూస్తున్నాడు.

నేను తనవంక చూశాను. అణచుకున్న కోపం అరక్షణం తొంగిచూసింది కానీ అది వెంటనే మాయమైంది.

మా ప్రేమ మోహావేశంలో వుంది. ఇంతకుముందు కంటే ఇంకా దగ్గరగా, ఆత్మీయంగా అన్పించింది. నా కళ్ళలోంచి నీళ్ళొచ్చాయి.

"ఏంటిది సాహిబా? నేను చేసిందానికి ఇంకా కోపంగానే వున్నావా? " అన్నాడు.

నేను అడ్డంగా తలూపుతూ "లేదు.. నువ్వు గనుక పెద్దాయనకి సాయం చేయకుండా ఆగిపోయి వుంటే నా స్థాయి నీ దృష్టిలో, నా దృష్టిలో కూడా తగ్గిపోయేది. అదేంటోగానీ నీ మీద కోరిక చాలా పెరుగుతోంది.. దాన్నెలా అదుపు చేసుకోవాలో తెలీడం లేదు" అన్నాను.

"ఆ రోజు కూడా వస్తుంది.. ఆ తరుణం వచ్చేదాకా నీ కోసం ఎల్లవేళలా నేను లేనా ఏంటి? !" అన్నాడు నా కురులు సవరిస్తూ.

అతని ఉదరం మీద నా తల పెట్టుకుంటే మహా ప్రశాంతంగా అనిపించింది.

మావిడిపళ్ళు పక్వానికొస్తున్న కాలం. నేను, నా స్నేహితురాళ్ళు పండి రాలిపోయిన లేదా పక్వదశకొచ్చి చెట్టునే వున్న మావిడిపళ్ళను గాలించి కోసుకునేందుకు గంటలకొద్దీ సమయం వెచ్చించిన సందర్భాలెన్నో!

మీర్జాతో కలిసి నాకిష్టమైన మావిడిచెట్టు కింద కూర్చున్నాం. తన ఒళ్ళోంచి తలను కాస్త పైకెత్తి చూస్తే ఒక పక్షి ఓ చిన్న పండును కాడనుంచి తెంపి నోటకరుచుకుని కనిపించింది.

"చూడుచూడు మీర్జా! పక్షులు సాధారణంగా పళ్ళని కొద్దిగా కొరికి తింటాయి. అవి కొరికే పళ్ళు తీయగా వుంటాయంటారు. మరి ఈ పక్షేంటి మొత్తం పండునే పట్టుకుంది? కానీ దాన్నేం చేయాలో పక్షికి తోచడం లేదు. బహుశా ఆ పండు మరీ తియ్యగా ఉండొచ్చు! అందుకే మొత్తం పండునే తెంపి వుంటుంది" అన్నాను.

"అయితే ఆ పండు కావాలన్నమాట!" అని నా ముఖంలో భావాన్ని చదివాడు. తన ఒళ్ళోంచి నా తలను మృదువుగా లేపి నిలబడ్డాడు. పెద్ద దొంగలా చడీచప్పుడూ లేకుండా మేస్తున్న తన గుర్రం దగ్గరికెళ్ళాడు. గుర్రపు జీనులోంచి విల్లు, బాణాలు తీసుకున్నాడు. జాగ్రత్తగా గురి చూసి మావిడిపండును కొట్టాడు. అంతే.. క్షణాల్లో పక్షి ఎగిరిపోయింది. పండు నేల మీద పడకుండానే నేను దోసిలితో పట్టుకుని కొద్దిగా కొరికాను. అమోఘంగా వుంది!

"చాలా చాలా తీయగా వుంది.. నువ్వూ తిని చూడు" అన్నాను, మీర్జాకందిస్తూ.

తల అడ్డంగా ఊపి "నీ ఆనందం చూస్తే చాలు, నాకు మురిపెంగా వుంటుంది, కడుపు నిండిపోతుంది" అన్నాడతను.

★ ★ ★

ఆ పరమానందమైన రోజులు నెమ్మదిగా అంతరించిపోయాయి. అతన్నెటికీ అలాగే వుండడని, తల్లిదండ్రుల దగ్గరికి వెళ్తాడని నాకు తెలుసు. కానీ దాని గురించి ఆలోచించడం నాకిష్టం లేదు. మీర్జాని కలిసిన ప్రతిరోజూ బోల్డంత ఆనందం! ప్రతి కలయికా గొప్ప సంతృప్తి! మా అనుబంధం గట్టిపడింది. అది చాలు.

కానీ మన సంతోషాలు ఎంత గొప్పవైనా కూడా అవి కొన్నాళ్లపాటే కదా! మా కలయిక కూడా సన్నగిల్లింది. అది ఉన్న

## కొత్తగాలి...

**అశరీరవాణి**
**దేవ వాక్కయితే**
**చరవాణి**
**వేద వాక్కు!**

– యం. సీత,
భద్రాచలం, ఖమ్మం జిల్లా

ట్టుండి అర్థాంతరంగా ముగిసింది. మును పటిలా గాక హీర్ సమాధి దగ్గరికి అప్పుడప్పుడూ మాత్రమే వెళ్తున్నాను.

ఒకరోజలా అరుదుగా వెళ్ళొచ్చేసరికి ఇంటివద్ద షామీరన్నయ్య నా కోసం ఎదురుచూస్తున్నాడు హుక్కా పీలుస్తూ.

నేను ఇంటిముంగిట్లో అడుగుపెట్టినా, అన్నయ్య నా వంక కూడా చూళ్ళేదు.

తలుపు వేసి లోపలికొచ్చి "ఇంకా మెలకువగానే వున్నావేం భయ్యా? " అన్నాను.

"నేనొక్కణ్ణే కాదు" అన్నాడు.

నేను తన వంక చూడకుండా ఇంట్లోకి వెళ్ళడానికి ప్రయత్నిస్తూ "బైరో అత్త దగ్గరున్నాను" అన్నాను.

"ఇంత రాత్రి దాకానా? " అన్నాడు.

నేనింకా నిలబడే వున్నాను. ఇకపై అబద్ధాలు కొనసాగించడం సాధ్యం కాదని, ఇంట్లో తక్కినవాళ్ళెవరికీ తెలీకుండా ఒంటరిగా కూర్చోబెట్టి నెమ్మదిగా బుజ్జగిస్తూ చెప్పడం కుదిరేపని కాదని అర్థమైనట్లుగా ఉంది. "కూర్చో సాహిబా! ఇక దీన్నింతటితో ముగించాలి" అన్నాడు షామీరన్నయ్య.

నేను మోడా లాక్కుని కొద్ది దూరంలో కూర్చుని తన వంక చూశాను.

"ఇంతకుముందు నేన్నీతో మాట్లాడినప్పుడు నీకదంతా అర్థం లేనిదని, అతన్ని కలవకుండా అడ్డుకోబోతున్నానని నీకనిపించిందని నాకు తెల్సు. నేను చెప్పాక ఆలోచిస్తావని, నువ్వు చేస్తున్నది సరైంది కాదని అర్థం చేసుకుంటావని, ఎలాంటి ఆపదా రాకుండా జాగ్రత్త పడ్తావని అనుకున్నాను. సరే, ఇప్పుడు చెప్పు. అతన్ని వదిలేస్తావా లేదా? " అన్నాడు.

"లేదు" నేను మెత్తటి స్వరంతో మృదువుగానే చెప్పినా, అందులో దృఢ సంకల్పం వుంది. ఇది ప్రచ్ఛన్నంగా చెప్పినమాట. ఎలాంటి డొంకతిరుగుడూ లేదు.

షామీర్ నిట్టూర్చాడు. మొత్తం ఒళ్ళంతా కంపించేలా సుదీర్ఘంగా నిట్టూర్చి "అయితే, ఈ సంబంధానికి చరమాంకం పాడ్డానికి నేనింకో దారి వెతకాలి. శుభరాత్రి" మాటలు పొడిగించకుండా లేచి ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

భయ్యా క్లుప్తంగానే మాట్లాడినా, స్థిరచిత్తాన్ని తెలియజేసినట్లున్నాయా మాటలు.

నేను ఒంటరిగా వాకిట్లోనే కూర్చున్నాను. మదిలో భయం, ఆందోళనా బయల్దేరాయి. అప్పటికప్పుడు పరుగున వెళ్ళి మీర్జాతో నా భయాన్ని పంచుకోవాలనిపించింది. షామీరన్నయ్య గురించి నాకు బాగా తెలుసు. చేతల మనిషి. మా బంధాన్ని తెంపుతానన్నాడంటే ఆ పని తప్పకుండా చేస్తాడు.

తర్వాత నా గదిలోకెళ్ళాను. ముందేం జరగబోతోంది? భయ్యా ఎలాంటి నిర్ణయం తీసుకోబోతున్నాడు? అనే భయంతోనే రాత్రంతా గడిచింది. మరోసారి భవిష్యత్తు గురించిన ఆందోళన నన్ను కలవరపరిచింది.

మరుసటిరోజు కూడా ఆ భయాందోళన అలాగే వుంది. మా బంధాన్ని తెంపేయడానికి ఏ పద్ధతిని అనుసరించబోతున్నాడు? ఒకవేళ మీర్జాకి హాని కలిగించబోతున్నాడా? ఆ ఆలోచనే నన్ను అనారోగ్యంపాలు చేసింది. ఆ సాయంత్రం నా సఖులతో కలిసి నది ఒడ్డుకు వెళ్ళినవేళ నేను దాదాపుగా జబ్బుమనిషిలా ఉన్నాను.

చివరికి మా రహస్యస్థలం చేరి కూర్చు న్నాక షామీరన్నయ్య ఏమన్నాడో మీర్జాకి చెప్పాను. తను నన్ను గుండెకు హత్తుకుని నా భయాలన్నిట్నీ పోగొట్టాడు. ముద్దులు, కౌగిలింతల కంటే అతని స్థిరమైన, మృదు వైన మాటలు మరింత శాంతపరిచాయి.

"మీ అన్నయ్య బహుశా నన్ను కొట్టడా నికి ధైర్యం చేయడు. అలా చేస్తే మన కుటుంబాల మధ్య సత్సంబంధాలు దెబ్బ తింటాయి. తీవ్ర ఖండనలు, మందలిం పులు ఎదుర్కోవాల్సివస్తుంది.. మౌల్వీల్లోనే గాక మొత్తం కులంలోనే ఆగ్రహానికి లోను కావాల్సివుంటుందని అతనికి బాగా తెలు సు. ఎంతైనా నేనతనికి బంధువుని. కనుక షామీర్ నన్నేం చేయడు. బహుశా మా అమ్మానాన్నల్ని కలిసి నాకు నచ్చజెప్పేలా ఒప్పించి, నా మెడలు వంచే ప్రయత్నం చేస్తాడు. నీ మీద నాకు, నా మీద నీకు ప్రేమ వున్నంతవరకూ నన్నెవరూ ఏమీ చేయలేరు. కనుక ధైర్యంగా వుండు సాహిబా! నీ మీద నీకు నమ్మకం, ధైర్యం వుండాలి. మనిద్దరం కలిసుండాలని స్థిరంగా నిశ్చయించుకుంటే మనమధ్యకి ఎవరూ రారు" అన్నాడు.

అలా మీర్జా నా భయాలన్నీ పోగొట్ట డంతో నా ప్రేమ విషయమై గొప్ప నిశ్చింత, సంతోషం కలిగాయి. మర్నాడు షామీర్ ఎక్కడికో వెళ్ళినా, దానిగురించి ఎవరూ సంతృప్తికరమైన సమాధానం చెప్పకపోయినా కూడా బాధపడాల్సింది, బెంగ చెందాల్సిందీ ఏమీ లేదనిపించింది. తను ఐదు రోజుల తర్వాత తిరిగొచ్చాడు. లోగిల్లో అడుగుపెట్టగానే అన్నయ్య ముఖంలో అనిశ్చితిని చూశాడు నాన్న. వాళ్ళిద్దరూ ఒకర్నొకరు చూసుకోడాన్ని గమనించాను. ఆ చూపు దాదాపుగా అగో చరంగా వుంది. అయినా దిగులు చెంద లేదు. మీర్జా చెప్పింది సత్యం. మా ప్రేమ మీద మాకు నమ్మకం వున్నంతవరకూ మా మధ్యలోకి ఎవరూ రాలేరు.

కానీ, రెండ్రోజుల తర్వాత నేను బాధప డాల్సిన తరుణం వచ్చింది. మీర్జాని వెంటనే రమ్మంటూ అతని తండ్రి దగ్గ ర్నుంచి వర్తమానం రావడంతో అతను వె ళ్ళాడు. వెళ్ళేప్పుడు 'వెళ్ళొస్తాను.. జాగ్రత్త! త్వరగానే వస్తాను' లాంటి యాంత్రిక వీడ్కోలు వచనాలు తప్ప మరేంలేదు.

రెండుమూడు రోజుల్లో తిరిగొస్తాడనుకు న్నాను. కానీ రాలేదు. ఒకరోజు తర్వాత ఇంకోరోజు గడవసాగాయి. ఎప్పుడొస్తాడో తెలీదు. ఎలాంటి సంకేతమూ లేదు. కనీసం మళ్ళీ వస్తానని భరోసా ఇచ్చే సందేశమూ లేదు. రోజులు వారాలుగా, వారాలు నెలలుగా మారుతున్నకొద్దీ నా మూగరోదన మరీమరీ ఎక్కువైంది. మొదట్లో వున్న నిరాశ, నిస్పృహ, అంతు లేని దుఃఖం రానురాను కోపంగా, తీవ్ర మైన ఆగ్రహంగా మారాయి. నన్నిలాంటి పరిస్థితిలో పడేయడానికి అతడికెంత ధైర్యం? ! నేను కనుబొమలు కదిలిస్తే చాలు ఈ పంజాబ్ రాష్ట్రంలో నాకోసం ప్రయత్నించని, నాకు పాదాక్రాంతం కాని మగవాడున్నాడా? తన ఇష్టమొచ్చినట్లు నన్ను ఆడించడానికి అతనికెన్ని గుండెలు? నచ్చినప్పుడు దగ్గరికి తీసుకుని అక్కర్లేనప్పుడు వదిలేస్తాడా? అతను నేను లేకుండా బతగ్గలిగితే, అతడు లేకుండా నేనూ వుండగలనని తెలియజేస్తాను. రోజంతా కోపోద్రేకాలతో ఇలాంటి ఆలో చన్లు చేశాను. కానీ రాత్రయ్యేసరికి మేమి ద్దరం కలిసి గడిపిన జ్ఞాపకాలు దాడిచేసి నిద్ర లేకుండా చేశాయి. అతని సాన్ని హిత్యం కోసం తపించిపోయాను. దిండులో తల దూర్చేసి మౌనంగా రోది స్తుంటే దిగులు, మనోవేదన కన్నీళ్ళ రూపంలో ప్రవహించాయి.

మొదట్లో బైరో అత్త ఇంటికెళ్ళి "మీర్జా గురించి ఏమైనా తెలిసిందా? నా కోసం

కబురేమైనా పంపాడా? " అనడిగేదాన్ని.

కానీ నా ప్రశ్నలకి అత్త తల అడ్డంగా వూపడమే సమాధానమయ్యేది. దాంతో ఆశకు కళ్ళెం వేయడం నేర్చుకున్నాను. తరచూ ఆవిడ దగ్గరికి వెళ్ళడం మానే శాను. ఒకవేళ వెళ్ళినా మీర్జా గురించి అడ గడం మానేశాను. ఏమైనా సమాధానం దొరుకుతుందేమోనని కేవలం తన కళ్ళ ల్లోకి చూసేదాన్ని. చివరికి వెళ్ళడం పూర్తిగా మానుకున్నాను. ఒకవేళ ఏదైనా వార్తో, సందేశమో వుంటే తనే నాకు కబు రు చేస్తుందిలెమ్మనుకున్నాను. అత్త అబద్ధం చెప్తుంది, నమ్మకద్రోహం చేస్తుంది లాంటి సందేహం నాకు లేదు.

ఓ రాత్రి అతని గురించి ఎంత తపించా నంటే, కోరికను అదుపు చేసుకోలేకపో యాను. దాంతో నా కలలు, కోరికల్ని బల వంతంగా మరోసారి తాహిర్‌మీదికి మళ్ళిం చుకున్నాను. మీర్జాని గురించిన ఆర్తికి విరుగుడు తాహిర్ అనిపించింది.

అలా అనుకున్నాక 'పౌర్ణమి రోజు రాత్రి హీర్ తోట దగ్గర నన్ను కలవమని' తాహి ర్‌కి రహస్యంగా కబురు చేశాను. ఆ పున్న మిరాత్రి నేనక్కడికి వెళ్ళేసరికి అతను నా కోసం నిరీక్షిస్తున్నాడు. దగ్గర్లోనే అతని గుర్రం గడ్డి మేస్తోంది.

"వచ్చావన్నమాట" అన్నాను.

"సాహిబా పిలిచాక రాకపోతే అతను మగాడే కాదు" అని తాహిర్ నా భుజాల చుట్టూ చేతులేసి దగ్గరకు తీసుకున్నాడు. నా గడ్డం కింద చెయ్యేసి తలను పైకెత్తి మొరటుగా తన పెదాలను నా పెదాలమీ దికి తెచ్చాడు. పైపై ముద్దుల తర్వాత అధరాలను గట్టిగా చుంబించాడు. నొప్పికి తట్టుకోలేక అతన్ని తోసేయడానికి ప్రయ త్నించాను. కానీ, అతను మరింత గట్టిగా దగ్గరికి లాక్కున్నాడు. ప్రేమ మాటలు, చేష్టలతో తనమీద నమ్మకం కలిగేట్టు చేసుకోకుండానే ఓ పశువులా నా దుస్తుల్ని లాగేసి ఆక్రమించేసుకున్నాడు. నొప్పికి తాళలేకపోయాను. తన చేతుల్లోంచి తప్పించుకోవాలనుకున్నాను. కానీ అతను నన్ను గట్టిగా ఒడిసిపట్టుకున్నందున వీల్లేక పోయింది.

తాహిర్ ఎగశ్వాసతో నా కళ్ళల్లోకే చూస్తూ "నీకు తెలీదు నా గొప్పతనం గురించి. పెళ్ళి తర్వాతే అనేకంటే.. పెళ్ళి కి ముందే దీనికి నువ్వు అలవాటుపడ్డం మేలు" అన్నాడు.

కోరిక తీరగానే వెంటనే లేచి దుస్తులు సరిచేసుకుని "మళ్ళీ కబురుచేయి.. ఇకపై నీకు తరచూ నేను కావాలనిపిస్తుంది" అంటూ నన్నొదిలేసి గుర్రమెక్కి వెళ్ళిపో యాడు. ఏం కోరుకున్నాను? ఏం జరి గింది? అని దుఃఖిస్తూ నిస్సహాయంగా కన్నీళ్ళు కారుస్తూ చాలాసేపు అలాగే వుండిపోయాను.

చీకట్లోంచి దొంగలా, దోషిలా ఇల్లు చేరాను. ముందు బాధపడినా తర్వాత జరిగిందానికి సంతోషించాను. ఇప్పుడు నాకర్థమైంది, మీర్జా ప్రేమ మహా ధార లాంటిది. తపించే మనసును గొప్పగా సంతృప్తిపరుస్తాడు. మీర్జాను భర్తీ చేసే మరో వ్యక్తి నాకెన్నడూ ఎదురవలేదు. ఈ సంఘటనతో తాహిర్ చుట్టూ నేనల్లుకున్న కలలన్నీ పటాపంచలైపోయి అతన్ని పెళ్ళా డాలనే కోరిక అంతరించింది.

ఇది జరిగిన మరుసటిరోజు బైరో అత్త ఇంటికెళ్ళాను. ఎవరూ లేకుండా ఆవిడ ఒంటరిగా వున్న సమయం చూసి తన కాళ్ళమీద పడి "నాకు సాయం చేయత్తా! మీర్జాని కలిసేలా చూడు" అన్నాను.

ఆవిడ ఒంగి నన్ను లేపి నా తలను తన భుజమ్మీద పెట్టుకుంది. నేను గుండె పగిలేలా ఏడుస్తుంటే.. తల నిమురుతూ "హుష్! ఏడవకు తల్లీ! వాడికి కబురు చే స్తా, బాధపడకు" అంటూ ఓదార్చింది.

నేను తల అడ్డంగా ఊపుతూ "లేదత్తా,

అది చాలదు.. అంతకంటే ఎక్కువే చేయాలి. నాకు తెలిసిందల్లా ఒక్కటే.. ఇంకో నాలుగురోజుల్లో మీర్జా గనుక ఇక్కడుండకపోతే నేనే అక్కడికెళ్తాను" అన్నాను. నీడలు తేల్తూన్న మసకవెల్తురులో అత్త కళ్ళల్లో భయం తొంగిచూసింది.

ఆవిడ నా కళ్ళల్లోకి చూస్తూ "చిట్టితల్లీ! అల్లా నిన్ను రక్షించుగాక!" అంటుంటే ఆమె స్వరమెంతో మెత్తగా, మృదువుగా వుంది. ఓ క్షణమాగి "ఇది చాలా తప్పుపని కాదూ? " అంది మళ్ళీ.

"నా హృదయంలో రగుల్తున్న బాధను చెప్పడానికి నా దగ్గర మాటల్లేవు. ఒక్కటే చెప్పగలను అత్తా! మీర్జా గనుక వెంటనే రాకపోతే చచ్చిపోతాను" అన్నాను.

"ఇలాంటి చెత్తమాటలు మాట్లాడకు. ఏం చేస్తే బాగుంటుందో, ఎలా చేయాలో నేనాలోచిస్తాను. నువ్వు చెప్పిన సమయానికల్లా వస్తాడని నేను హామీ ఇస్తాను. అంతా మంచే జరుగుతుంది, దిగులు పడకు" అంది అత్త నా కళ్ళలోకి చూస్తూ.

తన చూపులో, మాటలో గొప్ప నిజాయితీ కనిపించింది. ఆ నాలుగురోజులు ముగిసేలోపల నా మీర్జా వస్తాడని నా నమ్మకం. ఇంత కచ్చితమైన నమ్మకం వున్నప్పటికీ కాలం ఎంతో బరువుగా సాగుతోంది. వర్తమానం నత్తలా నెమ్మదిగా గతంలోకి జారుతోంది. గంట గడిస్తే రోజైనట్లుగా వుంది. ఇక ఏ రోజుకారోజు కాలం ఇక్కడే ఆగిపోతుందేమో అన్నట్లుంది. సూర్యుడు కూడా నా మీద కక్ష కట్టినట్లు ఆకాశంలో ఒకచోట ఆగిపోయి కదలడానికి తెగ మొరాయిస్తున్నాడు. ఎట్టకేలకి పశ్చిమానికి చేరాడంటే అక్కడ మరీ బిగుసుకుపోయి వెళ్ళడానికి నిరాకరిస్తున్నాడు. ఇక రాత్రి గడవనే గడవక నరకప్రాయంగా వుంటుంది. ఈ వరసన అస్థిమితంగా, ఆందోళనగా కాలం దొర్లుతుంటే ఆ మంచిరోజు కోసం ఎంతో ఓపిగ్గా ఎదురు చూశాను. ఎదురుచూపులు ఎప్పటికో సుదీర్ఘకాలానికి ఫలించి తొలి కిరణాలు తొంగిచూశాయి. ఆ వేళ జీవితంలో అందాకా ఎన్నడూ చూడనంత ఆశని మోసుకొచ్చాడు భానుడు. అప్పుడుగానీ భయంకరమైన ఆ అనిశ్చితి నన్నొదల్లేదు. ఇంత జరిగినా, అతను నావాడేనని కచ్చితంగా తెలిసినా, నన్ను వెంటాడి వేధిస్తున్న జ్ఞాపకాలని ఇంకా వదిలేయడానికి ధైర్యం చేయలేదు.. ఏదో భయంతోనో, సమయం సందర్భం కలిసిరాకో, అంత అవసరం లేదు లెమ్మనో. కొన్నిసార్లు మేం కలిసుండకపోవచ్చు. కానీ అలాంటప్పుడు ఒక్కసారి కూడా అతను మళ్ళీ రాడేమోనని లేశమాత్రం అపనమ్మకం కలగలేదు. ఒకవేళ మీర్జా రాకపోతే నేనే వెళ్తానని నాకు తెలుసు. ఈసారి ఈ దుర్భర నిరీక్షణవల్ల నేనేమైనా అపరాధం చేశానేమో నన్న భావన కలిగి అదో కట్టడంలా పెరిగింది. మొత్తానికి నాలుగోరోజు ఇదంతా ముగిసింది. చీకట్లు అలముకోవడంతో నా నెచ్చెలులు నదిలో ఆటలకు స్వస్తిచెప్పి ఇళ్ళకు వెళ్ళేందుకు సిద్ధమయ్యారు.

"వెళ్ళే సమయమైంది, రా సాహిబా!" అని పిల్చారు.

"ఇంకొద్ది సేపాగండి" అని ప్రాధేయపడ్డాను. ఎదురుతెన్నులు చూసిన నాలుగో రోజు కూడా వృథాగా అలా వచ్చివెళ్ళిపో

## కొత్తగాలి...

**కంటికి రెప్ప**
**దూరం కావచ్చు**
**చెవికి మొబైల్**
**దూరం కానేకాదు!**

– ఆర్.ఎస్. హైమవతి,
చెన్నై

డాన్ని భరించలేకపోయాను. కానీ నా మీర్జా రానేలేదు. చెప్పలేనంత నిరాశ కలిగింది. కానీ అంతలోనే నన్ను నేను ఓదార్చుకున్నాను. నాలుగోరోజు ఇంకా పూర్తికాలేదుకదా. సూర్యుడు దొంగలా పశ్చిమానికి చేరినా, ఇంకా ఆఖరి సూర్యకిరణాలు కాంతులీనుతూనే ఉన్నాయనే ఆశతో మీర్జాకోసం రహస్యంగా, ఆందోళనగా చూడ్డాన్ని నా నెచ్చెలులు గమనించి మార్చి మార్చి చూశారు. ఇంతలో దూరంగా గుర్రం డెక్కల చప్పుడు వినిపించింది. మీర్జా వచ్చాడు.

ఒక్కుదుటున అటువైపు గెంతాలనుకున్నాను. కానీ ఆ గుర్రపు డెక్కల చప్పుడు ఇంకా బిగ్గరగా నా చెవుల్లో ప్రతిధ్వనించేదాకా ఆగాను. నా గుండె అలా ఆగిపోయింది. చిరకాల కోరికను నా అతిశయం, అహంకారం అధిగమించాయి. అతనికెంత ధైర్యం? నన్నిలాంటి స్థితికి తేవడానికి? ఇలా అనంతంగా నిరీక్షింపచేయడానికి, తనను చూడాలనిపిస్తోందని దేబిరించేలా చేయడానికి అతనికెంత ధైర్యం? చెట్టు కింద అలా కూలబడిపోయాను.

గుర్రం మీదొచ్చిన మీర్జాను చూడగానే నా స్నేహితులు "సాహిబా! అతనొచ్చాడు" అంటూ ఆత్రుతతో పిల్చారు.

అతను గుర్రంమీంచి కిందికి దూకడం చూడగానే నా గొంతులో ఏదో అడ్డుపడ్డట్టయింది. ఎప్పట్నించో అణచుకున్న దుఃఖంతో కన్నీళ్ళొచ్చాయి. వెక్కిళ్ళతో శరీరం కంపించింది. నేలమీద కూలబడి రెండు కాళ్ళ మధ్యా ముఖం దాచుకుని రోదించాను.

మీర్జా నా పాదాలదగ్గర చేరి "నేనొచ్చాను సాహిబా!" అంటూ నా భుజాల చుట్టూ చేతులేసి నన్ను దగ్గరకు తీసుకున్నాడు. నా గుండె ఎదురుగా తన గుండె లయ అనుభవానికొచ్చింది. అయినా నేనతన్ని పలకరించలేదు.

"క్షమించు సాహిబా! ఇది నీకెంత బాధ కలిగించిందో నాకు తెలుసు. అయినా రావడం సాధ్యం కాలేదు" అన్నాడు.

అతన్నించి నన్ను నేను లాక్కుని బయటపడి "కనీసం కబురైనా చేయలేదు" అన్నాను తన కళ్ళల్లోకి చూస్తూ.

"ఈ మాటెలా అంటున్నావు? వారం వారం సందేశాలు పంపాను. ఒక్కోసారి వారానికి రెండు పంపాను" అన్నాడు.

"అబద్ధం.. నీనుంచి నాకెలాంటి కబురూ అందలేదు" అన్నాను.

"రా..!" అంటూ నా చేయి పట్టుకుని ఒక్కలాగు లాగి తన గుర్రం వైపు ఈడ్చుకెళ్ళాడు. అంతే బలంగా లాగి గుర్రంమీద కూర్చోబెట్టి వెనుక తను కూర్చుని, అత్త ఇంటివైపుకి దౌడు తీయించాడు. ఇల్లు రాగానే నా చేతిని అలాగే బిగించి పట్టుకుని ఆవిడ ముందుకు తోశాడు. మీర్జా తీరు చాలా బాధించింది.

"ఈమెకి చెప్పు పిన్నీ! ఇన్ని నెలల కాలంలో.. నేనెన్నిసార్లు కబురు చేశానో, సందేశాలు పంపానో ఈమెకి చెప్పు" అన్నాడు గదమాయిస్తున్నట్లుగా.

అత్త ఇద్దరి వంకా చూసింది. ఆవిడ కళ్ళల్లో భయం, తప్పు చేసిన భావం స్పష్టంగా కనిపించాయి. దాంతో మీర్జా నిజమే చెప్తున్నాడని, తనే వాటిని అందించలేదని నాకు అర్థమైపోయింది. అత్త ఓ చిన్న ఎత్తుపీట మీద కూర్చుంది. అతనలా అన్నాక ఆవిడ మళ్ళీ కన్నెత్తి చూళ్ళేదు. నేనలాగే నిలబడి మీర్జాని, అత్తని మార్చి మార్చి చూశాను.

"ఎందుకత్తా! ఎందుకిలా చేశావు? దీని వల్ల నేను దాదాపుగా చచ్చిపోయానని, నాలో బతకాలనే ఆశే నశించిందని నీకు తెలీదా? రోజుకు కనీసం డజనుసార్లు జీవచ్ఛవాన్నే అయ్యాను తెలుసా? " అన్నాను.

అత్త నన్ను తనవైపు తిప్పుకోవడంతో ఆవిడ కళ్ళల్లో కళ్ళుపెట్టి చూట్టమైంది.

"లేదు తల్లీ! నాకు తెలీదు. మీది

## అక్షరం

పిల్లలు చెప్పేది గనుక వినగల్గితే
వాళ్ళకు తమగురించి
ఎంత బాగా తెలుసో మనకర్థమౌతుంది.

– రాబర్ట్ బ్రాల్ట్,
ప్రముఖ సంగీత కళాకారుడు



కేవలం శారీరక వాంఛేనని, అదే కొనసాగితే భవిష్యత్తులో అసంతృప్తికి లోనవుతారని, గాలి అందకపోతే దీపం కొడిగట్టినట్టవుతుందని అనుకున్నాను. తాహిర్, మీర్జాల మధ్య చాలా వ్యత్యాసం వుంది. మీర్జాతో నీ సంబంధం కారణంగా తాహిర్ కుటుంబం, మీ కుటుంబాల మధ్య పగా ప్రతీకారాలు పెరుగుతాయని భయపడి అతని ఉత్తరాలు నీకు అందకుండా చేశాను. నిజమే, మీర్జా చాలానే రాశాడు. మీ ప్రేమలోతు తెలీకనే వాటన్నిటినీ దాచేశాను" అంది అత్త.

క్షణమాగి నిట్టూర్చి "ఆ తప్పును సరిదిద్దుకుంటాను. నీ బాధ అంతటికీ కారణం నేనే కనుక మీ ఇంటికొచ్చి మీర్జాతో నీ పెళ్ళి జరపమని మీ నాన్నని అర్థిస్తాను" అంది అత్తయ్య. అలా చాలా సేపు ఆవిడ మమ్మల్ని ఓదార్చింది, శాంతపర్చింది.

ముగ్గురం కలిసి మా ఇంట్లో అడుగుపెట్టేసరికి మహా నిశ్శబ్దంగా వుంది. మీర్జా నా చేతిని పట్టుకోవడం చూసిన షామీరన్నయ్య కళ్ళల్లో కోపం చిందింది. నాన్న కూడా అసహనంగా చూశారతని వంక.

"రా! చెల్లెమ్మా, కుశలమే కదా?" అన్నారు నాన్న, బైరో అత్తను పలకరిస్తూ.

"లేదు, అంతా బాగాలేదు కనుకనే ఇలా వేళగాని వేళ వచ్చాను" అంది అత్త.

"రారా..! వచ్చి కూర్చో నీకొచ్చిన కష్టమేంటో చెప్పు" అని నాన్న అనగానే అత్త వెళ్ళి నాన్న పక్కనే మడతమంచమ్మీద కూర్చుని "సాహిబాను మీర్జా చేతిలో పెట్టమని అడగడానికొచ్చాను" అంది.

దాంతో అందరూ ఒక్కసారిగా మా వంక చూశారు. నేను చూపులు వాల్చేశాను. మీర్జానుండి మృదువుగా చేతులు విడిపించుకున్నాను.

అత్తయ్య మాటలు విన్న షామీర్ గాఢంగా నిట్టూర్చాడు, ఏం మాట్లాడలేదు.

"నువ్వేమడిగావో నీకు తెలీదు. సాహిబాకి తాహిర్‌తో సంబంధం నిశ్చయమైందని, వాళ్ళ కుటుంబీకులు త్వరగా పెళ్ళి చేయమని వత్తిడి చేస్తున్నారని మర్చిపోయావా?" అనడిగాడు నాన్న అత్తతో. ఆయన స్వరం కఠినంగా లేదు. మార్దవంగా, సున్నితంగానే వుంది.

"లేదు, మర్చిపోలేదు" అంది అత్త.

"మరి ఇలా ఎందుకాలోచించావు? తాహిర్‌ను వదులుకోడానికి మీర్జా ఏం మెరుగైనవాడని?" అన్నారు నాన్న.

చివరికి షామీరన్నయ్య నిగ్రహం కోల్పోయి "వాడి వంక చూడు.. ఉత్త పనికిమాలినవాడు. జీవితంలో ఒక్కరోజు కూడా నిజాయితీగా లేడు. ఎంతసేపూ గుర్రంమీద దౌడు, విలువిద్య, కుస్తీపోటీలు, అమ్మాయిల చుట్టూ తిరగడాలతో కాలాన్నంతా వృథా చేయడమే. తాహిర్ కంటే పదిరెట్లు మేలైనవాడు. తాహిర్ కుటుంబం వీడి కుటుంబం కంటే వందరెట్లు అధికమైంది" అంటున్న తన స్వరంలో ఎంత విషం కనిపించిందంటే, మీర్జా మీద దాడిచేసి కొడతాడేమోనన్పించింది. అందాకా మీర్జా ఛాతి మీద వాలినట్లుగా నిలబడ్డ నేను వెనకడుగు వేశాను.

నాన్న "ఆగు బాబూ!" అని అన్నయ్యని

## కొత్తగాలి...

**మాట తీరు**
**పటిక బెల్లం!**
**పని తీరు**
**పక్కలో బల్లెం!**

– *అమ్మిన వెంకటఅమ్మిరాజు,*
పేరూరు, ఖమ్మం జిల్లా

ఆపి "మీర్జా మన అతిథి. ఎప్పుడూ అతిథుల్ని అవమానించరాదు. అతన్ని క్షమించు. మీర్జా అంటే అదుపు, నిగ్రహం లేనివాడు కనుక అతనేం మాట్లాడ్తాడో అతనికి తెలీదు. కానీ, నువ్వు మాత్రం శాంతంగా వుండు. లేదంటే ఇంట్లోకి వెళ్లు. ఇది నాకు, అత్తకు సంబంధించిన విషయం. ఈ సంగతి మాకొదిలేయ్, మేం పరిష్కరిస్తాం" అన్నారాయన.

షామీర్‌ను అలా తీసిపడేసినట్లు చేయడం అవమానకరంగా అనిపించింది. సుదీర్ఘకాలంపాటు నాన్న నీడలో, ఆయన రెక్కల చాటున పెరిగిన అన్నయ్య నాన్న ముందు నిలబడి మాట్లాడ్తోంది ఈ మధ్యనే కనుక నోరు మెదపలేదు.

"షామీర్ చెప్తున్నది నిజమే. పరిస్థితులన్నీ సవ్యంగా వుంటే సాహిబాకి మీర్జా కంటే తాహిరే మెరుగ్గైనవాడు. కానీ ఇప్పుడు పరిస్థితి అలా లేదు. మీర్జా, సాహిబాలిద్దరూ ఒకర్నొకరు విడిచివుండలేనంతగా ప్రేమించుకుంటున్నారు. పరస్పరం కలిసుంటేనే సంతోషంగా, సంతృప్తిగా వుంటారు. దీన్ని ఉపేక్షించలేం. వీళ్ళ ప్రేమ ముందు తాహిర్ కుటుంబంతో వచ్చే శత్రుత్వానికి మూల్యం చెల్లించడం చాలా చిన్న విషయం అనిపిస్తోంది అన్నయ్యా" అంది అత్త.

అత్త మాటలతో కాసేపు నిశ్శబ్దం ఆవరించింది. ఆవిడ మాటలతో నాన్న లొంగిపోలేదుకానీ కొంచెం మెత్తబడినట్లుగా వున్నారు. దాన్ని అవకాశంగా తీసుకున్న అత్త ఈ విషయాన్ని ఇంకాస్త నొక్కి చెప్పడానికి ప్రయత్నిస్తూ "మీర్జా సాహిబాకి వరసైనవాడు. నీకు తెలీందేముంది? పిల్లని పెళ్ళాట్టానికి వాడికి ఎక్కువ హక్కు వుంటుంది కదా? " అంది.

"అవును! నాకు తెలుసు. కానీ తాహిర్ తండ్రితో పెళ్ళి సంప్రదింపులు జరుపుతున్నప్పుడు ఈ హక్కు గురించి ఎందుకు మాట్లాడలేదు? నా సోదరి, మీర్జా తల్లి నాసిబో నా ముందుకు ఎందుకు రాలేదు? సాహిబా నిశ్చితార్థ వేడుకలో నాసిబో పాలుపంచుకోడమే కాకుండా అమ్మాయికి పట్టుచీర, ఉంగరమూ బహూకరించి, దీవించిన సంగతి నీకు తెలుసు కదా!" అన్నారు నాన్న.

"ఇతనింత అందమైన, చక్కనైన వాడిగా ఎదుగుతాడని అప్పుడు మేం ఊహించలేదు. సౌందర్యరాశి సాహిబాకి ఇది తగిన సంబంధం" అన్న అత్త మాటలను అంగీకరించినట్లుగా ముంగిట్లో వున్న అందరూ మౌనం వహించారు.

ఆవిడ తిరిగి అందుకుని "నేనడిగింది కష్టమని నాకు తెలుసు. సాహిబా నిశ్చితార్థాన్ని చెడగొట్టడంవల్ల వచ్చే పర్యవసానాలూ తెలుసు. అది మనకు ఎంత అగౌరవమో, అపకీర్తి తెచ్చిపెడ్తుందో, మన కుటుంబాల మధ్య తరతరాలకీ ఎంతటి వైషమ్యాన్ని నింపుతుందో ఊహించగలను. ఇదంతా తెలుసు కనుకనే వీళ్ళిద్దర్నీ దూరంపెట్టడానికి నేనెంతో ప్రయత్నించాను. షామీర్ గూడుపుఠాణీలో నాకూ భాగముంది. బింజాల్ సాయంతో మీర్జాని దనాబాద్ వెళ్ళేలా చేశాను. అతని ఉత్తరాలు సాహిబాకి అందకుండా చేశాను. కానీ ఇప్పుడు తెలిసింది.. నేను, షామీర్, బింజాల్.. మేమంతా చేసింది తప్పని.

దేవుడు కలిపిన ఇద్దరు ప్రేమికుల్ని విడదీయడం కంటే మహా పాపం లోకంలో ఇంకోటి లేదు" అని తలొంచుకుని చొక్కా అంచును సరిచేసుకుంటూ సోదరుడి దగ్గర నిలబడి "ఖీవాఖాన్! నీముందు నేనో బిచ్చగత్తెలా నిలబడ్డాను. నువ్వు నా అన్నవి. ఎలాంటి కల్మషాలూ, రహస్యాలూ లేని ప్రేమబంధం మనది. ఒకరి ఇష్టాల్ని, కోరికల్ని ఇంకొకరం తీర్చడానికి సిద్ధంగా వుండేవాళ్ళం. ఇప్పటికీ ఆ ప్రేమాభిమానాలు అలాగే వున్నాయని నమ్ముతున్నాను. కనుకనే మీర్జాకి సాహిబాని ఇవ్వమని అడుగుతున్నాను" అని వంగి నాన్న పాదాలను తాకి ఏడ్చింది అత్త.

"లేమ్మా, లే! నువ్వు ఏడ్వాల్సిన, యాచించాల్సిన అవసరం లేదు. సాహిబా అంటే నాకెంత ఇష్టమంటే, ఆమెని సంతోషపెట్టడానికి ఏమైనా చేస్తాను. కానీ సాహిబాను ఇవ్వమనే అభ్యర్థన నీ నుంచి కాదు, మీర్జా తల్లిదండ్రుల దగ్గర్నుంచి రావాలి. వచ్చే పౌర్ణమిలోగా ఆ పని జరిగితే తాహిర్‌తో జరిగిన నిశ్చితార్థాన్ని రద్దు చేస్తానని నీకు మాటిస్తున్నాను. వచ్చే పర్యవసానాలు ఎలాంటివైనా సరే లెక్కచేయకుండా మీర్జాతో పెళ్ళి జరిపిస్తాను. కానీ వారి నుంచి అభ్యర్థన రాకపోతే మాత్రం వారంలోపే తాహిర్‌తో సాహిబా పెళ్ళి జరుగుతుంది. ముందు నువ్వు కళ్ళు తుడుచుకోమ్మా" అని మీర్జా వంక తిరిగి "అవును మీర్జా! నువ్వెందుకు కొత్తవాడిలా నిలబడే వున్నావు? రా, బిడ్డా! వచ్చి నా పక్కన కూర్చో" అన్నారాయన.

మీర్జా వంక చూశాను. అతను కూడా ప్రేమ వర్షిస్తున్న కళ్ళతో చూసి, నాన్న పక్కన కూర్చోడానికి వెళ్ళాడు.

నేను సిగ్గుపడుతూ ఇంట్లోకి దూరాను.

మర్నాడు ఉదయాన మీర్జా వెళ్తుంటే నేను చూశాను. మా నాన్న చెప్పింది కేవలం మొక్కుబడి వ్యవహారం, అది సునాయాసంగా తీరుతుంది అన్నట్టుగా తేలికపడ్డ హృదయంతో కనిపించాడు. నేనందుకోసం నిరీక్షిస్తున్నాను. మరోసారి ఒక్కో పగలూ ఒక్కో రాత్రీ బరువుగా కదలసాగాయి. రాత్రివేళ చంద్రుణ్ణే తదేకంగా చూడసాగాను- బింబం ఒకింత పెరిగిందా, పౌర్ణమి దగ్గరపడిందా అనే భయంతో. మీర్జా ఎలాగైనా తండ్రిని ఒప్పిస్తాడని నా బలమైన నమ్మకం. కనుక ఆందోళన చెందనక్కర్లేదనుకున్నాను. చివరికి వెన్నెలను చిందిస్తూ పున్నమి రానే వచ్చింది. నా నమ్మకం వమ్ము కావడాన్ని ఒప్పుకోక తప్పలేదు. తల్లిదండ్రుల్ని ఒప్పించడంలో మీర్జా ఓడిపోయాడంటే విశ్వసించలేను. అతనికేదో భయంకరమైన సంఘటన ఎదురై ఉంటుంది. లేకుంటే ఇలా జరగదనుకున్నాను. దిగులుతో అనారోగ్యం ఆవరించింది. మరోసారి బైరో అత్త ఇంటికెళ్ళాను. ఆవిడ తన గదిలో మంచమ్మీద గోడవైపు తిరిగి పడుకుని వుంది. ఆవిణ్ణెప్పుడూ అలా చూళ్ళేదు. దాంతో అందాకా నా గురించి, నా ప్రేమ గురించి వున్న ఆందోళన స్థానంలో అత్త గురించిన చింత చోటుచేసుకుంది.

"అత్తా! ఒంట్లో బాగాలేదా? " అడిగాను.

అత్త చప్పున లేచి చేతులు చాచి న న్ను కౌగిలించుకుని కన్నీళ్ళు పెట్టుకుంది.

"ప్చ్. బంగారుతల్లీ! నీ ప్రేమ ఘోరంగా విచ్ఛిన్నమైంది. మా చెల్లెలు ఉత్తరం రాసి, ప్రత్యేక దూతతో పంపింది. మీర్జాతో నీ పెళ్ళి జరగదని ఆమె రాసింది. నిశ్చితార్థం కనుక రద్దయితే వచ్చే అనర్థాల గురించి భయపడ్తోంది. నాసిర్‌ఖాన్‌ది గర్విష్టి కుటుంబం కనుక జరిగిన అవమానాన్ని తేలిగ్గా తీసుకోరు, భయంకరంగా ప్రతిఘటిస్తారు. దానివల్ల తన అన్న, ఆయన కొడుకులు సమాధిపాలయ్యే ఆపద వస్తుందని వెరుస్తోంది. వాళ్ళ రక్తాన్ని చూట్టం ఆమె భరించలేదు. తనిలా చేస్తోందంటే

అది మీర్జా మాటను కాదనడం కాదు. వాడే తన సర్వస్వం..!"

అత్త మాటలకు ఎలా ప్రతిస్పందించాలో అర్థంకాలేదు.

ఓ క్షణమాగి ఆమె మళ్లీ "ఇక మనం చేయగలిగిందేమీ లేదు సాహిబా. చేయగలిగిందంతా చేశాం. విధి నీ కోసం దేన్ని నిర్ణయించిందో దాన్ని సమ్మతించాలి. మీర్జాని మర్చిపోయి తాహిర్‌ని అంగీకరించి జీవితాన్ని సార్థకం చేసుకో" అంది.

"నా జీవితం ఎలా వుండాలో నిర్దేశించేది విధి కాదు, మీర్జా. ఒకవేళ అతను తన



తల్లిదండ్రులకు తల వంచాలనుకుంటే, నేను కూడా వాళ్ళకు తల వంచుతాను" అన్నాను.

ఎప్పుడూ లేని విధంగా నా అంతరంగం మూగబోయింది. కోపం లేదు, బాధ లేదు. మాటలకందని మౌనం. కాళ్ళకు పనిచెప్పి గదిలోంచి బయటికొచ్చాను. కానీ ఇంటి ముంగిట సగం వరకూ నడిచొచ్చాక మళ్ళీ ఆగి వెనక్కెళ్ళి అత్త గది గుమ్మం దగ్గర నిలబడి "బైరో అత్తా! నువ్వు నిజమైన ఆప్తురాలివి. నా కోసం నువ్వెంత సాయం చేయగలవో అంతా చేశావు. అందుగ్గానూ నీకంతా మంచి జరగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. దేవుడు నిన్ను ఆశీర్వదించి నీకు తగిన బహుమానం ఇస్తాడు" అన్నాను.

అత్త మనసు మరోసారి బద్దలైంది.

కానీ నేను స్తబ్దుగానే వుండిపోయాను. ఆవిడ కన్నీళ్ళు కారుస్తున్నా, మౌనంగా వచ్చేశాను. నేనలా రావడాన్ని బైరో అత్త వాళ్ళ కుటుంబసభ్యులు చూసినా ఏమీ

మాట్లాడలేదు. మీర్జా తల్లినుంచి వచ్చిన కబురు వాళ్ళకి తెలిసే వుంటుంది. వాళ్ళు మౌనం వహించడానికి మించి మరేం చేయగలరు? వాళ్ళ పలకరింపులు కానీ, జాలి పలుకులు గానీ నాకక్కర్లేదు కూడా. అందుకే చరచరా అక్కణ్ణించి ఇంటికొచ్చేశాను. మరో వారం వరకూ వీధిముఖం కూడా చూళ్ళేదు.

మా నాన్న తన మాట నిలుపుకుంటూ తాహిర్ తండ్రికి కబురు చేశాడు. మరో వారంలో తాహిర్‌తో పెళ్ళి ఖరారైంది. రెండు కుటుంబాల్లోనూ ఘనంగా వేడుక చేసుకోడానికి ప్రణాళికలు సిద్ధమయ్యాయి. ఆ వారమంతా కూడా స్తబ్దత నన్ను వీడ లేదు. నేను మామూలుగానే తింటూ, పడుకుంటూ, పెళ్ళికి సంబంధించిన ప్రతి విషయంలో, నిర్ణయంలో జోక్యం చేసుకుంటున్నాను. ఇందువల్ల నిజం గ్రహించి, ముందున్న జీవితాన్నంతా తాహిర్ భార్యగా అతనితో గడిపే విధి నిర్ణయానికి కట్టుబడినట్లుగా కనిపిస్తోంది.

అనుకున్నరోజుకి పెళ్ళికొడుకు తరపు వారు వచ్చారు. ఊరి వీధులన్నీ సంగీతంతో హోరెత్తాయి. ఇంట్లో కోలాహలం గురించి చెప్పనవసరమే లేదు. తలపాగా ధరించిన గ్రామీణులు పెళ్ళి



కొడుకు, వారి బంధువర్గానికి ఆహ్వానం పలకడానికి వీధుల్లో పరుగులు తీశారు. ఇక ఆడవాళ్ళేమో ఈ వేడుకంతా చూడా లనే కుతూహలంతో డాబాలెక్కేశారు. నా కాబోయే భర్త ఎలా వున్నాడో చూట్టానికి నన్ను కూడా డాబామీదికి ఎక్కమని ఎవరో సలహా ఇచ్చారు. నేను తాహిర్‌ను చూట్టమే కాదు, అతని పొందు కూడా ల భించింది అని చెప్పేంత మనసు నాకు లేకపోయింది. జరిగిందాన్ని దాచిపెట్టడాని కైతేనేం, మరి దేనికైతేనేం మొత్తానికి రద్దీగా వున్న స్త్రీల గుంపులో నేను కూడా చేరిపోయాను. మెట్ల పొడవునా, డాబా మీదా కూడా కిక్కిరిసి వున్నారు. ఎవరికి వారే తాహిర్ అందం, దారుఢ్యాల గురించి మా ట్లాడ్తున్నారు.

తాహిర్ తలెత్తి మేడమీద గుమిగూడిన ఆడవాళ్ళకేసి చూశాడు. మా ఇద్దరి చూపులూ కలిశాయి. ఆ తృటికాలంలోనే అతని ముఖంలో నాకంతా తెలుసన్న తెలివి, ఒక నిర్లక్ష్యం లేదా అలసత్వంతో కూడిన నిశ్చలత స్పష్టంగా కనిపించాయి. దాం తో ఈ వారంరోజులుగా నాలో పేరు కున్న మంచులాంటి స్తబ్దత ఒక్కసారిగా కరిగిపోయింది. హృదయం బాధగా మూలిగింది. ఆ రాత్రి హీర్ సమాధి దగ్గర జరిగింది మళ్ళీ గుర్తొచ్చి గుచ్చు కుంది. ఈ జ్ఞాపకంతో నేనతని దగ్గరకు వెళ్ళకూడదని నాకు తెలుసు. తక్కిన జీవి తమంతా అతనితోనే గడపాలనే ఆలోచనే భరించశక్యం కాకుండా వుంది. అకస్మాత్తు గానే అయినా నిర్దుష్టమైన, సంపూర్ణమైన, స్పష్టమైన ఆలోచన వచ్చింది- చనిపోవడం ఉత్తమం ఏమోనని. ఆ క్షణంలో మీర్జాని చేరడానికి చివరి ప్రయత్నం చేయాలని, ఈ భయంకరమైన పరిస్థితి నుంచి నన్ను కాపాడమని కోరాలని నిర్ణయించుకు న్నాను. ఒకవేళ ఈ ప్రయత్నం విఫలమైతే ఆత్మహత్యే శరణ్యం.

అలా నిశ్చయించుకున్నాక ఒక్క క్షణాన్ని కూడా చేజారనివ్వలేదు. బైరో అత్తను ఒంటరిగా కలిసే అవకాశం కోసం నిరీక్షించాను. అదంత తేలిగ్గా సాధ్యపడ లేదు. ఇల్లంతా బంధుమిత్రులతో కిక్కిరిసి వుంది. ఎలాగోలా ఆ అవకాశం చిక్కగానే "ఈ పెళ్ళి చేసుకోను, చావనైనా చస్తాను! అత్తా! ఈ నాలుగు రాత్రులూ మగాళ్ళంతా విందూవినోదాలతో తాగి తూగుతారని తెల్సుగా.. దానికి బదులు వారి ప్రాణాలు కోల్పోయే పరిస్థితి వస్తుంది. ఇప్పట్నించి మూడో రాత్రికల్లా నన్నిక్కణ్ణించి తీసికెళ్ళే లా మీర్జాను రమ్మని కబురుచేయి. ఈ నిఖాను తప్పించకపోతే నన్ను కాదు, నా శవాన్నే చూస్తారని అతనికి చెప్పు" అన్నాను దృఢంగా, స్పష్టంగా.

నా స్వరంలో, ప్రవర్తన తీరులో నేనెంత పట్టుదలగా వున్నానో అత్తకు బాగానే అర్థ మైనట్లుంది, తనేం కాదనకుండా "సరే, కబురు చేస్తాను. భయపడకు సాహిబా! మీర్జా వచ్చి నిన్ను నిఖా నుంచి తప్పి స్తాడు" అంది.

మీర్జా నా కోసం వస్తాడన్న నమ్మకంతో తర్వాతి మూడ్రోజులూ నేను మౌనంగా, ప్రశాంతంగా వున్నాను. ఒకవేళ రాకపోతే ఏం చేయాలో నాకు బాగా తెలుసు. హీర్ సమాధి అంచున విషఫలాల పొద వుంది. ఆ పొదనిండా ఇప్పుడు బోల్డన్ని పండ్లు! అవి తిని ఆలస్యంగా ఇల్లు చేరితే సరి..! విరుగుడు కూడా వుండదు. ఇలా చేయాలని నిశ్చయించుకున్నాక మళ్ళీ నాలో బలం చేకూరినట్లయి, వేడుకల న్నిట్నీ శాంతచిత్తంతో ఎదుర్కోవడం సాధ్యమైంది.

మూడోరోజున షామీరన్నయ్యా భార్య గుల్బానో నా వైపు తిరిగి "మన సాహి బాని తగిన దుస్తులతో ముస్తాబు చేయాలి. రేపు తన పెళ్ళి పెట్టుకుని ఇవాళ ఎంత వెలిసిపోయిన పాతబడిన

**అ**
**క్ష**
**రం**

*పిల్లలు చక్కగా వింటే సరిపోదు*
*అప్పుడప్పుడైనా బాగా మాట్లాడ్డానికి ప్రయత్నించాలి.*

**– రాబర్ట్ బ్రాల్ట్,**
ప్రముఖ సంగీత కళాకారుడు



దుస్తుల్లో వుందో చూడండి!" అంది.

"అవున్నిజమే! నాకున్నవాటిల్లో మహా అందమైన దుస్తులు ధరించి, వెలిగిపోయే నగలతో సింగారించుకుంటా చూడండి" అంటూ చిర్నవ్వు నవ్వేను.

ఆ ఉదయమంతా నన్ను అందమైన దుస్తులతో, బరువైన నగలతో అలంకరించడంలో గడిచింది. అలా ముస్తాబు చేయడంలో, కురులను అందంగా తీర్చిదిద్దడంలో గుల్బానో వదిన గొప్ప ఆనందం పొందింది. ఆ పనంతా ప్రేమగా చేసింది. నా వల్ల తనకెంత ఇబ్బంది, బాధ కదా అనిపించింది. నేనెంత చేదును చవిచూస్తున్నానో కూడా గుల్బానో ఆలోచించింది. దాన్నంతా మరిపించాలనుకుంటోంది.

ఒకసారి లేచి నిలబడి తను అందాకా చేసిన ముస్తాబంతా ఎలా వుందాని ఆసాంతం చూసి తృప్తిపడింది. ఆనక తన కంటి కొలకులోంచి చిటికెన వేలి కొనతో సుర్మా తీసి, నుదుటి పక్కగా చిన్నగా దిష్టి చుక్క పెట్టి, "మన సాహిబా ఇవాళ చాలా అందంగా వుంది. హీర్ కూడా సిగ్గుపడేంత సౌందర్యం!" అంది.

హీర్ పేరు వినిపించగానే చీకటి రాబోతున్నదనే సూచనతో నా వెన్నులోంచి వణుకు పుట్టింది. ఆ పోలిక ఉద్దేశపూర్వకంగా చెప్పిందేమో అన్పించి వదిన కళ్ళలోకి చూశాను. కానీ అలాంటి ఈర్ష్యా విద్వేషాల నీడలస్సల్లేవు. నేను హీర్ అత్త అంత బాగున్నాననే ఆనందం, అందులోంచి వచ్చిన అతిశయాలతో కూడిన వెలుగుతో ఆవిడ కళ్ళు మెరుస్తున్నాయి. చనిపోయిన హీర్‌తో పోల్చడం అపశకునమనే ఆలోచన లేక కేవలం నా సౌందర్యాన్ని మెచ్చుకోవాలనే అభినందన మాత్రమే. కానీ రోజంతా సుఖం శాంతీ లేని వ్యాకులభావన నన్ను వెంటాడి వేధించింది. నేను కూడా హీర్ మాదిరిగా పెళ్ళికూతురి వేషంలో అలంకృతమై మృతదేహంగా మారతానా? అన్పించింది. దృఢ చిత్తంతో వెంటనే ఆ ఆలోచనను బయటకు నెట్టేశాను.

పెళ్ళికూతురి వేడుక నాటినుంచీ ఒక విధానం స్థిరపడింది. ఇవాళ కూడా ఆ పద్ధతే సాగుతోంది. సాయంకాలం అవుతుండగానే మగవాళ్ళంతా మంచి దుస్తులతో తయారై గుంపుగా బయల్దేరి పాత హవేలీ చేరారు. ఈ హవేలీలో ప్రస్తుతం ఎవరూ నివాసం వుండటం లేదు. కేవలం పెళ్ళిళ్ళు పేరంటాల్లాంటి ఉత్సవాలకు మాత్రమే ఉపయోగిస్తున్నారు. ఇప్పుడు హవేలీని బ్రహ్మాండంగా అలంకరించారు. వాకిట్లో అంతా తివాచీలు పరచి వాటిమీద మెత్తటి పరుపులు వేశారు. వాళ్ళంతా ఉల్లాసంగా దిళ్ళకు చేరబడి సురాపానం సేవిస్తూ ఆనందంలో తేలియాడుతున్నారు. ఆటగత్తెలతో కాలక్షేపం వాళ్ళ కళ్ళల్లో కాంతులు నింపుతోంది. లోలోపల దాగివున్న కోరికలు పురివిప్పి బయటికొచ్చాయి. ఆ ఆటగత్తెలు రెచ్చగొట్టే భంగిమలతో పురికొల్పుతుంటే బిగ్గరగా నవ్వుతూ తెగ ఆనందిస్తున్నారు.

ఈ దశలో పల్చటి తెరలు వేసిన వరండాల్లోంచి ఆనందిస్తున్న ఆడవాళ్ళు అక్క

ణ్ణించి లేచి ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఈ హంగామా ముగిసి రాత్రి కాగానే విందు భోజనాలు వడ్డించారు. తిన్నాక ఒక్కొక్కరూ ఎవరిదారిన వారెళ్తూ అందాకా విన్న హుషారైన పాటల్ని కూనిరాగం తీస్తూనేవున్నారు. కొంతసేపటికి దారెంట పాటలు ఆగిపోయాయి. అయితే ఆ నిశ్శబ్దం ఎంతోసేపు నిలవలేదు. కొందరు సాగిస్తున్న కామకేళికి సంకేతంగా ఆ ఆట గత్తెలతో చేరి మగవాళ్ళ మూలుగులు, అమ్మాయిల నవ్వులు వినిపిస్తున్నాయి. మరి కాసేపటికి ఆ శబ్దాలు కూడా హరించి గురకలు మాత్రమే వినిపిస్తు న్నాయి. సమయం గడిచిపోతోంది. రాత్రి కాపలాదారు రెండోసారి వచ్చిన గుర్తుగా వీధిలో చప్పుడు వినిపించింది.

చివరికి ఎంత సమయం గడిచిందో తెలీదు. మీర్జా రాడేమోనన్న నిరాశలో వున్నాను. ఇంతలో తలుపుమీద మృదు వుగా తట్టిన శబ్దం వినిపించింది. ఆ ధ్వని ఎంత మెల్లగా, మెత్తగా వుందంటే దాని కోసం నేను ఆలకిస్తూండకపోతే అది నా చెవులకు సోకేదే కాదు. లేచి నిలబడ్డాను. వెంటనే అప్రమత్తమై చేతి గాజుల్ని, కాలి అందెల్ని తీసి పక్కమీద పెట్టాను. చప్పున తలుపు దగ్గరికెళ్ళి అడ్డగెడను మెల్లగా తీసి తలుపు తెరిచాను.

మీర్జా గుమ్మంలో ఎదురుగా నిలబ డ్డాడు. దళసరి దుప్పటి కప్పుకుని వున్నాడు. ఒక్క క్షణంపాటు నన్ను గుండె లకు హత్తుకున్నాడు. ఆ వెంటనే వీధిలోకి తీసికెళ్ళాడు. ఇంతకాలంగా ఇక్కడే నివ సించి, బహుశా ఇకపై చూడనేమో అను కున్న ఇంటిని ప్రేమగా వెనుదిరిగి చూశాను. ఆ వెంటనే మీర్జా వెంట భైరో అత్త ఇంటివైపు వేగంగా నడిచాం.

సగం దూరం వెళ్ళేసరికి వీధిలో కాస్త దూరంగా తాగుబోతుల మాటలు విని పించి కాస్త ఆగాం. కానీ వెనుదిరిగే ప్రసక్తి లేదిప్పుడు. వేగంగానే అయినా చప్పుడు కాకుండా జాగ్రత్తగా ముందుకు నడిచేసరికి మరింత స్పష్టమైన, స్థిరమైన మాటలు వినిపించాయి. వాళ్ళిద్దరూ మా బాబాయి కొడుకులే.

వాళ్ళు మమ్మల్ని ఆపి “ఎవరది? ఇంత రాత్రివేళ వీధిలో ఎందుకు పోతున్నారు? ” అనడిగారు.

“నేను, సాహిబాని.. భైరో అత్త అర్జం టుగా రమ్మని కబురుచేసింది.. వెంటనే కలవాలి” అన్నాను ఎలాంటి సంశయం లేకుండా, ధైర్యంగా.

“వెంటనే రమ్మందా ఈ వేళప్పుడు? ఏదో జరుగుతోంది.. నీతోపాటు మేమూ వస్తాం పద” అని ముందుకు వెళ్ళాల్సిన వాళ్ళు మాతో రావడానికి సిద్ధమయ్యారు. దుప్పటి ముసుగులో వున్న మీర్జా బిగుసు కుపోవడాన్ని గ్రహించాను. నడుం దగ్గర దాచుకున్న బాకుకోసం గుడ్డివెల్తురులో అతని చేయి తడుముతోంది. అది చూడ గానే ఆ కత్తి వాడాల్సిన అవసరం అస్సలు రాకూడదని దేవుణ్ణి ప్రార్థించాను.

ఆందోళన నిండిన కంఠంతో “వద్దొద్దు! ఇప్పటికే చాలా పొద్దుపోయింది. మీ భార్యలు మీ కోసం ఎదురుచూస్తుంటారు. భైరో అత్తయ్యకు నేనంటే ఎంత ప్రేమో మీకు తెలుసా? ! బహుశా నాకెలాంటి జడ కుచ్చులు, నగలు బాగుంటాయో చెప్పడాని కయ్యుంటుంది. అర్థమైందా? కనుక భ యపడాల్సిందేమీ లేదు” అన్నాను.

వాళ్ళు నా మాట పట్టించుకోలేదు. ఇద్ద రిలో చిన్నవాడు కల్పించుకుని “అయినా సరే, ఇంత రాత్రివేళ నిన్ను ఒంటరిగా వెళ్ళనిచ్చే సాహసం చేయలేం” అన్నాడు.

“నేనేం ఒంటరిగా లేను” అన్నాను, నా పక్కన నిలబడ్డ మీర్జాని చూపిస్తూ.

“ఇతనెవరు? ” అని వాళ్ళడగ్గానే మీర్జా చేయి మరోసారి కత్తికోసం తడిమింది.

“ఇతనెవరంటే, భైరో అత్త నౌకరు

# మందు.. మాటలు!

జీవితంలో చాలా సమస్యలకి ఆల్కహాల్ పరిష్కారం అని ఆల్కహాల్ ప్రియులు చెప్తుంటారు. కానీ చాలా సమస్యలకి కారణం అదే. ఆల్కహాల్ గురించిన కొన్ని విశేషాలు.

★ ప్రపంచంలో ప్రతి పది క్షణాలకి ఒకర్ని చంపుతోంది ఆల్కహాల్!

★ ఆల్కహాల్ జీర్ణం కాదు. సరాసరి రక్తంలో కలిసిపోతుంది.

★ రక్తంలో కలిసిన ఆల్కహాల్ వల్ల మెదడు కణాలు స్పందించడానికి ఆరు నిమిషాలు పడుతుంది.

★ ప్రపంచంలో పదిహేనేళ్ళకన్నా ఎక్కువ వయసు ఉన్న వారిలో 48శాతం ఎన్నడూ ఆల్కహాల్‌ని రుచి చూడలేదు.

★ ఓ రష్యన్ సగటున ఏడాదికి 18 లీటర్ల ఆల్కహాల్ తాగుతారు!

★ నీలికళ్ళు గల వారికి ఆల్కహాల్ మత్తెక్కడానికి మిగతా వారికంటే ఎక్కువ సమయం పడుతుందని శాస్త్రజ్ఞులు చెప్తున్నారు.

★ అమెరికాలో 21 ఏళ్ల లోపువారికి ఆల్కహాల్ అమ్మకూడదనే నియమం ఉంది. అందువల్ల బార్లలో వైన్ షాపుల్లో కొనేవాళ్ళు తమ వయస్సు 21 అనే రుజువుని చూపించాలి.



★ యుకెలో ఐదు సంవత్సరాలు దాటిన పిల్లలు తమ ఇంట్లోకాని, మరేదైనా వ్యక్తిగత ప్రదేశంలో కాని ఆల్కహాల్ తాగచ్చు

★ ఆమ్‌స్టర్‌డామ్‌లో వీధులు ఊడ్చే ఆల్కహాలిక్స్‌కి జీతంగా రోజుకి 5 కేన్ల బీర్, ఓ పేకెట్ సిగరెట్లు, పది యూరోలు ఇస్తారు.

★ మద్యనిషేధ సమయంలో అమెరికా ప్రభుత్వం 1920-30లలో ఆల్కహాల్‌లో విషం కలపడంతో పదివేల మందికి పైగా మరణించారు!

★ గ్లాస్‌లో వంపు ఉంటే ఆల్కహాల్‌ని వేగంగా, వంపులేకుండా నిలువుగా ఉంటే నెమ్మదిగా తాగుతారని ఓ రీసెర్చ్‌లో తెలిసింది.

ముహ్మదా"

"ముహ్మదానా? ఇతను ముహ్మదాలాగా నడవడంలేదే? " పెద్దవాడు అన్నాడు.

ఓ క్షణం నా గుండె లయ తప్పింది. దొరికిపోయామనే అనుకున్నాను.

"రాత్రయ్యేసరికి ఎవరూ తమలా నడవరులే" అన్నాడు మీర్జా, తన గొంతు మార్చి స్పష్టత లేకుండా.

వెంటనే బదులివ్వలేదు. తర్వాత సోదరులిద్దరూ ఒకరివంక ఒకరు చూసుకుని పెద్దపెట్టున నవ్వేరు. పెద్దవాడు శబ్దం వచ్చేలా నవ్వుతూ "బాగుంది.. చాలా బాగుంది" అన్నాడు.

"సరే, మేమెళ్తాం. శుభరాత్రి చెల్లీ! ముహ్మదా నీక్కూడా శుభరాత్రి" అన్నాడు రెండోవాడు.

నేను "శుభరాత్రి" అన్నాను. మీర్జా గొణిగినట్టుగా వీడ్కోలు చెప్పాడు.

సోదరులిద్దరూ దాటి వెళ్ళేవరకూ మేము స్టులు వేగం పెంచలేదు. వాళ్ళు కొంత దూరం వెళ్ళాక ఆగి మమ్మల్ని గమనిస్తారేమోనన్పించి జాగ్రత్తపడ్డాం.

"ముహ్మదా కాదనిపిస్తోంది. అతనిలా నడవడు" అన్నాడు రెండోవాడు.

"రాత్రయ్యేసరికి ఎవరూ కూడా తమలా నడవరులే" అన్నాడు పెద్దవాడు మీర్జా మాటల్ని అనుకరించి. వాళ్ళు మళ్ళీ నవ్వేరు. కొంతసేపటికి వారి అలికిడి లేదు.

ఇక బైరో అత్త ఇల్లు చేరడానికి వేగం పెంచాం. మీర్జా నన్ను తలుపు దగ్గర వదిలి, తను ఇరుకు సందులో చీకట్లోకి వెళ్ళాడు. తన గుర్రాన్ని తీసుకుని త్వరగానే వచ్చాడు. గుర్రం పక్కనే నడుస్తూ ఊరు దాటాం. అదెంత మృదువుగా, మెల్లగా అడుగులేసిందంటే దానికేమైనా దివ్యదృష్టి వుండి, విషయమంతా గ్రహించిందేమో అనిపించింది. సజావుగా ఊరు దాటిన తర్వాత మీర్జా నన్ను ఎత్తి గుర్రమ్మీద కూర్చోబెట్టి, తను కూడా ఎక్కాడు. అంతే, అశ్వరాజం కదిలింది. కొన్ని నిమిషాలు గడిచేసరికి మీర్జా దాన్ని శరవేగంగా దౌడు తీయించాడు. మీర్జా అశ్వారోహణలో గొప్ప సమర్థుడు, షహజాదీని ఎంతో నేర్పుతో నడిపిస్తాడంటూ విన్న మాటలన్నీ వాస్తవాలని నాకు స్వయంగా తెలిసొచ్చింది.

మీర్జాది, అతని గుర్రానిది ఒకే తీరన్నట్టుగా వుంది. వాళ్ళ సఖ్యత చూస్తే నాకో క్షణం ఈర్ష్య కలిగింది. నేను పరాయేమో అనిపించింది. నా భావం గ్రహించినట్లుగా మీర్జా తన చేతిని నా నడుందగ్గర పెట్టి దగ్గరకు జరుపుకున్నాడు.

గుర్రం గాలితో పోటీపడుతూ పరుగులు తీస్తోంది. దాని కాళ్ళసలు భూమిని తాకుతున్నాయా? లేక దానికి రెక్కలున్నాయా? అనిపిస్తోంది. ఆ రాత్రి, మర్నాడుదయం కూడా ఊపిరైనా తీసుకోలేనంత వేగంగా గుర్రమ్మీద ప్రయాణించాం. మధ్యాహ్నానికి విశాలంగా పరచుకున్న ఓ మర్రిచెట్టు కిందికి చేరాం. దాని పక్కన ఓ చిన్న కొలనుంది. మీర్జా ఆగి షహజాదీని చెట్టు మొదట్లో తను కిందికి దూకి, నన్ను సుతారంగా దింపాడు.

"కాసేపు విశ్రాంతి తీసుకుందాం"

"ఇలా ఆగడం మంచిదేనంటావా? " అన్నాను, ఆందోళన అధికం కాగా.

"రెండు రాత్రులుగా నేను ప్రయాణిస్తూనే వున్నాను. ఇంకా ముందుకు సాగాలంటే నాకూ, షహజాదీక్కూడా విశ్రాంతి తప్పనిసరి" అన్నాడు.

కొన్నిరోజులుగా నేనూ ఎంతో వత్తిడికి లోనవుతున్నాను. నాక్కూడా విశ్రాంతి తీసుకోవాలని వుంది. అయితే ఆందోళన తగ్గలేదు. ఈ భావాలన్నీ నా ముఖంలో ప్రతిఫలించగా, మీర్జా తన చేతిని నా చుట్టూ వేసి దగ్గరగా తీసుకున్నాడు.

"ఆందోళన చెందకు సాహిబా! వాళ్ళు మనల్ని అందుకోలేరు. ఓ గంటో రెండు గంటలో విశ్రాంతి తీసుకున్నంతలో వచ్చే ఆపదేం వుండదు" అని మీర్జా నేలమీద చేరబడ్డాడు. గుర్రం కొలనులో నీళ్ళు తాగి చుట్టూ పెరిగిన గడ్డి తినసాగింది.

మీర్జా తన విల్లును, అంబులపొదిని చెట్టు మొదట్లో పెట్టాడు. నన్ను తన పక్కకు లాక్కున్నాడు. తన పెదాలు నా పెదాలకోసం వెతుకుతుంటే నాలో కోరిక పెరిగింది. తీవ్రమైన కోరికతో అతన్ని అల్లుకుపోయాను. అలా ఒకరిలో ఒకరం లీనమయ్యాక నాలో వున్న భయాలన్నీ కొట్టుకుపోయి మీర్జాతో ఎప్పుడు కలిసినా కలిగే పరిపూర్ణమైన తృప్తి మరోసారి అనుభూతికొచ్చింది. అంతా అయ్యాక మీర్జా అలసిపోయి నిద్రలోకి జారుకున్నాడు. అయినా అతని చేయొకటి నా భుజాల చుట్టూ వేసేవుంది. అతను నిద్రపోయాడా అని చూసి నాలో నేను నవ్వుకున్నాను. అయితే నా మీర్జా నా కోసం వచ్చాడన్న మాట. ఇక ఇప్పుడేం జరిగినా, పట్టుబడినా, ఆఖరికి చనిపోయినా ఫర్వాలేదు. అతని చేతుల్లో ఊయలూగుతున్నట్టుగా వుండి నేనూ నిద్రలోకి జారుకున్నాను.

నిద్రపట్టగానే మేం పట్టుబడినట్టుగా కలొచ్చింది- మెలకువ వచ్చేసరికి గుర్రాల మీదొచ్చిన మనుషులు మమ్మల్ని చుట్టుముట్టారు! మెల్లగా మీర్జాను తట్టి లేపి దొరికిపోయామన్న సంగతి గొణిగినట్టు చెప్పాను. మీర్జా ఒక్కసారిగా లేచి విల్లు,

బాణాలు తీసుకుని ఓ చెట్టు కొమ్మమీదికి లంఘించాడు. చిక్కటి కొమ్మలు, ఆకుల నడుమ దాక్కుని శబ్దం వస్తున్న దిశగా జాగ్రత్తగా గురిపెట్టి ఒక్కో బాణం వేశాడు. మీర్జా ఒక్కో బాణం వేస్తుంటే మా అన్నలు ఒక్కొక్కరూ పడిపోసాగారు. ముందు పెద్దన్నయ్య షామీర్, ఆనక తక్కినవాళ్ళు. వాళ్ళలా పడిపోతుంటే నాకు చాలా బాధ కలిగింది. హృదయాన్ని నలిపేస్తున్నట్లుగా వుంది. ఆ బాధతో ఉలిక్కిపడి లేచాను. అది కలేనని అర్థమై ఊపిరి పీల్చుకున్నాను. అది కలేనని తెల్సినా, ఆ బాధ, దుఃఖం నన్ను వీడలేదు. ఎందుకంటే మావాళ్ళు మమ్మల్ని పట్టుకుంటారు. అప్పుడు నాకొచ్చిన కల నిజమౌతుంది.

చిలుక తెంపిన మావిడిపండుని బాణంతో ఒడుపుగా కొట్టిన మీర్జా ప్రతిభను చూసివున్నాను కనుక మీర్జా సమర్థత ఏంటో నాకు బాగా తెలుసు. మీర్జా తనను వెంటాడినవాళ్ళని.. మా అన్నలతో సహా గురి తప్పక చంపేస్తాడనేది నిజం. ఆ ఆలోచనకు భయంతో వణుకొచ్చింది. ఇన్నేళ్ళుగా వాళ్ళు నామీద అపరిమితమైన ఆప్యాయతానురాగాలు చూపారు. మీర్జా కారణంగా వాళ్ళ భార్యలంతా విధవలౌతారు, ముద్దులొలికే పిల్లలు అనాథలౌతారనే ఆలోచన, ఆందోళన కలిగించింది. అదే గనుక జరిగితే నా ప్రేమికుడితో కలిసి ఆనందించేదేం వుండదు. సంతోషమంతా చేదుగా, నిష్ఫలంగా, శూన్యంగా మారుతుంది. ఉహూ అలా జరక్కూడదు. అలాంటి పశ్చాత్తాపాన్ని చవిచూడాల్సిన అవసరం రాకూడదు.

మీర్జా అమ్ములపొదిపై నా చూపు పడింది. రెండు రెండు బాణాలచొప్పున తీసుకుని మడిచిన మోకాలిమీద పెట్టి రెండు ముక్కలు చేసి సాధ్యమైనంత దూరంగా కొలనువైపు విసిరేయసాగాను. ఇంకా ఒక్క బాణం మిగిలివుండగా మీర్జా కలతగా నా పక్కకు తిరిగిన శబ్దం వినిపించింది. అతను మేల్కొని నా విశ్వాసఘాతుకాన్ని కనిపెడ్తాడేమోనని భయపడ్డాను. అతని వైపుకు తిరిగి పడుకున్నాను.

అతనోసారి నన్ను దగ్గరగా హత్తుకుని, మళ్ళీ గాఢనిద్రలోకి జారిపోయాడు.

అతని పక్కన మెలకువగా వున్న నేను ఎంత ఘోరం చేశాను కదాని ఆలోచిస్తున్నాను. అతన్ని ప్రతిఘటించేవాళ్ళ సంఖ్య చాలా ఎక్కువగా వుండొచ్చు. ఇప్పుడు మీర్జా దగ్గర ఒకటే బాణం వుంది. బాణాల్లేకుండా వాళ్ళనెదుర్కోవడమంటే ఆపదలో పడినట్లే! నా సోదరుల గురించి ఎలాంటి భ్రమలూ లేవు. గౌరవానికి భంగం కలిగిందనుకుంటే వాళ్ళెవర్నీ ఖాతరుచేయరు. మీర్జాని ఒక్కణ్ణి చేసి గాయపరచడమే కాదు, చంపడానికైనా వెనుకాడరు. అతన్ని ముక్కలుగా నరుకుతుంటే పక్కన నిలబడి చూడాల్సివస్తుంది. అలా అనుకోగానే చలిజ్వరమొచ్చినట్లయింది. ఏదేమైనా మీర్జా చెప్పినట్లుగా నాకు నేను ధైర్యం చెప్పుకోడానికి ప్రయత్నించాను. త్వరగానే ఇక్కణ్ణించి బయల్దేరతాం గనుక పట్టుబడం అనిపించగానే కాస్త స్థిమితం కలిగింది. మీర్జా లేచి నేను చేసింది చూశాడంటే తన పని ముగిసిపోయినట్లుగా భావించి నాకు దూరమౌతాడు. ఇలాంటి ఆలోచన్లన్నీ తికమకపె

## కొత్తగాలి...

**ప్రేమ కడుపు నింపదు**
**నిజమే!**
**కచ్చితంగా**
**మనసు నింపుతుంది!**

– జి.వి.యస్. ప్రియంవద,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

ట్టాయి, అసహనం కలిగించాయి. నా ప్రియసఖుని చేతుల్లోనే వున్నప్పటికీ దుర్భరంగా వుంది. అనేక నెలలుగా అతనికి దూరంగా ఒంటరితనాన్ని అనుభవించిన రోజుల్లో కూడా ఇంతటి ఆవేదన లేదు.

నేనిలా సతమతమౌతుండగా వాళ్ళెంత మాత్రం సవ్వడి చేయకుండా వచ్చారు. రవంత అలికిడి కూడా వినిపించలేదు. బహుశా దూరంగా వుండగానే మీర్జా గుర్రాన్ని చూసి దొంగల్లా చడీడప్పుడూ లేకుండా వచ్చివుంటారు. లేదా నేను ఆలోచనల్లో కూరుకుపోయి వాళ్ళు రావడాన్ని గమనించలేదేమో? నేలమీద పడుకునే వాళ్ళని చూశాను. ఇరవై అడుగుల కంటే కూడా తక్కువ దూరంలో ఓ వ్యక్తి గుర్రం మీద నిలబడి నిశ్శబ్దంగా మావంక చూస్తున్నాడు. అతని పక్కన ఇంకొకరు, ఆ పక్కన మరొకరు.. గబుక్కున లేచి చుట్టూ చూశాను.. అచ్చం కలలో మాదిరిగానే వాళ్ళంతా మా చుట్టూ దడి కట్టినట్టుగా వున్నారు. పారిపోయే వీల్లేదు.

ఇదెలా జరిగింది? మీర్జా చాలా త్వరగానే ఇక్కణ్ణించి బయల్దేరదామన్నాడు. అయినా మేం ఆగి కనీసం రెండు గంటలైనా కాలేదు. వెంటనే మమ్మల్ని దారిలో అటకాయించిన బాబాయి పిల్లలు గుర్తొచ్చారు. వాళ్ళు మా మాటలు నమ్మలేదని నాకప్పుడే అనుమానమొచ్చింది. నేనేదో భ్రమలో వున్నట్టుగా కలగన్నదాన్ని అనుకరిస్తూ మీర్జాను మెల్లగా తట్టి "వాళ్ళు కనిపెట్టేశారు మీర్జా! మనల్ని చుట్టుముట్టారు" అంటూ అతని చెవిలో గొణిగాను.

మీర్జా బదులేం పలకలేదుగానీ, ఊపిరి బిగపట్టడాన్ని బట్టి నా మాటలు విన్నాడని అర్థమైంది. క్షణంలో విల్లును, అమ్ములపొదిని తీసుకుని చెట్టుకొమ్మమీదికి ఎగిరాడు.

కొందరు అశ్వారోహకులు మామీద పడబోతే షామీర్



వాళ్ళని "వెనక్కెళ్ళండి" అని ఆజ్ఞాపించి 'అతనెంతటి విలుకాడో మీకు తెలుసా? అతని బాణాలన్నీ అయిపోయేవరకూ వెనకే వుండండి" అన్నాడు.

మమ్మల్ని చుట్టుముట్టిన గుర్రపుమనుషులు నెమ్మదిగా అడుగులు వెనక్కేశారు. మీర్జా విల్లు ఎక్కుపెట్టి బాణం వేసిన శబ్దం విన్నాను. అతని గురి తప్పలేదు. ఒక అశ్వారోహకుడి ఉదరంలోకి చొచ్చుకుపోయి అతను పెద్దగా ఆర్తనాదం చేస్తూ గుర్రంమీంచి కిందికి పడిపోయాడు. అతడు తల తిప్పి నావంక చూశాడు. అప్పుడా ముఖాన్ని చూద్దును కదా.. తాహిర్! ఆ అందగాడిప్పుడు చెత్తను ఊడ్చేసిన చందంగా, నిస్సహాయంగా పడివున్నాడు. అతడు శృంగారం జరిపిన వైఖరితో పశువులానే అనిపించాడు. అందుకే మీర్జాకు ప్రాధాన్యత ఇచ్చాను. అయినప్పటికీ షామీరన్నయ్య చెప్పినట్టుగా మీర్జా కంటే తాహిర్ చాలా విషయాల్లో మెరుగైనవాడు. అందగాడు, సమర్థుడు, మంచి కొడుకు, మంచి సోదరుడు పెళ్ళి తర్వాత నాక్కాదుగానీ ఇతర స్త్రీలకి మంచి భర్త కాగల అర్హతలున్నవాడు!

తాహిర్ బంధువొకతను గుర్రాన్ని తాహిర్‌వైపు నడిపిస్తుంటే "ఆగాగు! నీకూ అదే గతి పడుతుంది. నీ వంతు వచ్చేదాకా కొంచెం ఓపిక పట్టు" గదమాయించాడు షామీర్ అన్నయ్య. దాంతో అతను గుర్రాన్ని యథాస్థానానికి అడుగులేయించాడు.

"సాహిబా, సాహిబా!" అంటున్న మీర్జా గొంతు వినిపించింది. స్వరం మృదువుగానే వున్నా కంగారుగా వుంది. తలెత్తి చూశాను- చెట్ల కొమ్మల మధ్య కూర్చున్నాడు.



"బాణాలు కింద పడిపోయినట్లున్నాయి. త్వరగా తీసి అందించు" అన్నాడు.

కింద ఏమీ పడలేదు కనుక నేనేం ఇవ్వలేను. అందుకే కదలకుండా అలాగే నిలబడ్డాను. నేనెంత ద్రోహినో అనుకుంటూ చెట్టు మొదలుకు వీపునానించి ఖిన్నురాలినై నిలబడ్డాను. మీర్జా ఆకుల మధ్యలోంచి కదిలి నా వైపు తొంగిచూసి "ఏంటిది సాహిబా? నా మాటలు విన్పించలేదా? నా అమ్ములపొదిలోంచి బాణాలు కింద పడ్డాయి, త్వరగా ఇవ్వు" అన్నాడు.

నేను కదల్లేక, మాట్లాడలేక అలాగే నిలబడ్డాను. చివరికి మీర్జా అసహనంగా చెట్టు మీంచి కిందికి దూకి మాయమైన బాణాల కోసం అక్కడంతా వెతికాడు. కొలను దగ్గర గడ్డిలో విరిచేసి ఉన్న బాణాలను చూశాక నేనేం చేశానో అర్థమై "ఎందుకిలా చేశావు సాహిబా? " అనడిగాడు. అతని కళ్ళలో పూర్తిగా ఓడిపోయానన్న భావన తొంగిచూసింది. అంతలోనే నవ్వేసి "నాకర్థమైంది సాహిబా! నువ్వేం చేశావో? ఎందుకు చేశావో? నేనర్థం చేసుకున్నాను. అందుకు క్షమిస్తున్నాను కూడా" అని క్షణకాలంపాటు తన చేతిని నా భుజం మీదుంచి, వెంటనే తీసేశాడు.

బాణాల్లేకుంటే వ్యర్థమే కదాని విల్లుని కింద పడేసి, చెట్టునీడలోకి అడుగులేశాడు.

సున్నాలా చుట్టుముట్టినవాళ్ళు తమ అశ్వాలతో ఇంకాస్త వెనక్కి తగ్గారు. తాము చూసిందేంటో వెంటనే అర్థం కాలేదు. అసలది నమ్మశక్యంగా లేదు.

"నువ్వెంతో గౌరవనీయుడివి షామీర్. ఆ గౌరవప్రతిష్ఠలకు భంగం రానీయకు. ఒక్కణ్ణే వున్నాను గనుక ద్వంద్వ యుద్ధానికి అనుమతించు. ఒక్కడి మీద ఇందరు కసాయిగా, పశుప్రాయంగా దాడి చేశారన్న అపకీర్తి తెచ్చుకోవద్దు" అన్నాడు మీర్జా, షామీరన్నయ్యతో.

"నువ్వు చేసినట్లు ఏ జంతువు కూడా చేయదు. అయినాగానీ నేను మనిషిని కనుక నా మర్యాద నేను దక్కించుకోడానికి నువ్వడిగిందానికి ఒప్పుకుంటున్నా" అని బదులిచ్చిన షామీర్ గుర్రం మీద కొద్దిగా ఎగిరినట్లు కూర్చుని తన కత్తి తీశాడు. మీర్జా కూడా తన గుర్రమెక్కి కూర్చుని దాని పక్కన సంచిలోంచి కత్తి తీశాడు.

నేను చెట్టు మొదట్లో నిలబడిపోయి చూస్తున్నాను. ఇద్దరూ హోరాహోరీగా, భయంకరంగా పోరాడుతున్నారు. దానికి ముగింపు లేదా? అనిపించింది. చివరికి మీర్జాకో అవకాశం వచ్చింది. అంతే! క్షణం కూడా ఆలస్యం చేయకుండా షామీరన్నయ్యను తీవ్రంగా పొడిచేశాడు. షామీర్ చేతిలోని కత్తి పడిపోయింది. చావుకు నోరు తెరుచుకున్నట్టున్న గాయాల శరీరాన్ని పట్టుకుని నావైపు తొట్రుబాటుతో అడుగులేశాడు. కొన్ని క్షణాలలాగే వున్నాడు. శరీరం ఊగిపోతోంది. మోకాళ్ళను ఆసరాగా చేసుకుని నిలబడాలని చూశాడు, గానీ అన్నయ్య నేలమీదికి ఒరిగిపోయాడు!

పరుగున వెళ్ళి అన్న తలను నా ఒళ్ళోకి తీసుకున్నాను. అన్నయ్య చటుక్కున నా చేతిని తన చేతిలోకి తీసుకుని కళ్ళల్లోకి చూశాడు. ఏదో చెప్పాలని పెదాలు కదిలించాడు. కానీ గాయం లోతుగా వుండి రక్తం ధారగా పోతోంది. మాట్లాడలేనంత నీరసించిపోయాడు. చివరగా తలెత్తడానికి ప్రయత్నించాడు. కానీ ఫలించలేదు. నా ఒళ్ళోనే ప్రాణాలొదిలేశాడు.

"వాణ్ణి పట్టుకోండి..! ఆ హీనుడైన హంతకుణ్ణి పట్టుకోండి" బిగ్గరగా అన్నాడు మా చిన్నన్నయ్య సయీఫ్.

అందరూ కలిసి నా మీర్జా మీద కత్తులతో దాడి చేశారు. అతను సాధ్యమైనంతగా పోరాడాడు, గానీ ప్రయోజనం లేకపోయింది. నా కళ్ళెదురుగానే మీర్జాని మళ్ళీమళ్ళీ కత్తులతో పొడిచేశారు. మోకా

ళ్ళమీద లేవడానికి శాయశక్తులా ప్రయత్నించి బొత్తిగా లేవలేక నేలమీద ఒరిగిపోయాడు. సయీఫ్ ఒక్కుదుటున గుర్రం మీంచి కిందికి దూకి నేలకొరిగిన నా ప్రియసఖుని తలను కత్తితో నరకబోతుంటే నేను మీర్జా మీద పడిపోయి "చాలు, చాలు.. అల్లా కోసమైనా దయతల్చండి. ఇప్పటికే చాలినంత చేశారుగా.. ఇక వదిలేయండి. కనీసం అతని శరీరాన్నయినా మిగల్చండి" అంటూ రోదించాను.

"వదిలేయండి.. కాసేపట్లో ఎలాగూ ఛస్తాడు వదిలేయండి!" అన్నాడు రెండో అన్నయ్య అఫ్తాబ్.

మీర్జా ముఖంలోకి చూశాను. కత్తులతో పొడిచిన ఆ శరీరం భయానకంగా వుంది. రక్తం ధారగా నేల మీద ప్రవహిస్తోంది. ఇదంతా నేనే చేశాను. నా వల్లే మీర్జాకి లాంటి దుర్గతి పట్టింది. 'నాకు బతికే అర్హత లేదు' అనుకుని చుట్టూ కలయజూస్తే షామీర్ నడుం దగ్గర మా తాత గారి బాకు కనిపించింది. అది కుటుంబ వారసత్వ సంపద. షామీర్ దాని గురించి ఎప్పుడూ గర్వంగా భావిస్తూ వుంటాడు. గబుక్కున వెళ్ళి ఆ కత్తితో పొడుచుకుందామని తీసుకున్నాను.

"వద్దువద్దు సాహిబా!" అంటూ మీర్జా కన్నీరు కార్చాడు. ఆశ్చర్యకరంగా ఇప్పుడతని స్వరం బిగ్గరగా, స్పష్టంగా వుంది.

"అంత పని చేయొద్దు! నువ్వలా చేయకూడదు. మన ప్రేమ సాక్షిగా నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. చావు గురించిన ఆలోచనలకి తిలోదకాలిచ్చి బతకాలి నువ్వు" అన్నాడు.

"నువ్వు ప్రేమ గురించి మాట్లాడుతున్నావు. అదే క్షణంలో చావొద్దని చెప్పి, చావు కంటే భయంకరమైన శిక్షను ఎదుర్కోమంటున్నావు" అన్నాను. బాకు ఇంకా నా చేతిలోనే వుంది, కానీ ఆ చేయి కిందికి వాలిపోయింది.

"జీవితానికి అర్థమే లేదనిపిస్తున్న తరుణంలో నన్ను బతకమంటున్నావు. నువ్వు లేకుండా బతికే ప్రతీ క్షణం, తీసుకునే ప్రతీ శ్వాస శాపమే. నీ మాటలు వెనక్కి తీసుకో మీర్జా, నన్ను చావనివ్వు. శాంతి, విశ్రాంతి పొందే అవకాశమివ్వు" అన్నాను.

"ఓహ్! సాహిబా! నువ్వెప్పటికీ మారవా?" అంటూ ఎగవూపిరితో మాట్లాడ్తోంటే మీర్జా శ్వాస ఆగిపోడానికి ఎంతో సమయం లేదని అర్థమైంది. నీకు తోచిందే తప్ప అంతకుమించి ఆలోచించవా? నువ్వు గనుక చచ్చిపోతే మనతో బాటు మన ప్రేమ కూడా అంతమౌతుంది. అప్పుడిక జనాలు తప్పకుండా చెవులు కొరుక్కుని మన ప్రేమని మరింత భ్రష్టు పట్టిస్తారు. అందుకే నువ్వు బతికి దాని విలువేంటో చాటాలి. ఇందులో అపకీర్తి పాలయ్యేది ఏమీలేదని, మన ప్రేమ అద్భుతమైదనీ, ఆ మహనీయతే మన తనువుల్ని ఏకం చేసిందని తెలుసుకుంటారు" అన్నాడు మీర్జా.

ఓ క్షణమాగి, నా వంక చూసి నవ్వి నేనతన్ని ఇష్టపడేలా చేసిన అదే మెత్తటి, మృదువైన స్వరంతో "అదింకా పూర్తవ్వలేదు. మనకింకా కొద్ది క్షణాలే ఉన్నాయి. నేనడిగింది చేస్తానని చెప్పడానికి నిదర్శనంగా నన్ను దగ్గరకు తీసుకో" అన్నాడు.

మీర్జా అలా అనగానే మరింత దగ్గరగా వెళ్ళి కూర్చుని అతని తలను నా ఒళ్ళో పెట్టుకున్నాను. జుట్టులోకి చేతులు జొనిపి, రక్తంతో నిండిన ముఖాన్ని ముద్దాడాను. అలా చేస్తుంటే నాలో దౌర్బల్యం పోయి బలం తిరిగొచ్చినట్లయింది. మీర్జా అలాగే వుండి నా కళ్ళలోకే చూస్తున్నాడు. నెమ్మదిగా తన ప్రాణాలు గాల్లో కలిసిపోయాయి. మా చుట్టూరా ఉన్నవాళ్ళు మాటలు రానట్లు నిశ్శబ్దంగా నిలబడ్డారు. అదే అంతమనే భావన కలగలేదు. నేను గ్రహించిందల్లా ఒక్కటే తేజస్సంతా మీర్జా కళ్ళల్లోనే మిగిలిపోయింది. అందుకే వాళ్ళి

టువైపే చూస్తున్నా వాళ్ళకి నేను కనిపిం చలేదు. మొద్దుబారినట్లయ్యాను. జీవంలేని కళ్ళమీద రెప్పల్ని మూశాను.

అఫ్తాబ్ భయ్యా దగ్గరికొచ్చి నా భుజ మ్మీద చెయ్యేసి "రా..!" అన్నాడు. మీర్జా తలను ఒళ్ళోంచి తీసి నేలమీద వుంచి పైకి లేచాను. హతుడైన నా ప్రేమికుడ్ని వెనక్కి తిరిగి చూడకుండా వచ్చేశాను. గు ర్రం ఎక్కేప్పుడుగానీ, నా వెనుక అన్నయ్య ఎక్కినప్పుడు గానీ మీర్జా వంక చూడకుం డానే దాటి వచ్చేశా. ఇక ఆ దేహంలో ప్రేమించాల్సిందేమీ మిగల్లేదనిపించింది.

★ ★ ★

ఆ షాక్‌ను తట్టుకోలేకపోయాను. కొన్ని వారాలపాటు నిస్పృహలో కొట్టుకుపో యాను. మనసు మూగబోయింది. అయి నప్పటికీ మెదడు మాత్రం వాళ్ళూవీళ్ళూ అంటున్న మాటల్ని గ్రహిస్తోంది. మీర్జా గుర్రం షహజాదీ ఎవరూ తోలకుండానే వెళ్ళిపోయిందట. దానంతటదే దనాబాద్ చేరిందట. దాంతో మీర్జాకేదో ఆపద కలి గిందని ఖరాల్ జాట్స్ గ్రహించారట. వెళ్ళిన గుర్రం మీర్జా తండ్రిని తీసుకుని జీవం లేని కొడుకు శవం దగ్గరికి తెచ్చిం దట. మీర్జా శవపేటికను మట్టితో కప్పే స్తుంటే అతని తండ్రి వేదనతో ఎలా కుప్ప కూలిపోయాడో, తిండి తినడం మానేశాడో విన్నాను. అంతేకాదు, మీర్జాకు అంత్య క్రియలు నిర్వహించిన ధైర్యవంతుడు, భక్తి పరుడూ అయిన మౌల్వీ 'ఈ ఘోరానికి మన నాయకుణ్ణే నిందించాలి!' అన్నాడట. ఒకవేళ సాహిబా కనుక ఆయన కూతుర య్యుంటే బింజాల్ ఒక్కడూ చేసినదా నికంటే ఎక్కువగా సాయల్స్ ఏమీ చేయ లేరు అని కూడా అన్నాడట.

చందారన్‌లో తాహిర్‌కోసం పల్లకీతో ఆహ్వానం పలకడానికి వచ్చిన గ్రామీణ స్త్రీలు అతని శవాన్ని చూట్టంతో సంతోషం కాస్తా, సంతాపంగా మారిపోయిందట.

ఇక మీర్జా తండ్రి తన ప్రియపుత్రుడి స్థి తికి తల్లడిల్లిపోయాడట. విల్లువీరుడి కథ ముగిసిన నాలుగురోజులకి మరో భయం కరమైన మాట కూడా విన్నాను. ఒకావిడ పదేపదే చెబుతుంటే తక్కినవాళ్ళు నా వం క అనుమానంగా, నమ్మలేనట్టుగా చెవులు కొరుక్కోవడం స్పష్టంగా నా చెవుల్ని చే రాయి- నేనో అపవిత్రమైన మహిళనట.. నా కారణంగా నా సోదరుడు, కాబోయే భర్త, ప్రేమికుడు కూడా చనిపోయారట.

నెమ్మదిగా రోజులు జరుగుతూ గతం లోకి జారాయి.

మా ఇంట్లోవాళ్ళు నన్ను చూసిన పద్ధతి ని బట్టి నాలో గొప్ప సహనం వచ్చింది. మొదట్లో మెల్లమెల్లగా, ఆనక వేగంగా మీర్జాతో నా జ్ఞాపకాలు అంతరించాయి. తొలుత మొద్దుబారిన మనసు ఆనక బాధాతప్తమైంది. ఎంత దుర్భర వేదనంటే ఈ బాధతో బతకడం సాధ్యం కావడం లేదు. మరోసారి నా జీవితాన్ని అంతం చేసుకోవాలనే ఆలోచనొచ్చింది. నది ఒడ్డున నిలబడి వేగంగా సుడులు తిరు గుతూ ప్రవహిస్తున్న నీళ్ళ ఉధృతిని చూశాను. గబుక్కున ఒక్క దూకు దూకితే చాలు అంతా అయిపోతుంది. ఆ వెంటనే విషతుల్యమైన బెర్రీపళ్ళు గుర్తొచ్చాయి. లేదా ఎత్తయిన హవేలీ భవనమెక్కి దూకితే నా బాధనుంచి విముక్తమౌతాను కదా! కానీ, అంతలోనే నన్ను వెన్నంటి వున్న మీర్జా చేదు జ్ఞాపకం కళ్ళల్లో మెది లింది. నిజమే, ఎంత దుఃఖమున్నా సరే, బతికుండటం నేర్చుకోవాలని అర్థమైంది.

కాలం గడిచేకొద్దీ బాధ తీవ్రత తగ్గింది. నిరంతరం నిరుత్సాహంలో పడి కొట్టుకు పోతున్నా గానీ మొత్తానికి జీవించడం నేర్చుకున్నాను. క్రమంగా దైనందిన జీవి తంలో పడ్డాను. విచిత్రంగా నా మధుర జ్ఞాపకాలు కేవలం స్మృతులుగా గాక చాలా ముఖ్యమైన ఘట్టాలుగా కనిపించ

అ
క్ష
రం

పాడైపోయిన పెద్దవాళ్ళని బాగుచేయడం కంటే పిల్లల్ని చక్కగా తీర్చిదిద్దడం తేలికైన పని.

– ఫ్రెడెరిక్ డగ్లాస్,
సంఘసంస్కర్త, రాజనీతిజ్ఞుడు



సాగాయి. కానీ ఇదంతా అర్థంకాని జనాలు మా గురించి చాలానే ముచ్చటించుకున్నారు. ఆ గుసగులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నా చెవులకు సోకినా పట్టించుకోలేదు, అస్సలు లక్ష్యపెట్టలేదు.

ఓ రోజు అమ్మ నాతో "నీ దుస్తుల్లో కొన్ని భలే అందమైనవున్నాయి కదా.. ఎందుకేసుకోవు? మంచివాటిల్లోకెల్లా మహా గొప్పవన్పించే దుస్తులు నీకెన్ని వున్నాయో దేవుడికే తెలుసు" అంది. ఆ మాట ఇప్పటికెన్నిసార్లందో లెక్కలేదు.

"అవునవును, అప్పుడుగానీ ప్రతి ఒక్కరూ కళంకం కారణంగా ఆగిపోయిందంటూ ముగిసిన పెళ్ళి వ్యవహారాన్ని మళ్ళీ గుర్తు చేసుకోరు. నీలో అసలా బాధ ఎందుకు లేదమ్మా?" అన్నాను కొంచెం తీక్షణంగా. కోపం, వెగటు కలిసిన నా మాటలకి అమ్మ వెనక్కి తిరిగింది. ఆవిడ దెబ్బతిన్నట్టుగా చూట్టంతో బాధపడ్డాను.

నేనోసారి ఒక స్నేహితురాలి గురించి కోపద్వేషాలతో అనాలోచితంగా మాట్లాడిందానికి "నీ నాలుక మహా పదును, వేదు. దాన్నెలా నియంత్రించుకోవాలో నేర్చుకోవాలి నువ్వు. ఒకర్ని నొప్పించే మాటలు మాట్లాడకపోవడమే మంచిది. అవి వాళ్ళని బాధించడం సంగతలా వుంచు.. అంతకుమించి అవన్నీ నీకే తిరిగొస్తాయని జాగ్రత్తగా గుర్తుంచుకో. మంచిమాటలు ఖరీదైనవేం కాదు, ఇట్టే మాట్లాడొచ్చు. పైగా అవి మనసుల మధ్య వంతెనలు కట్టి ఆత్మీయతను పెంచుతాయి" అన్నాడు మీర్జా. ఆ సమయంలో మీర్జా పక్షపాత వైఖరి చూపిస్తున్నాడు, నేను తగవుపడ్డ అమ్మాయినే సమర్థిస్తున్నాడు అనిపించి అతన్ని కూడా నిందించాను. ఒకట్రెండ్రోజులు చిరచిరలాడ్తూ ముఖం మాడ్చుకున్నాను కూడా. ఇప్పుడు అమ్మ మాటతో ఆ సన్నివేశం గుర్తొచ్చింది. మీర్జా మాటల్లో సత్యముందని నాకు తెలుసు.

అమ్మ దగ్గరికెళ్ళి గాఢంగా కౌగిలించుకుని "నేనన్నదానికి క్షమించమ్మా. నీకు నేనంటే ఇష్టమని, నా మేలే కోరుకుంటావని నాకు తెలుసు" అన్నాను.

అమ్మ నా చుట్టూ చెయ్యేసి "క్షమించమని అడగక్కర్లేదు. నువ్వంటే ప్రేమే. అందుకే అడక్కముందే క్షమించేశాను" అంది.

నా తీరుకు ఒకావిడ నివ్వెరపోయి చూస్తోంది. నేను కఠినంగా మాట్లాడ్డం మామూలే కానీ ఎన్నడూ క్షమాపణ కోరలేదు. మరికొద్ది నెలలు గడిచే సరికల్లా మీర్జా చెప్పింది పరమ సత్యమని, ఇతర్లని బాధించే మాటలు అక్కర్లేదని నేర్చుకున్నాను. క్రమంగా నిష్టూరంగా మాట్లాడ్డం పూర్తిగా మానేశాను. ఇందువల్ల వారధి కట్టినట్టుగా ఎందరో చేరువయ్యారు.

ఇంకోరోజు జరిగిన సంఘటన కూడా గుర్తుంది. సన్నగా, అస్థిపంజరంలా వున్న ఒక ముసలి బిచ్చగాడు మా ఇంటిముందుకొచ్చి "మూడ్రోజులుగా ఒక్క మెతుకైనా తిన్లేదమ్మా.. ఈ పేదవాడి మీద దయచూపండి తల్లీ!" అంటూ యాచించాడు.

నాకతన్ని చూస్తే అసహనం కలిగింది. ధర్మం చేయడం నాకిష్టం లేదు. 'ఆ బిచ్చగాడి కోసం సమయం ఎందుకు వృథా

చేయాలి? పట్టించుకోకుండా వదిలేస్తే అతడే వెళ్ళిపోతాడు' అనుకున్నాను.

"అల్లా నిన్ను, నీ వాళ్ళందర్నీ దీవిస్తాడమ్మా! ఈ దీనుడి మీద దయ చూపమ్మా!" అంటూ మళ్ళీ వేడుకున్నాడతడు.

అయినా విననట్లుండిపోయాను. కొద్దిసేపాగి చూస్తే అతను మా ఇల్లు దాటి వెళ్ళిపోయాడు. అప్పుడు మీర్జా మాటలు గుర్తొచ్చాయి- 'మనకు చాలా వుంది. కానీ చాలామందికి ఏమీ లేదు. ఉన్నదాంట్లోంచి కొంత ఇచ్చినంతలో మనకు తరిగిపోయేదేం వుండదు. కానీ మనమిచ్చే ఆ కాస్తంత వాళ్ళకు చాలా గొప్పది. దానం చేస్తే దేవుడు మనకి అనుగ్రహించినందుగ్గానూ కృతజ్ఞతలు చెప్పుకున్నట్లవుతుంది"

నేను గుమ్మం దగ్గరికి పరిగెత్తి వీధిలోకి చూశాను. అతను పక్కింటి తలుపు ముందు నిలబడి యాచిస్తున్నాడు.

ఎవరో తరుముతున్నట్టుగా "బాబా! తిరిగిరా. దయచేసి ఒకసారి రా!" అన్నాను.

ఆ వృద్ధుడు నా వంక చూశాడు. క్షణం క్రితం నాలో కనిపించిన నిర్లక్ష్యం, విసుగు, ఏవగింపు ఇప్పుడు మాయమై, గొంతులో మార్దవం ధ్వనించేసరికి తబ్బిబ్బయ్యాడు. కానీ ప్రతిస్పందించలేదు. నేనే పరుగున వెళ్ళి అతని చేయి పట్టుకుని మా వాకిట్లోకి తీసుకొచ్చాను. ఒక స్టూలు మీద కూర్చోబెట్టి మట్టిపాత్రలో నీళ్లిచ్చాను. కాళ్ళూ చేతులకున్న దుమ్ము పోయేలా కడుక్కోమని నీళ్ళు పోశాను. పళ్ళెంలో ఆహారం పెట్టి అతని ముందుంచాను. అతను చాలు, చాలు, ఇంక తినలేను అనేవరకూ బలవంతంగా కొసరికొసరి వడ్డించాను.

అంతసేపూ మా పనివాళ్ళలో ఒకామె నివ్వెరపోతూ గొణగడం వినిపిస్తూనే వుంది. ఆ వృద్ధుడు తినడం పూర్తయ్యాక, చేతులు కడుక్కోడానికి నీళ్ళు పోశాను.

అతను నా తలమీద చెయ్యిపెట్టి "అల్లా దీవెనలు నీకుంటాయమ్మా! నీ మనసులో వున్న కలలు, కోరికలన్నిట్నీ భగవంతుడు తీర్చాలి. నీకు అందమైన భర్త రావాలి. వందమంది కొడుకులు పుట్టాలి" అంటూ ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

అప్పుడే అక్కడికొచ్చిన మా అమ్మ "అందమైన భర్త, వందమంది కొడుకుల గురించి తెలీదుగానీ మొత్తానికి అల్లా నీకు ఘనంగానే ఇస్తాడు" అని నా ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని నుదుటిమీద ముద్దుపెట్టుకుంది. మునుపెన్నడూ చూడని ఆత్మీయత అమ్మ కళ్ళల్లో కనిపించింది.

ఇంకో సంఘటన గుర్తొచ్చింది. మా కుటుంబంలో ఓ పెళ్ళి వుంది. ఎవరు ఏ దుస్తులు ధరించాలనే విషయమై ఆడవాళ్ళమంతా చేరి గంటలు గంటలు చర్చించుకుంటున్న సమయంలో మా చిన్నొదిన మెహెర్ "సాహిబా! నీ చేతి కంకణాన్ని బదులివ్వకూడదూ? నేను వేసుకునే వస్త్రాలకి అది బాగా నప్పుతుంది" అంది.

తను ఏ కంకణాన్ని అడుగుతోందో నాకు తెలుసు. అది మహా కళాత్మకమైంది. అందుకే అందరి కళ్ళూ దానిమీదే వుంటాయి. నా వస్తువులు నాకు మాత్రమే చెందాలనుకుంటాను. నాకు సంబంధించిన వేటినీ కూడా ఇతర్లతో పంచుకోవడం నాకు నచ్చదు. "లేదు. దాన్నివ్వను. నేనే వేసుకోవాలి" అన్నాను కరుగ్గా. కానీ, అనేసిన వెంటనే, మీర్జా నా మాటలు ఖాతరు చేయకుండా నన్నొదిలి ఎడ్లబండి ముసలాయన్ని కాపాడ్డానికి వెళ్ళిన సన్నివేశం కళ్ళ ముందు మెదిలింది. 'మన స్వార్థం కోసం నిస్పృహాయులకి సాయం చేయకపోతే మన జన్మకు సార్థకత వుండదు' అన్నాడప్పుడు. అది గుర్తురాగానే కంకణం పట్ల నాకున్న మోజంతా ఎగిరిపోయింది.

గబుక్కున మెహెర్ని పిలిచి "వుండుండు, నేనేసుకునే దుస్తులకి ఆ కంకణం కంటే గాజులే బావుంటాయనిపిస్తోంది. అది నువ్వే వేసుకుందుగాని.. తెస్తానుండు"

అని నా గదిలోకెళ్ళి కంకణం తెచ్చిచ్చాను.
మెహెర్‌కి కపటాలు, మోసాలూ తెలీవు. తను ఇష్టపడిందాన్ని ఇచ్చినందుకు "నీది చాలా మంచి మనసు" అంది ఉద్వేగంగా.
"అబ్బా! ఇంత చిన్నదానికి అంత మాటొద్దు" అన్నాను.
కొన్నినెలల వరకూ మీర్జా మాటలు చాలా తరచుగా గుర్తొచ్చేవి. అతని మాటలన్నీ ఇప్పుడు నావే అయ్యాయి. మాటలకందని మానవత్వం, చుట్టూ వున్నవారి పట్ల అంతులేని కరుణ చూపుతూ మీర్జా ఎలా బతికాడో నేనలా జీవించడం మొదలెట్టాను. నాలో వచ్చిన మార్పుకు అందరూ నివ్వెరపోవడం తెలుస్తోంది. నిజానికి ఈ మార్పు నన్నే ఆశ్చర్యపరుస్తోంది.
ఇప్పుడు నేనెంత నిరాడంబరంగా జీవిస్తున్నానంటే నాలో స్వార్థం, నిర్లక్ష్యవైఖరి, గర్వం, కోపతాపాలకు చోటేలేదు. దుఃఖం, విషాదాలను మర్చిపోయాను. తోటివారి జీవితాల్లో నిండిన బాధ, నిర్వేదాల గురించి ఆలోచిస్తున్నాను. ఇదొక స్వీయ భావావరోధంగా మారింది. క్రమంగా మీర్జా గురించి తరచుగా, ఎక్కువ లోతుగా ఆలోచించకూడదని నేర్చుకున్నాను.

★ ★ ★

ఓ సంవత్సరం తర్వాత ఓ పెళ్ళి సంబంధం వచ్చింది. మా నాన్న, తన కూతురికో భర్తను తెచ్చి, ఆమెకంటూ ఓ సంసారం ఏర్పర్చాలని అనుకుంటున్నారని అర్థమైంది. ఆయన అభీష్టాన్ని గౌరవించడం నా బాధ్యత. నా ఇష్టాయిష్టాలను కాదని ఆ సంబంధాన్ని ఒప్పుకున్నాను.
సాదిఖ్ మంచివాడు, నా కంటే పెద్దవాడు. ఆడంబరం ప్రదర్శించడు. మోసం, కపటం తెలీవు. చాలా మృదువుగా, ప్రేమగా వుంటాడు. రక్షణగా వుంటాడు.
మొదటిరాత్రి రోజున సాదిఖ్, నా దగ్గరగా వచ్చి తన చేతుల్లోకి తీసుకోగానే.. మీర్జాతో సంగమం గుర్తొచ్చింది. అలా పోల్చి చూసినప్పుడు నాలో ఒకటే గుంజాటన, మానసిక క్షోభ. తర్వాత మీర్జా ఏం చేసేవాడో నేనలా చేశాను. నా సర్వాన్నీ అర్పించి పరాధీననయ్యాను. సాదిఖ్ తనువే కాదు, ఆత్మ కూడా సంతృప్తిచెందేలా సుఖసంతోషాలనిచ్చాను.
"నీలాగా ఇంకెవరూ వుండరు" ఆనందంగా అన్నాడు నా భర్త.
అప్పుడే కాదు, అనేక సందర్భాల్లో సాదిఖ్ ఆ మాటన్నాడు.
నెమ్మదిగా ఇద్దరిమీ సన్నిహితమయ్యాం. మా ఇద్దరి మధ్యా గాఢమైన ప్రేమ కలిగి అనుబంధం బలపడింది. ఒకరంటే ఒకరికి పూర్తి అవగాహన కలిగింది. దేవుడెంతో దయతో మమ్మల్ని ఆశీర్వదించాడు. సంవత్సరాలు ఇట్టే దొర్లిపోతున్నాయి. అందంగా, బలంగా, పుష్టిగా వున్న ఏడుగురు పిల్లలు పుట్టారు. వాళ్ళు పెరిగి పెద్దవుతుంటే బోల్డంత సంతోషం, గర్వం. పిల్లలందరూ కూడా నీతినియమాలను అనుసరిస్తూ సద్గుణులు అనిపించుకుంటూ ప్రయోజకులయ్యారు.
జీవితం అలా గడుస్తోంది. ఇప్పుడు నేను శీతాకాలపు నీరెండలో కూర్చుని, అల్లా ఇచ్చినదాన్ని తల్చుకుంటూ వుంటాను. భగవంతుడు నన్నెంత గొప్పగా దీవించాడో! పనికిమాలిన పశ్చాత్తాపాలు లేదా ముందేం జరుగుతుందోననే ఆలోచన్లు, ఆరాటాలతో సమయం వృథా చేయడం లేదు.
అయినప్పటికీ ముందు చెప్పినట్లుగా ఒక్కోసారి మీర్జా గుర్తొస్తాడు. అప్పుడు.. అతనికి నేనేం చేశాను అనిపిస్తుంది. నా ప్రేమికుడు, సోదరులను ఎంచి చూడడం చాలా కష్టమైన వ్యవహారం. కొందరు నన్ను నమ్మదగని ఆడదానిలా చూట్టం నాకు తెలుసు. ప్రేమించినవాడు చాలా ఆపదలో వుండగా, అతన్ని కాపాడుకోకుండా శత్రువులకు అప్పజెప్పిన ద్రోహినని, మీర్జా నమ్మకాన్ని వమ్ము చేశానని జనాలు

# అవార్డు



సెప్టెంబరు 28న వరంగల్‌లో 'సహృదయ సాహితీ సాంస్కృతిక సంస్థ' 2015 సాహిత్య పురస్కారాన్ని అందుకుంటున్న డా. లక్ష్మణ చక్రవర్తి. చిత్రంలో ఆచార్య బన్నా ఐలయ్య, కోవెల సుప్రసన్నాచార్యులు, సంస్థ అధ్యక్షులు ప్రసాద్, వరంగల్ పోలీసు కమిషనరు సుధీర్‌బాబు, కృష్ణమూర్తి, ఒద్దిరాజు వేణుగోపాలరావు (ఎడమ నుంచి)

గుసగుసలు పోవడం నాకు తెలుసు.

ఆ క్షణాన్ని నేనెన్నటికీ మర్చిపోలేను. మళ్ళీమళ్ళీ గుర్తొస్తుంటుంది. అప్పుడు నేనేం చేశాను? మీర్జాని కాపాడ్డానికి ఇంకేం మార్గాలున్నాయని పదేపదే ఆలోచిస్తుంటాను. కానీ, ఏమీ లేవు. మీర్జా ఏం చేస్తాడో, నేనేం చేయాలని అతననుకుంటాడో సరిగ్గా అలాగే చేశాను.

తోటివారి కష్టాలు నావే అనుకుంటాను. నా దుఃఖం నేను ఏర్పర్చుకున్నది. కానీ మా వదినలు, వారి పిల్లలు అనుభవించే దుఃఖం అలా కాదు గదా అనిపిస్తుంది. నాకు తెల్సు నా మీర్జా నన్నర్థం చేసుకున్నాడు, ఆమోదించాడు. అంతిమ క్షణాల్లో నన్ను క్షమించాడు. అందుకే నాకు స్థిమితంగా వుంటుంది. ఇతర్లు నా గురించి ఏమనుకున్నా ఖాతరుచేయను. ఒకవేళ ఇదంతా పునరావృతమై మళ్ళీ అనుభవించాల్సి వస్తే.. అప్పుడు కూడా నేనలాగే చేస్తాను. మీర్జా బాణాలు తప్పకుండా విరిచేస్తాను.

నాకింకో సంగతి కూడా తెల్సు. ఒకవేళ మీర్జాతోబాటు నేను కూడా చనిపోయుంటే తర్వాతందరూ మా ప్రేమ మహత్తరమైందని, హీర్ అత్త, రాంఝూల్లాగా మీర్జా నేను మహనీయులమని అభివర్ణిస్తూ పాటలు పాడేవారు. కానీ నాకెన్నటికీ ఆమోదమైంది కాకపోయినా బతకడానికి నిర్ణయించుకున్నాను. 'నమ్మకద్రోహి! ప్రేమికుణ్ని శత్రువులకు అప్పజెప్పిన నయవంచన' లాంటి దూషణలను గుర్తుచేసుకుంటూ నాకు నేను శిక్ష విధించుకున్నాను.

కానీ, నిజం చెప్పాలంటే నా ప్రియసఖుడు చనిపోయిన తర్వాతే అతనికిష్టమైనట్టుగా జీవిస్తున్నాను. మీర్జా ఎలా మాట్లాడేవాడో, దేన్నికైనా ఎలా ఆమోదముద్ర వేస్తాడో, ఏం మాట్లాడ్తే గర్వపడ్తాడో అలా మాట్లాడ్తున్నాను. నేను అతని దాన్నయ్యాను. నా ద్వారా మీర్జా ఇంకా బతికేవున్నాడు. ఏ ప్రేమికురాలైనా ప్రియసఖుని కోసం ఇంతకంటే ఏం చేయగలదు? ©

# ఆవిష్కరణలు



హైదరాబాద్ రవీంద్రభారతిలో అక్టోబరు 15న కిన్నెర ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్యంలో జరిగిన 'వెయ్యినొక్క నవలల కొవ్వలి' గ్రంథ ఆవిష్కరణ సభలో మద్దాళి రఘురామ్, వేదగిరి రాంబాబు, గుడిపూడి శ్రీహరి, జగన్నాథశర్మ, రావి కొండలరావు, వోలేటి పార్వతీశం, ద్వానా శాస్త్రి



రాయగడలో అక్టోబరు 8న రాయగడ రచయితల సంఘం నిర్వహించిన 'శ్రీరామవాణి' గ్రంథావిష్కరణ సభలో ఆంధ్రప్రదేశ్ ఉపసభాపతి మండలి బుద్ధప్రసాద్, సింగిడి రామారావు, విద్యాసాగర్, ఆనందరావు పట్నాయక్, రచయిత బాబూరావు మహంతి, విజయచంద్ర, నగేష్



'లేఖిని' సంస్థ, శ్రీవేదగిరి కమ్యూనికేషన్స్ సంయుక్త ఆధ్వర్యంలో అక్టోబరు 14న హైదరాబాద్ సుందరయ్య విజ్ఞానకేంద్రంలో జరిగిన కార్యక్రమంలో డా. కె.వి. రమణ 'అమృతవర్షిణి'ని ఆవిష్కరిస్తున్న విహారి, ఆలూరి విజయలక్ష్మి, పోరంకి దక్షిణామూర్తి, రావులపాటి సీతారాంరావు, వేదగిరి రాంబాబు, చంద్రప్రతాప్, అంబటిపూడి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

నవలావలోకనం 37

డా. పి. శ్రీదేవి

# కాలాతీత వ్యక్తులు

నిర్వహణ :

**వి. రాజారామమోహనరావు**

**ప్రధానంగా ముగ్గురు యువతులు, ముగ్గురు యువకుల మధ్య నడిచిన కథ ఈ నవల. కథా కాలం 1950వ దశకం. అప్పటికాలాన్ని దాటి, దూరదృష్టితో ఈనాటి జీవనరీతిని ప్రతిష్ఠించిన నవల ఇది. మనస్తత్వ చిత్రణ, మనోభావాల సంఘర్షణ, మంచిచెడ్డల బేరీజు, ఉద్వేగాలు, నిర్లక్ష్యధోరణి.. ఇలా అనేకానేక జీవన పార్శ్వాలని కళ్ళముందు నిలిపి, పాఠకులకి కొత్తలోకాన్ని చూపించింది. ఇందిర, కళ్యాణి, వసుంధర.. ప్రకాశం, కృష్ణమూర్తి, డాక్టరు చక్రవర్తి.. ఈ ఆరుగురి మధ్య గడిచిన ఘటనల సమాహారం 'కాలాతీత వ్యక్తులు'. ఈ ఆరుగురి పరస్పర అనురాగాలు, వ్యామోహాలు, కలతలు, విముఖతలు.. మళ్ళీ వేరొకరితో సంబంధాలు, వీటన్నింటి వెనుక ఒకమూసలో ఒదగని వీరి విలక్షణ మనస్తత్త్వాలు.. చివరికి వారివారి తత్త్వాలకి అనుగుణంగా కుదుటపడటం.. ఈ నవలా స్వరూపం. వాళ్ళ జీవితాలు మనతో కలిసిపోయినట్టు, అవేమైపోతాయో అన్న దిగులు మనని ఆవరించి, చివరిదాకా ఆసక్తికరంగా చదివిస్తుంది.**

ఇందిరకి గవర్నమెంట్ ఉద్యోగం. ఆమె తండ్రి ఆనందరావు. కూతురి సంపాదన మీద బతుకుతుంటాడు. మెడికల్ కాలేజీలో చదువుతున్న ప్రకాశం, ఇందిర వాళ్ల ఇంటి పైభాగంలో అద్దెకి ఉంటున్నాడు. ఇందిరకి చొరవ ఎక్కువ. ప్రకాశం తన పని తను చూసుకునే రకం. అయినా కొద్దికాలంలోనే నువ్వు అని పిలవటం, తనని ఏకవచనంలో పిలిపించుకోవటం ప్రకాశానికి అలవాటు చేసింది. బీచ్‌కి తీసికెళ్ళటం, కలిసి భోంచెయ్యటం సాధారణమైంది.

ప్రకాశం స్నేహితుడు కృష్ణమూర్తి. బాగా డబ్బున్నవాడు. సరదాగా కాలక్షేపం చేస్తుంటాడు. ప్రకాశం ద్వారా ఇందిరతో పరిచయమేర్పడుతుంది. ఇందిర అతనితోనూ చనువుగానే వుంటుంది. కృష్ణమూర్తికీ అది నచ్చింది.

కళ్యాణి- ఇందిర స్నేహితురాలు. గతంలో క్లాస్‌మేట్! స్థిరమైన ఆదాయం లేని కుటుంబం ఆమెది. కట్నం ఇచ్చి పెళ్ళి చెయ్యలేక కూతుర్ని చదివిస్తున్నాడు ఆమె తండ్రి. ఖర్చు తగ్గుతుందని హాస్టల్‌లో వున్న కళ్యాణిని తనింటికి మారమంది ఇందిర. కళ్యాణి అలాగే చేసింది. కళ్యాణిని చూసీచూడగానే, ఆమె నెమ్మదితనం, మృదుత్వం ప్రకాశాన్ని ఆకర్షించాయి. ఆమెతో మాట్లాడాలన్నా, కలిసిగడపటమన్నా ఇష్టంగా మారిందతనికి. కళ్యాణికి టైఫాయిడ్ జ్వరం రావటంతో ప్రకాశం, ఇందిర ఆమెని మెడికల్‌కాలేజి హాస్పిటల్‌లో చేర్చారు. ప్రకాశం దగ్గరుండి చూసుకున్నాడామెను. ప్రకాశానికి, కళ్యాణికి పరస్పరం ప్రత్యేక అభిమానం, మమకారం ఏర్పడ్డాయి.

ఒకవైపు ఇందిర, మరోవైపు కళ్యాణి ప్రభావం ప్రకాశం మీద బలంగా పడుతున్నాయి. ఇందిరలో మాటకారితనం వుంది. చొరవగా స్పృశిస్తుంది. కళ్యాణి నవ్వులో అభిమానం కురుస్తుంది. ఆమె చూపుల్లో ఏదో బాంధవ్యం ఉందనిపిస్తుంది. ప్రకాశానికి ఉక్కిరిబిక్కిరిగా వుంది. కల్యాణి, ప్రకాశంల మధ్య జరిగిన సంఘటనలతో చివరికి ఆమెతోనే తన జీవితం అనుకున్నాడు ప్రకాశం. కళ్యాణి భావనలూ అలాగే వున్నాయి.

ఒకరోజు తండ్రి దగ్గర నుంచి వచ్చిన ఉత్తరం వల్ల దిగులుగా వుంది కళ్యాణి. ప్రకాశం చొరవతో ఉత్తరంలోని విషయాలతో పాటు, తన గతం చెప్పుకొచ్చింది. కళ్యాణి పుట్టగానే ఆమె తల్లి మరణించింది. అప్పటి నుంచి కూతురే ఆ తండ్రికి లోకమైంది. కూతుర్ని చదివించాలని

తాపత్రయం. అందుకోసం నానాప్రయాస పడ్డాడు. ఉన్న ఒక్క ఇల్లు అప్పులవల్ల వేలానికి వచ్చింది. అతని ఆరోగ్యమూ బాగాలేదు. చదువు సాగుతుందో? లేదో? భవిష్యత్తు అయోమయం.

ప్రకాశం చిన్నతనంలోనే తండ్రి పోయాడు. పదెకరాల పొలం ఉంది. ప్రకాశాన్ని తీసుకుని అన్నగారి పంచన చేరింది తల్లి. ప్రకాశం మేనమామ వాళ్ళ ఆస్తిని మింగటమేకాక, దయతో ప్రకాశాన్ని చదివిస్తున్నట్టు ప్రవర్తిస్తుంటాడు. ఏ నెలకి ఆ నెలే డబ్బులేదంటాడు. అందువల్ల ప్రకాశం చదువు ఏక్షణాన్నైనా ఆపేయవచ్చు. పరస్పరం తమ దైన్యస్థితి చెప్పుకోవటంవల్ల కళ్యాణి, ప్రకాశం మనసులు మరింత దగ్గరై ఒకరికొకరు తోడు అనుకున్నారు.

తండ్రికి సీరియస్‌గా వుందని కళ్యాణికి ఉత్తరం వచ్చింది. ఇందిర, ప్రకాశం ఆమెని రైలెక్కించారు. తిరిగి కళ్యాణి వస్తుందో రాదోనన్న సందేహంతో ప్రకాశం దిగులుగా ఉన్నాడు. అది గమనించిన ఇందిర, కళ్యాణి లేకపోతే అంత బెంగా? అని దెప్పింది. "ఉంటారులే లోకంలో నంగనాచులు. విశాలమైన కళ్ళుతిప్పి, వలవల ఏడ్చేస్తే నీలాంటి జాలి గుండె మగవాళ్ళు ఆదుకుంటారు, నేను నిలబడి ఇంకొకరికి బలమివ్వాలనే తత్త్వం నాది" అంది ఇందిర. అలా కళ్యాణి ధ్యాసలో వున్న ప్రకాశాన్ని తన జాణతనంతో విచలితుడ్ని చేసింది. యవ్వనోద్రేకంలో ప్రకాశం మునిగిపోయాడు. అతని దృష్టి చెదిరిపోయింది.



తండ్రి మరణంతో కళ్యాణి పూర్తిగా ఒంటరైపోయింది. ఊరి మునసబు రామినాయుడు కళ్యాణిని కన్నకూతురిలా ఆదరించాడు. అన్ని రకాలుగా ధైర్యం చెప్పి రైలెక్కించాడు.

ప్రకాశం పూర్తిగా ఇందిర మోజులో పడిపోయాడు. ప్రకాశం తీరని అన్యాయం చేశాడని కళ్యాణికి తెలుసు. ఆ అపరాధభావన అతనిలోనూ ఉంది. కానీ ఇందిర ఎంతో నైపుణ్యంగా కళ్యాణి పట్ల అతనిలో విముఖత్వం కలిగించింది. ఒంటరిగా రైలెక్కిన కళ్యాణికి ప్రయాణంలో క్లాస్‌మేట్ వసుంధర కనిపించింది. ఆమె ఓదార్పుతో కొంత ధైర్యం తెచ్చుకుంది. ఎప్పుడైనా సరే కళ్యాణి వచ్చి తనతో తనింట్లోనే ఉండొచ్చునని ఆహ్వానించింది వసుంధర.

ఇల్లు చేరిన కళ్యాణికి కొద్దిగంటల్లోనే అర్థమైపోయింది ప్రకాశం, ఇందిర ఒక్కటని. తనింక ఆ ఇంట్లో ఉండటం నరక సమానమని రాత్రికి రాత్రే వసుంధర దగ్గరికి వెళ్లిపోయింది కళ్యాణి.

ఈ నవలలో వ్యక్తుల మనస్తత్త్వాలు, ప్రవర్తనా తీరే ప్రధాన దినుసులు. చాలీచాలని జీతంరాళ్ళతో నెట్టుకొచ్చే పరిస్థితితో ఇందిరకెప్పుడూ రాజీ కుదరలేదు. చుట్టూ వుండే పరిస్థితులు, వ్యక్తులు ఆమెకి నచ్చేలాగే వుండాలి. అందుకేం చేయడానికైనా సిద్ధం. తండ్రి ఆనందరావు అలాంటి జీవితాన్ని అడ్డదారిలో జయించేశాడు. క్షణం గడవటంకోసం ఎవరినైనా వాడుకోగలడు, కూతురితో సహా! ఆమె అర్ధరాత్రిళ్ళు ఎవరితో, ఎక్కడికెళ్ళినా పట్టించుకోడు.

నాలుగుతరాల వరకూ తరిగిపోని ఆస్తి కృష్ణమూర్తిది. ఇందిర ఇన్నాళ్ళూ అతనికొక ఆటబొమ్మగా కన్పించింది. హాయిగా ఆడుకున్నాడు. అలా అని అతను దుర్మార్గుడు కాదు. అతని వల్ల ఎవరికీ ఏ హానీ జరగలేదు. కళ్యాణి అంటే అతనికి మంచి అభిప్రాయం. సుతిమెత్తని మనిషన్న నమ్మకం. కళ్యాణి ఇల్లు వదిలి వెళ్ళేలా చేశారని ఇందిర, ప్రకాశాలమీద అతనికి కోపమొచ్చింది. ఆమెను ఆదుకోవాలని అతని తపన.

ఆ కాలానికి అతీతమైన మనస్తత్త్వమే వీళ్లందరిది. సంప్రదాయానికి తలవంచి బానిసల్లా బతుకుతున్న ఆ కాలంలో ఇటువంటి స్వతంత్ర ప్రవర్తనతో ఉన్న పాత్రల్ని పాఠకులు అమితంగా ఆదరించారు. 1950వ దశకంలోనే ఇప్పటి జీవన విధానాన్ని ఊహించగలిగిన రచయిత్రి పి. శ్రీదేవి ముందుచూపు పాఠకుల కళ్ళు మిరుమిట్లు గొలిపేలా చేసింది.

ప్రకాశం మేనమామ శేషావతారం తనకి అందిన ఆకాశరామన్న ఉత్తరంతో వాల్తేరు వచ్చాడు. ప్రకాశాన్ని, కృష్ణమూర్తిని, ఇందిర, ఆనందరావులని దుమ్ము దులిపేశాడు. ప్రకాశం చదువుకి ఇంక పంపడానికి డబ్బులేదని వెంటనే ఊరు రమ్మని ఆర్డరు వేసి వెళ్ళాడు.

# క్రాంతదర్శిని శ్రీదేవి



కథా రచయిత్రిగా, గేయ రచయిత్రిగా పేరొందారు డా.పి. శ్రీదేవి. ఎం.బి.బి.యస్ చదివి గుడివాడ ప్రభుత్వ ఆసుపత్రిలో కొంత కాలం పనిచేశారు. తర్వాత సొంతంగా ప్రాక్టీసు పెట్టుకున్నారు. 'తెలుగు స్వతంత్ర'లో అసిస్టెంటు ఎడిటర్‌గా పని చేశారు. 1929లో జన్మించిన శ్రీదేవి 1961లో అనారోగ్యంతో కన్నుమూశారు. ఈమె రాసిన ఒకే ఒక నవల 'కాలాతీతవ్యక్తులు' తెలుగు సాహిత్యచరిత్రలో మైలురాయిగా నిలిచింది. 'తెలుగు స్వతంత్ర'లో 7-9-1957 నుంచి 25-1-1958 వరకు 21 వారాలు ధారావాహికగా వచ్చింది ఈ నవల. 1958లో పుస్తకంగా వెలువడింది. ఆకాశవాణిలో 1960లో నాటికగా ప్రసారమైంది. 'చదువుకున్న అమ్మాయిలు' పేరుతో చలన చిత్రంగా కూడా రూపొందింది. స్త్రీ స్వేచ్ఛనే కాదు, స్త్రీ వాదాన్ని కూడా ఎన్నో దశాబ్దాల ముందుగానే నిర్వచించి, చర్చించిన నవల ఇది. ఆ కాలం నాటి సంప్రదాయాలు, ఆచారాలకు భిన్నంగా ఈ నవల కథా వస్తువును ఎంచుకోవడం భవిష్యద్దర్శనానికి నిదర్శనం!

కృష్ణమూర్తికి అనుకోకుండా కళ్యాణి కనపడింది వసుంధరతోపాటు. అతనోసారి కళ్యాణిని చూడ్డానికి వసుంధర ఇంటికి వెళ్లాడు. కళ్యాణి కోసం వచ్చిన రామినాయుడుకు అకస్మాత్తుగా గుండెపోటు రావటంతో తన స్నేహితుడు డాక్టర్ చక్రవర్తిని తీసుకొచ్చాడు కృష్ణమూర్తి. హాస్పటల్‌లో చేర్పించినా ఫలితం దక్కలేదు. ఆయన చనిపోయాడు. కళ్యాణికి చక్రవర్తికి పరస్పరం అభిమానం ఏర్పడింది. వసుంధరకి కృష్ణమూర్తి నచ్చాడు. మేనమామ ఎత్తుగడకి ప్రకాశం మారిపోయి ఓ డబ్బున్న అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. కొన్ని పరిస్థితులవల్ల కళ్యాణి చక్రవర్తి దగ్గరికి వచ్చేసింది.

ఈ నవలలో ఈ జంటల మధ్య ఇన్ని రకాల మార్పులు జరిగినా అన్నీ సటిటే అనిపిస్తాయి. ఇందిరంటే పూర్తి విముఖతతో వున్న కృష్ణమూర్తికి ఓ రాత్రి తారసపడిందామె. బలవంతంగా ఇంటికి తీసుకెళ్లింది. ఇందిర తండ్రి ఆనందరావు జైల్లో వున్నాడు. అపుడు తండ్రి జీవితమంతా చెప్పింది ఇందిర.

అందరి పిల్లలకి పెద్దలు దిక్కు. కానీ ఇందిరే తండ్రికి గార్డియన్. తండ్రి జైల్లో వున్నా సినిమా కెళ్లింది ఇందిర. కృష్ణమూర్తితో కులాసాగా గడపగలుగుతోంది. ఆమె తీరే అంత. ఆమెకి పరిస్థితుల మీద ఓ రకం కసి, తనమీద తనకి విపరీతమైన ధీమా. ఆమె ఓ రకంగా విచలితంగా వుంటే, కృష్ణమూర్తి వసుంధర విషయంగా అస్థిమితంగా వున్నాడు. ఇద్దర్నీ ఆ రాత్రి ఏకం చేసింది. ఇందిరను పొందిన కృష్ణమూర్తి ఆలోచనే మారిపోయింది. ఆమెని పెళ్లిచేసుకోవాలని నిర్ణయించుకున్నాడు. చక్రవర్తి, కళ్యాణిల అనుబంధం బలపడింది. ఈ రెండు జంటలు తిరుపతి వెళ్లి పెళ్లిచేసుకోటం నవలకు ముగింపు.

నవలలో కథకన్నా, కథ చెప్పిన తీరు, వ్యక్తులను వివరించిన, విశ్లేషించిన విధానం గొప్పవి. అందుకే కథ తెలుసుకుంటే చాలదు. నవలని చదివి ఆస్వాదించాలి. ఈ నవలకి పూర్తి విభిన్నతని సాధించింది ఇందిర పాత్ర. అలాగని మిగిలిన పాత్రలు తక్కువేం కాదు. ఆ కాలాన్ని సవాలు చేసినవే.

మంచి గుణగణాలు కలిగిన యువతీయువకులే నవలల్లో హీరో హీరోయిన్లుగా ఉన్న నవలలు వస్తున్న కాలంలో కాలాతీతవ్యక్తులు రచన ఓ సాహసం, ఓ రచనా విప్లవం!

మగవాడికి ఎదురులేని ఆ కాలంలో 'ఈ వెధవ ప్రపంచం ఎప్పుడూ ఇలాగే వుంటుందేమో. అంచేత వేటికోసమూ బెంగపెట్టుకోకుండా హాయిగా ఎక్కడికక్కడ సదుపాయంగా బతకటమే నా ఆశయం' అనే ఇందిర పాత్ర కల్పన అసాధారణం! 'బతుకులో నాకు కావల్సిందొకటి.. దొరుకుతున్నది ఇంకోటి. అంచేత కసికొద్దీ లోకాన్ని ధిక్కరిస్తున్నాను', 'ఏ పని చేసినా నేను కళ్ళు తెరిచే చేస్తాను. ఏడుస్తూ ఏదీ చెయ్యను. ఏం జరిగినా ఏడవను' ఇవన్నీ ఇందిర భావాలు. స్వతంత్రంగా బతకాలన్న ఇచ్ఛ కళ్యాణి, వసుంధర, వైదేహిలో కూడా పుష్కలంగా వున్నాయి. అప్పటి సమాజాన్నే కాదు, రాబోయే కాలపు సమాజాన్ని అక్షర బద్ధం చేసిన రచన ఇది! ©

# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
ఉపన్యాసశిరోమణి, అభినవ వ్యాస
డా. కె. రామానుజాచార్య
సమాధానాలు



ప్ర. దశావతారాల్లో మత్స్య, కూర్మ, వరాహాది అవతారాలు నిర్దిష్టమైనదానికి ఉద్దేశించి ఉన్నాయి. మరి శ్రీకృష్ణునికి, బలరామునికి అవతార లక్షణాలు ఆపాదించడంలో నిగూఢార్థం ఏమిటి?

**– డా. ధరణీ పార్థసారథి,**
**నల్లకుంట, హైదరాబాద్**

జ. శ్రీకృష్ణ బలరాములకు అవతార లక్షణాలు ఆపాదించడమేమిటి? ఎవరు చెప్పారు? మీరన్నట్లు మత్స్యకూర్మాదులు భగవంతుని అవతారాలే! శ్రీకృష్ణుడో సాక్షాత్తు భగవానుడే! అవతారం కాదు. మన మీద దయతో, ప్రేమతో, వాత్సల్యంతో మనలను చక్కదిద్దాలని తప్పులను సరిచేసి ఉత్తమ మార్గంలో నడిపించాలని మనలో ఒకనిగా వచ్చాడు. మనకోసం అన్ని నిందలూ పడ్డాడు. అన్ని నిష్ఠూరాలు పడ్డాడు. శ్రీకృష్ణభగవానుడు మన ప్రాకృత బుద్ధికి అర్థం కాడు. పెద్దల ద్వారా విని అర్థం చేసుకోవాలి. బలరాముడు సాక్షాత్తు ఆదిశేషుని అవతారం. అంటే సంకర్షణుడు. సంకర్షణ అంటే చక్కగా లాగి తీసుకొని వచ్చి కూర్చేవాడు. జీవులందరికి వారివారి కర్మలను వారివారి జన్మలతో ఫలితాలను కూర్చేవాడు అని అర్థం. పరమాత్మ సేవింపబడేవాడిగా, సేవించేవాడిగా రెండు రూపాలలో మనకు సేవారూపాన్ని ఉపదేశించేవాడు. రామావతారంలో ఆదిశేషుడు లక్ష్మణునిగా పుట్టి రామునికి సేవ చేశాడు. దానికి ప్రత్యుపకారంగా కృష్ణావతారంలో ఆదిశేషుని అన్నగా అవతరింప చేసి తానే సేవ చేశాడు. సేవ్య సేవక భావనాబంధాన్ని లోకానికి ఉపదేశించడమే ఆదిశేషుని ఈ అవతార రహస్యం.

ప్ర. పాండురాజు మరణించాక తన దేహాన్ని ఆరగించమని ఐదుగురి సంతానానికి చెప్పాడని, అందుకు పెద్దవాళ్లు అంగీకరించలేదని, సహదేవుడు మాత్రం చిటికెన వేలు తిన్నాడని, మిగతా అవయవాలు తినకుండా శ్రీకృష్ణుడు ఆపాడని చదివాను. దీనిలో ఆంతర్యం?

**– కరణం శివానందరావు, కర్నూలు**

జ. ఈ కథ వేదవ్యాస భగవానుడు రచించిన మహాభారతంలో లేదు. ఇటువంటివి ఇతర గ్రంథాల నుండి తీసుకుని ప్రచారం చేస్తుంటారు. వాస్తవ గాథల కంటే కల్పితాలంటే ఆసక్తి ఎక్కువ కదా! ఒక మానవ శవ శరీర భాగాన్ని తినటం, అలా తండ్రి ఆజ్ఞాపించడం.. పాండురాజు మరణించినప్పుడు శ్రీకృష్ణుడెక్కడున్నాడు? ఆ ప్రాంతానికి వచ్చాడా? అప్పుడు అతని వయసెంత? పాండురాజు శరీరానికి అంత్యక్రియలు ఎక్కడ చేశారు? ఎవరు చేశారు? హస్తినాపురానికి ఋషులు ఏమేం తీసుకొచ్చారు? హస్తినాపురంలో జరిగిన అంత్య సంస్కారం ఏమిటి? శతశృంగ పర్వతముల మీద జరిగిన అంత్యక్రియలు యేమిటి? ఇవన్నీ మహాభారతం ఆదిపర్వంలో స్పష్టంగా ఉంది. సంస్కృతం తెలియకున్నా తెలుగు అనువాదాలు చాలా ఉన్నాయి. శ్లోకాలు-అనువాదాలు కూడా ఉన్నాయి.

ప్ర. కురుక్షేత్ర సంగ్రామంలో ద్రోణాచార్యుడు పద్మవ్యూహం పన్నితే దుర్యోధనుడు, కర్ణుడు, తదితరులు ధర్మవిరుద్ధంగా అభిమన్యుని వధించారు. ఒక్క సైంధవుడినే వధిస్తానని అర్జునుడు ఎందుకు శపథం చేశాడు?

**– ఎన్. లక్ష్మీనాంచారమ్మ, విజయవాడ**

జ. యుద్ధంలో సేనాధిపతి వ్యూహం పన్నడం, శత్రువులతో యుద్ధం చేయటం, యుద్ధంలో ఓడించటం, ఓడించటానికి ప్రయత్నించటం యుద్ధధర్మం. అది తప్పుకాదు. అయితే వ్యూహం

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

# చతుర ప్ర.జ.6



ఆచార వ్యవహారాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ఉపన్యాసశిరోమణి, అభినవవ్యాస **డా. కె. రామానుజాచార్య** ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారు. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

**చిరునామా : చతుర ప్ర.జ.** చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ - 082

పన్ని యుద్ధానికి ఆహ్వానించినప్పుడు యుద్ధాన్ని చేయాలని ఉత్సాహంతో ముందుకు వచ్చే వీరులను యుద్ధానికి రాకుండా ఆపటం మహాపరాధం. అది యుద్ధ ధర్మానికి విరుద్ధం. అలా ధర్మరాజు భీమ నకుల సహదేవులను పద్మవ్యూహంలోనికి ప్రవేశించకుండా ఆపిన వాడు సైంధవుడు. ఆ నలుగురే వచ్చి ఉంటే అభిమన్యునికి అంతటి దారుణమైన మృతి కలిగేది కాదు. ఆ పనికి కారణమైన సైంధవుని వధిస్తానని ప్రతిజ్ఞ చేయటానికి అదే కారణం. ఒకరోజు మొత్తం అర్జునుని తప్ప తక్కిన నలుగురిని ఆపగలిగే వరం శివుని ద్వారా పొంది మరీ ఆపాడు. దైవారాధనను, దైవధ్యానాన్ని, తపస్సును ధర్మాన్ని సాధించటానికి ఉపయోగించాలి. అధర్మాన్ని సాగించటానికి ఉపయోగిస్తే జరిగే పరిణామమిది. అధర్మం కోసం, అధర్మ ఫలం కోసం సాగించే ధర్మకార్యం కూడా అధర్మమే అవుతుంది. ధర్మాధర్మ నిర్ణయాలు, ఫలం, ఆశయం- సర్వలోకహితం, సర్వలోకరక్షణపై ఆధారపడి ఉంటాయి.

ప్ర. రావణుడు మహాతపశ్శక్తి సంపన్నుడు కదా? పరస్త్రీలను అపహరించడం తప్పని తెలీదా? తెలిసీ తప్పు చేశాడా?

– బిక్కునూరి రాజేశ్వర్,
నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా

జ. తప్పు చేసే వారందరూ తప్పు తెలియక చేస్తున్నవారు కాదు. తప్పును ఒప్పుగా చూపటానికి ప్రయత్నిస్తారు. రావణుడు పరస్త్రీ హరణం, పరస్త్రీ గమనం రాక్షసులకు ధర్మమని మరీ సీతమ్మతో తన ప్రవృత్తి ధర్మమని నిరూపించటానికి ప్రయత్నించాడు. రావణాసురుడు ఒక తపస్సంపన్నుడే కాదు. సకల శాస్త్రపండితుడు కూడా! జ్యోతిష్యశాస్త్రంలో మంచి పండితుడు. నాట్య, సంగీత, వ్యాకరణశాస్త్రాల్లో పండితుడు. వేదానికి వ్యాఖ్యానం రాసిన మహావిద్వాంసుడు. అయినా ఇంద్రియాల వద్ద ఓడిపోవటం పండితులకు, పామరులకు సమానమే.

'ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః' అని గీతాచార్యుడు చెప్పిన మాట ఇదే. ఇంద్రియాలు మనస్సును మథనం చేస్తాయి. మనస్సును హరిస్తాయి. ఇంద్రియాలు మనస్సును హరిస్తే నిగ్రహమేమిచేస్తుంది? అనేది గీతాచార్యుల మాట! విశ్వామిత్రుడు, కీచకుడు, సైంధవుడు.. ఇలా చాలామంది ఇంద్రియాలకు ఓడిపోయినవారే. మండోదరి రావణాసురుని కళేబరం ముందు రోదిస్తూ 'ఇంతవరకూ నీవు ఇంద్రియాలను గెలిచి లోకాలను గెలిచావు. నీవు గెలిచిన ఇంద్రియాలే నీ మీద పగబట్టి నిన్ను ఓడించాయి. నిన్ను రాముడు చంపలేదు. నీ ఇంద్రియాలే చంపాయి. నాలో లేని ఏ ప్రత్యేకత సీతలో ఉంది? కేవలం నీ వ్యామోహం తప్ప!' అని విలపిస్తుంది. తప్పుచేసేవారందరూ జ్ఞానం, బుద్ధి, వివేకం, విజ్ఞానం లేనివారు కారు. ఇంద్రియ బలం లేనివారు. క్షణికావేశంలో, క్షణిక వ్యామోహంలో అన్నీ కోల్పోయి అపరాధాలను చేస్తారు.

ప్ర. వినాయకునికి పెట్టిన నైవేద్యాన్ని విద్యార్థినీ విద్యార్థులు తినరాదని ఎందుకంటారు?

– కె. సుబ్రహ్మణ్యకుమార్, కర్నూలు

జ. ఇవన్నీ అపోహలు, అపార్థాలు మాత్రమే! వినాయకుడు విద్యాధిదేవతగా ప్రసిద్ధుడు. విద్యాధిదేవత ప్రసాదాన్నే విద్యార్థులు తినకూడదంటే ఇక ఆ ఆరాధనకు అర్థమే లేదు. భగవంతుని ఆరాధించి తీర్థప్రసాదాలు తీసుకోకుంటే కలిగే

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. దేవతలకు మృత్యువు లేనపుడు దేవగురువు బృహస్పతి తన కుమారుడు కచుని మృతసంజీవనీ విద్య నేర్చుకోమని శుక్రాచార్యుల వద్దకు పంపవలసిన అవసరమేముంది? శుక్రాచార్యులు తన విద్య ద్వారా రాక్షసులను ఎందుకు బతికించలేదు?

**- ఎస్. ప్రసాద్,** చెన్నై

**జ.** తనకు రానిది ఇంకొకరికి వచ్చి ఉంటే అతను తన కంటే గొప్పవాడనిపించుకుంటాడు. దాన్ని జీవప్రకృతి సహించలేదు. అది మానవులకు, దేవతలకూ సమానమే. తనను మించినవారు ఇంకొకరు ఉండరాదు అనేది మానసిక బలహీనత. ఇది ఒక కారణం. అంతే కాక మరణం ఇప్పుడు లేదు. ఎపుడూ ఉండదు అనే భరోసా ఎక్కడ? ఏ స్థితీ శాశ్వతం కాదు. రేపు మృత్యువు రావొచ్చు. కొంతకాలం సంతానవంతులైన దేవతలు పార్వతి శాపం వలన సంతాన హీనులు కాలేదూ! అలాగే ఏ రుషి శాపంతోనయినా మరణం సంభవిస్తే..? అని ముందు జాగ్రత్త. మరొక రహస్యం ఉన్నది. శుక్రాచార్యుల పుత్రిక దేవయాని యయాతి భార్య కావాలి. వారికి యదువు కలగాలి. ఆ యదువంశంలో భగవానుడు అవతరించాలి. ఇది జరగాలంటే దేవయానికి కచ శాపం కావాలి. బ్రాహ్మణుడు భర్తగా లభించ కూడదని. దేవకార్యాలు ముందు చూపుతో ఉంటాయి. అందుకే వాటిని దేవరహస్యాలంటారు. ఒక్కోసారి దేవతలకే తెలియవు. దేవదేవుడు జరిపిస్తుంటాడు.

శుక్రాచార్యుడు త్రికాలజ్ఞుడు. అకాల మృత్యువు వచ్చిన వారినే బతికించగలుగుతాడు. నియత మృత్యువును అతిక్రమించ జాలడు. ఆపజాలడు. విధికి వ్యతిరేకంగా ప్రవర్తించి తాను పాపాన్ని మూటకట్టుకోజాలడు.

---

ఫలాన్ని సత్యనారాయణవ్రత కథ మనకు చెపుతోంది. అంతేకాదు, చాలామంది ఏకాదశీ ఉపవాసవ్రతం ఆచరిస్తారు. దైవదర్శనం కోసం దేవాలయానికి వెళ్తారు. అక్కడ ప్రసాదమిస్తే ఉపవాసమని తీసుకోరు. ఈ ఉపవాసం, ఈ వ్రతం ఎవరి కోసం? ఆ భగవానుని అనుగ్రహం కోసమే కదా! ఆ భగవానుని అనుగ్రహం కోరి వ్రతం ఆచరిస్తూ, ఆ భగవానుని ప్రసాదాన్నే తిరస్కరించడం ఆయన అనుగ్రహాన్ని కలిగిస్తుందా?

**ఏకాదశ్యాం ఉపోషిత్వా ప్రసాదం యః పరిత్యజేత్**
**నారాయణస్య తథా శివస్యచ మహాత్మనః**
**రౌరవం నరకం తస్య సత్య ఏవ భవిష్యతి!**

అని స్కాందపురాణ వచనం. అందువలన అన్ని వ్రతాలు, ఆరాధనలు భగవానుని అనుగ్రహానికే! ఆరగింపు చేస్తే భగవానుడు తినడు. భక్తులే తినాలి. దీనిని గమనించి ప్రవర్తించుట హితం.. ప్రియం కూడా!

ప్ర. సాయిబాబాను దేవుడని కొందరు, కాదని కొందరు వాదిస్తున్నారు. సత్యం ఏమిటి?

**- ఆమంచర్ల సరస్వతి,** హైదరాబాద్

**జ.** దేవుడా? కాదా? అనే వివాదంలో అర్థం లేదు, అవసరం లేదు. గట్టి విశ్వాసంతో ఒక రాయిని ఆరాధించినా ఫలితం తప్పదు. భావప్రధానం సర్వత్ర. శివపురాణంలో ఒక చక్కని కథ ఉంది. శివభక్తుడైన ఒక రాజు- 'శివరాత్రినాడు లింగోద్భవకాలంలో ఎక్కడివారు అక్కడే ఉండి, ఎదురుగా ఏది లింగాకారంలో కనిపిస్తే దాన్నే ఆరాధించండి!' అని శాసనం చేశాడు. చాటింపు వేయించాడు. అలా చాటించిన రోజే రాజ వేశ్య సమీపంలో ఉన్నాడు. తన శాసనాన్ని చాటింపు చేయగా లేచాడు. ఉన్నచోటే ఆరాధించాలి. కదల కూడదు. అది తన శాసనమే! తన శాసనాన్ని తానే ఉల్లంఘించరాదు కదా! అని ఎదురుగా చూచాడు. ఆ వేశ్య స్తనం సమున్నతంగా, లింగాకారంగా కనిపించింది. ఆ స్తనాన్ని లింగంగా భావించి ఆరాధించాడు. కైలాసాన్ని పొందాడు. అంతేకాదు ఆ ప్రదేశం ఈనాటికీ ఆచంటేశ్వర క్షేత్రంగా ప్రసిద్ధిపొంది కోట్లాది భక్తుల పూజలందుకుంటోంది. స్తనం దేవుడేమిటి? కాదు! అని వాదిద్దామా? ఎదుటివారి విశ్వాసాన్ని గౌరవించాలి.. ఆదరించాలి. ఎవరి విశ్వాసమైనా దైవపరంగా, ధర్మపరంగా లోకహితం అయినప్పుడు వాదవివాదాలెందుకు? లక్షలమంది నమ్ముతున్నారు.. ఆరాధిస్తున్నారు. ఫలితాన్ని పొందుతున్నారు. మీకు నమ్మకముంటే ఆరాధించండి. నమ్మరూ ఆరాధించకండి. ఆరాధించే వారి విశ్వాసాన్ని, శ్రద్ధను దెబ్బతీయాలనుకోవటాన్ని ఏ శాస్త్రమూ సమర్థించదు. ©

# కాలాతీతం

గాబ్రియేల్ గార్సియా మార్క్వెజ్






# ది ఆటం ఆఫ్ ది పేట్రియార్క్

వెనెజులా నియంత మార్కోస్ పెరెజ్ జిమినెజ్ పతనం తర్వాత మార్క్వెజ్‌కు 'నియంత నవల' రాయాలనిపించింది. లాటిన్ అమెరికాలో తాను చూసిన తొలి నియంత పరాజయమది. 1968లో ప్రారంభించి, 1971లో ముగించినా, మరో నాలుగేళ్లపాటు మెరుగులద్ది 1975లో 'ది ఆటం ఆఫ్ ది పేట్రియార్క్' నవలను ప్రచురించాడు మార్క్వెజ్. ఇది 'పోయమ్ ఆన్ ది సాలిట్యూడ్ ఆఫ్ పవర్'.

అయితే ఇది ఏ ఒక్కదానికో పరిమితమైన కథ కాదు. 'లాటిన్ అమెరికా నియంతలందరికీ వర్తిస్తుంది' అంటారు రచయిత.

232 పేజీల దీర్ఘకవిత 'ది ఆటం..' 'వన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్' నవలకు ముందే ఈ నవల రాయాలనుకున్నా, ఎలా రాయాలో అంతుపట్టక నిరీక్షించాడు మార్క్వెజ్. జిమినెజ్ అధ్యక్షభవనంలోని వెనకగదిలో, ఇతర జర్నలిస్టులతో కలిసి కూర్చున్నప్పుడు, సైనిక ప్రతినిధి ఒకరు చేతిలో మెషిన్‌గన్, బురద అట్టగట్టిన బూట్లతో, మాసిన యూనిఫాంతో అక్కడికి వచ్చాడట. 'ఆ క్షణాన, అధికార రహస్యం అవగతమయ్యింది నాకు. అప్పుడే ఈ నవల రాయటమెలాగో తెలిసివచ్చింది' అన్నాడు రచయిత.

హైతీని హడలెత్తించిన పాపాడాక్ దువాలియె నుండి వెనెజులాను పీల్చిపిప్పిచేసిన యువాన్ విన్సెంట్ గోమెజ్ దాకా, లాటిన్ అమెరికన్ నియంతలందరికీ ప్రతినిధి 'పేట్రియార్క్'.

'ది ఆటం...' సులభంగా చదవగలిగే పుస్తకమేమీ కాదు! ఆరు భాగాలలో చెప్పిన ఈ కథలో ఆరు పేరాగ్రాఫులు మాత్రమే వుంటాయి. ఒక్కొక్క వ్యాసం కొన్నిపేజీలపాటు విరామం లేకుండా కొనసాగుతుంది. నిర్మాణంలో జేమ్స్‌జాయిస్, విలియం ఫాక్నర్‌ల చైతన్య స్రవంతిలాగ. ఈ సంక్లిష్టత అంతకన్నా జటిలమై, వాక్యం మధ్యలో దృష్టికోణం కూడా తరచు మారుతూ వుంటుంది. 'నా నవలలన్నీ ప్రయోగాత్మకమైనవే అనుకుంటే ఇది మిగతా అన్నింటికన్నా ప్రయోగాత్మకమైంది. అసలిది రచనారూపంలో వున్న కవిత్వం. కొన్నిసార్లు ఒక్క వాక్యం పూర్తి చెయ్యటానికే వారాలు పట్టింది' అన్నాడు మార్క్వెజ్.

పేట్రియార్క్ - పెద్దమనిషి - మృతదేహాన్ని రాబందులు పీక్కుతినటం, కుళ్లుతున్న శరీరంతో, లుకలుకలాడుతున్న పురుగులతో ప్రారంభమవుతుంది కథనం. కాని పేట్రియార్క్ ప్రజలకు దర్శనమివ్వక చాలా సంవత్సరాలయింది. పైగా ఇది ఆయన రెండో మరణవార్త! మొదటిసారి ఆయనకు డూప్‌డబుల్‌గా పనిచేసిన మరో వ్యక్తి మరణించాడు. అందువల్ల ఆ మృతదేహాన్ని చూసిన

వాళ్లకూ అది పేట్రియార్క్‌దేనా అని అనుమానంగా వుంది. ఆరు భాగాలలో ఆయన పుట్టుక, అధికారాన్ని చేజిక్కించుకున్న క్రమం, పెళ్లి, సైనిక తిరుగుబాట్లు, తిరుగులేని నియంతగా ప్రజలను ఉక్కుపాదంతో అణచివేసిన వైనం వగైరా చెప్పినప్పటికీ, ఇందులోని కథ ప్రధానంగా, ఈ మృత దేహం గురించిన వార్త తెలిసినప్పటి నుండి ప్రజల్లో పెల్లుబికిన ఆనందోత్సాహాలతో గడిచిన ఇరవైనాలుగు గంటల మీదే కేంద్రీకరిస్తుంది.

కథ కాలక్రమంలో జరగదు. ఏకకాలంలో వివిధ గొంతులు, వివిధ సంఘటనాక్రమాలను వివరిస్తుంటాయి. పేట్రియార్క్ రూపం ఒక బ్రహ్మరాక్షసిలాగ మన కళ్లముందు సాక్షాత్కరిస్తుంది. ఆ రూపాన్ని ఆవాహన చెయ్యటానికి వచనం సరిపోలేదు. ఒక ప్రయోగాత్మక కవితా ప్రక్రియలో మాత్రమే మార్క్వెజ్‌కు అది సాధ్యమైంది. కొన్నిసార్లు పేట్రియార్క్ అవతార పురుషుడిగా కనిపిస్తాడు. శతాబ్దాల నియంతలను ఒకే దృశ్యంలో పట్టుకోవాలంటే ఏం చేయాలి? కొలంబస్ బృందం వచ్చిన ఓడలు, ఆధునిక యుద్ధనౌకలు పక్కపక్కనే కనిపిస్తాయి. సమాజ పరిణామక్రమంలో జరిగిన అనూహ్యమైన హింసకూ, అమానుష సంఘటనలకూ మార్క్వెజ్ అన్ని రచనల్లోనూ ఎక్కువ ప్రాధాన్యమిచ్చాడు. ఇది పేట్రియార్క్ 'నరసంహార విజయగాథ' మరి!

మొదట నియంత మీద హత్యాప్రయత్నం చేశాడనే నెపంతో ఒక సైనిక జనరల్ మరణశిక్ష అమలు చేస్తారు. ఆయనను ఘనంగా సత్కరింపబోతున్నామని ప్రభుత్వం ప్రకటించిన రోజున, సర్వాంగసుందరంగా అలంకరించిన విందుసమావేశంలో ధగధగా మెరిసిపోతున్న ఒక వెండి పళ్లెంలో, కాలిఫ్లవర్, ఆలివ్ కొమ్మ(శాంతికి చిహ్నం)ల మధ్య, మసాలాద్రవ్యాలతో కూరి రుచిగా వండిన ఆయన శిరస్సును తీసుకు వస్తారు. ఆహూతులకు ఆనాటి ప్రత్యేక వంటకమది.

అలాగే పేట్రియార్క్ తల్లి- రాజమాత- వైద్యంతో నయం కాని ఒక వింత జబ్బుతో చావు బతుకుల మధ్య కొట్టుమిట్టాడుతూ వుంటుంది. ఆమె ఎప్పుడో మరణించి వుంటుంది గానీ, యింకా సజీవంగా వున్నట్టుగానే ఆమె చిత్రపటాలను దేశమంతా ప్రదర్శిస్తారు. రోమన్ కాథలిక్కు సంప్రదాయం ప్రకారం ఆమెను 'సెయింట్'గా ప్రకటింపచెయ్యటానికి ప్రయత్నిస్తుంటాడు పేట్రియార్క్. మరోచోట ఆయన భార్యాకొడుకులను తర్ఫీదు పొందిన జాగిలాలు పీక్కుని తింటాయి. ఈ హత్యోదంతాన్ని పరిశోధించిన మరొక జనరల్, పేట్రియార్క్‌కు కొన్ని బస్తాల నిండా కొబ్బరికాయలు బహుమతిగా పంపిస్తాడు. నిజానికి ఆ బస్తాల్లో ఉన్నవి శత్రువుల తలలు! వాటి సంఖ్య 918! రెండువేలమంది అమాయకులైన పిల్లల్ని లాటరీ కుంభకోణంలో పావులుగా వాడుకుంటాడు పేట్రియార్క్. కాని ఈ వార్త బయటికి పొక్కింతర్వాత వాళ్లు బతికుండటం ఇంకా ప్రమాదకరం గనుక, ఒక ఓడలో కాంక్రీటు నింపి, పిల్లల్ని దానిమీదికి ఎక్కించి, నడి సముద్రంలో పేల్చివేస్తాడు. ఇలాంటి ఘోరాలు ఒకటా రెండా! ఒకదాన్ని మించిన పైశాచిక చర్య మరొకటి! నరమేధానికి మరోపేరే నియంతల పాలన. అసలు వీటి జాబితా తయారు చెయ్యటం సాధ్యమా? ఈ హత్యాకాండలని ఒక ఎడతెగని వాక్యంగా మార్క్వెజ్ రాయటానికి కారణమిదే.

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

ఇది పేట్రియార్క్ కథ. ఆ 'మహానుభావుని' ఘనచరిత్రను అక్షరీకరించటానికే రాశారీ నవల. నియంత అంటే ఓ వ్యక్తి కాదు. ప్రజలు ప్రశ్నించలేని అధికార కేంద్రీకరణకు వ్యక్తీకరణే నియంత. బకాసురుడిలా సాటి మనుషులే అతడికి ఆహారం. రాజ్యమంటే వ్యక్తిగత ఆస్తి. నియంతను వ్యక్తిగా పరిగణించాలంటే, అతడో వున్మాది కన్న ఎక్కువేమీ కాదు. అంతులేని అధికారముంటే అంతులేని అవినీతి అని అందరికీ తెలుసు. పిచ్చివాడి చేతిలో రాయి వుంటే ఏమవుతుందో, నియంత అధికారం అదే చేస్తుంది.

మొదట అతణ్ణి అవతారపురుషుడిగా కీర్తిస్తారు వందిమాగధులు. చివరికి అతడు ప్రకృతిని కూడా శాసించగలడని ప్రచారం చేస్తారు. కొందరు అధికారంలో వున్నప్పుడు వరుణదేవుడు కరుణిస్తాడు. కరువు పారిపోతుంది! ఆయన మానవాతీతుడనటానికి యింతకన్నా నిదర్శనమేం కావాలి? అంతేనా, ఆయనకు మరణం లేదు. తుపాకీ గుళ్లు ఆయన శరీరాన్ని ఛిద్రం చేయలేవు. మృత్యుంజయుడు మరి!

ప్రకృతినే శాసించగలిగిన వాడికి మనుషులను పావులుగా వాడుకోవటం లెక్కా? 'టైమెంత?' అని అడిగితే, ఆయన ఎంతయుందనుకుంటు

# గాబ్రియల్ గర్సియా మార్కెజ్ (1927-2014)

దక్షిణ అమెరికాలోని కొలంబియా దేశం, అరకాటకా నగరంలో జన్మించాడు గాబ్రియల్ గర్సియా మార్కెజ్. ఫార్మసిస్టుగా మారిన తండ్రి, తల్లితో కలిసి మరో వూరికి వెళ్లిపోవడంతో మాతామహుల వద్ద పెరిగాడు.

తల్లిదండ్రులు కొన్ని సంవత్సరాలపాటు అపరిచితులుగానే వుండటంవల్ల అతని మీద అమ్మమ్మ, తాతల ప్రభావమే ఎక్కువ. కల్నల్‌గా పనిచేసిన తాత చెప్పిన కథలు విన్నాడు. 'నా కాలంలో నేను చాలా మందిని చంపాను. ఆ జ్ఞాపకాల బరువు ఇప్పటికీ కుంగదీస్తూనే వుంది' అన్న మాటల్ని తరువాత రోజుల్లో తన రచనల్లో పొందుపరిచాడు మార్కెజ్. తన 'రాజకీయ, సామాజిక దృక్పథం మలిచాడు తాత' అని చెప్పుకున్నాడు. 'రాక్షసులు, రాజకుమారులు, మాయలు, మంత్రాల కథలకు బదులు తన యుద్ధానుభవాలు చెప్పాడు తాత. అవి నా మీద ఎంత గాఢమైన ముద్ర వేశాయో మాటల్లో చెప్పలేను' అన్నాడు ఒక ఇంటర్వ్యూలో. అంటే గర్సియా.. సోషలిస్టు, సామ్రాజ్యవాదవ్యతిరేకి కావటానికి కారణం ఆయన తాత.

తొలిదశలో కొంతకాలం జర్నలిస్టుగా పనిచేశాడు మార్కెజ్. అప్పుడే వర్జీనియా వూల్ఫ్, విలియం ఫాక్నర్‌లను చదివాడు. ఫాక్నర్ శైలి, ఆయన దక్షిణాది రాష్ట్రాల చారిత్రక నేపథ్యాన్ని నవలీకరించిన పద్ధతీ తనలో రచనోత్సాహానికి పునాది వేశాయి. కరీబియన్ సంస్కృతిని లోతుగా అధ్యయనం చేశాక సినిమా సమీక్షకుడిగానూ పనిచేశాడు. వెనెజులాలో 1958లో జరిగిన సైనిక తిరుగుబాటుకు సహాయం చేశాడు. ఆ సమయంలోనే పడవ ప్రమాదం గురించి రాసిన ఒక సంపాదకీయం పెద్ద వివాదం సృష్టించింది. ప్రమాదం గురించి అధికారులు చెప్పినదానికి భిన్నంగా వుండడంతో ఆ వ్యాసం ప్రచురించిన పత్రిక మార్కెజ్‌ను తన విదేశీ విలేఖరిగా యూరోప్‌కు పంపించింది. అనేక

న్నాడో అంతే చెప్పాలి.

'నియంతలు అత్యంత బలహీనులు' అంటారు మార్కెజ్. ప్రతిక్షణం ఎవరైనా తమమీద దాడి చేస్తారేమోననే భయం వెంటాడుతూనే వుంటుంది. వీళ్ల లైంగిక సామర్థ్యం కూడా తక్కువే. ప్రతి చిన్నపనికీ పక్కనున్నవాళ్ల మీద ఆధారపడతారు. కథలోని పేట్రియార్క్‌కు పెద్ద వరిబీజముంటుంది. దానికోసం ఆయన ప్రత్యేకంగా ఒక తోలు సంచీ కుట్టించుకున్నాడు. ఎప్పుడు దెబ్బతగులుతుందోనని భయం. జననాంగాల పరిమాణం పెరిగినా యిబ్బందే గద. వాటివల్ల ఏం ఉపయోగం? గూని వున్నట్టే! అదనపు భారాన్ని మోయటమే తప్ప గర్వపడటానికేమీ లేదు! దీనివల్ల సహజంగా తనకున్న కోరికల్ని కూడా అణచుకోకతప్పదు. అంటే నిజానికతడు అశక్తుడు. కాని చుట్టూ మూగిన భజనపరులు, స్వార్థపరులు తనను అజేయుడని నమ్మించటానికి ఎప్పుడూ కొత్త కథలల్లుతూ వుండాలి. స్త్రీ అవసరం తనకెంతో వుందని అందర్నీ భావింపచెయ్యటానికి అతడు, కనిపించిన అమ్మాయిల్ని వెకిలిగా దగ్గరకు రమ్మంటాడు. నిజానికి వాళ్లు అతడి కోసం సహాయకులు ఏర్పాటు చేసిన వీధి వేశ్యలే. కిరీటాలు, భుజకీర్తులు, కవచకుండలాలు, మరకత మాణిక్యాలు మరెన్ని తొడుగులు ధరించినా నపుంసకుడు స్త్రీని తృప్తిపరచలేడు. ఫీల్ గుడ్ సోప్ ఆపెరాలు అతడికోసం ప్రదర్శిస్తారు. జీవితం బీభత్సంగా లేదు. అందరూ ఆడుతూ, పాడుతూ వుల్లాసంగా గడుపుతున్నారని అతణ్ణి నమ్మించాలి మరి! ఎంత కృత్రిమ జీవితం!?

నవలలో అన్నీ అవాస్తవ, అధివాస్తవ దృశ్యాలే. పేట్రియార్క్ భార్య నగరంలో వున్న ప్రతి షాపులోనూ వస్తువులు కొని బిల్లు భర్తకు పంపించమంటుంది. అంటే వాటిని కొల్లగొట్టినట్టే! రాజమాతకు పనిమనుషుల ఇళ్లల్లో నివసించాలని వింత కోరిక వుంటుంది. ఆమెకు కనువిందు చేయటానికి, ఆ ఇళ్లమీద పక్షుల బొమ్మల పెయింటింగ్ వేయిస్తారు. నియంతల ప్రవర్తనకు అర్థంపర్థం వుండదు. ఎంత అసంబద్ధమైనా, కోరికలు తీర్చుకోవడమొక్కటే వాళ్లకు తెలిసింది.

లాటిన్ అమెరికన్ డిక్టేటర్ల గురించిన రాజకీయ నవల 'ది ఆటం ఆఫ్ ది పేట్రియార్క్'. రాజకీయ వాస్తవికతకు దర్పణం కాదు. కాని నియంతల స్వభావాన్ని నడివీధిలో నగ్నంగా నిల

మంది ప్రసిద్ధ రచయితలు, జర్నలిజం సృజనాత్మకతను చంపేస్తుందన్నారు గాని, మార్క్వెజ్‌కు అదే వరంగా పరిణమించింది. వార్తాకథనాల ఆధారంగా పలు కథలు, నవలలు రాశాడు.

ఈయన తొలి నవలిక 'లీఫ్ స్టార్మ్' 1955లో ప్రచురితమైంది. ఇందులోని సంఘటలన్నీ ఒకే గదిలో అరగంటలో జరుగుతాయి. జరిగిన తేదీ 12 సెప్టెంబరు 1928. ఇందులోని ప్రధాన పాత్ర ఒక వృద్ధకల్నల్, రచయిత తాతను పోలి వుంటుంది.

పద్దెనిమిదో ఏటనుండీ తన తాతయ్య ఇంటి గురించి నవల రాయాలని మార్క్వెజ్ కోరిక. అమ్మమ్మ కథలుచెప్పిన పద్ధతిని అనుసరిస్తూ రాయాలి. అలా రూపుదిద్దుకొంది 'వన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్'. 1967లో ప్రచురితమైన ఈ నవల 30 మిలియన్ల ప్రతుల మ్ముడుపోయిది. ఇందులో మాకాండో గ్రామ చరిత్ర జగత్ప్రసిద్ధం. నిజానికి లాటిన్ అమెరికాకు ప్రతీక ఆ గ్రామం. మార్క్వెజ్ 1972లో నోబెల్ బహుమతికి ఎంపిక కావటానికి అదే ప్రధాన కారణం.

ఈ నవలతో సాధించిన అంతర్జాతీయ ఖ్యాతితో కొలంబియన్ ప్రభుత్వానికీ, గెరిల్లాలకూ మధ్య జరిగిన చర్చల్లో కూడా పాల్గొన్నాడు మార్క్వెజ్. క్యూబన్ అధ్యక్షుడు ఫిడెల్ కాస్ట్రోతో స్నేహం బలపడింది. ఈ సమయంలోనే ఓసారి, మారియో వార్గస్ జోసాతో గొడవపడి, మొహంమీద బలంగా గుద్దాడు. ఆధునిక సాహిత్య చరిత్రలోనే ఇదో పెద్ద స్కాండల్.

మార్క్వెజ్ 1985లో ప్రచురించిన 'ది లవ్ ఇన్ ది టైమ్ ఆఫ్ కొలెరా' చివరిదశలో ఉన్న వృద్ధుల ప్రేమకథ.

1990లలో జరిగిన నార్కో-టెర్రరిస్ట్(మాదక ద్రవ్య వ్యాపారులు)ల కిడ్నాప్‌ల గురించి రాసిన నాన్‌ఫిక్షన్ 'న్యూస్ ఆఫ్ కిడ్నాపింగ్' 1996లో ప్రచురితమై సంచలనం సృష్టించింది.

మార్క్వెజ్ ఆత్మకథ 'లివింగ్ టు టెల్ ది టేల్' 2002లో, తొంభైఏళ్ళ వయస్కుడికీ, చిన్న పిల్లకూ మధ్య ఏర్పడిన ప్రేమ గురించి రాసిన 'మెమరీస్ ఆఫ్ మెలాంకలీ హోర్స్' 2004లోనూ అచ్చయ్యాయి.

'మాజిక్ రియలిజం' ధోరణికి బహుళ ప్రాచుర్యం కల్పించిన మార్క్వెజ్ తన ఎనభై ఏడోయేట న్యుమోనియాతో కన్నుమూశాడు.

---

బెట్టిన అధిక్షేప కావ్యం. ఒక వ్యక్తి చేతిలో కేంద్రీకృతమైన అంతులేని అధికారం ఎన్ని దుష్పరిణామాలకు దారితీస్తుందో, ఎలా మానవాళికి పెనుశాపంగా మారుతుందో.. ప్రవహిస్తున్న లావా లాంటి వచన కవిత్వంలో గానం చేశాడు మార్క్వెజ్. అసలు, నియంతలకు అతీంద్రియ శక్తులుండటమేంటి? ఇటువంటి అహంభావులను దైవాంశసంభూతులని కీర్తించడమేంటి? బాధ్యతలేని అధికారాలు మాత్రమే వున్న వ్యక్తి ప్రజలకు చేటు చెయ్యడా? నియంతలు అధికారమనే ఏడంతస్తుల మేడల్లో నివసిస్తారు. చుట్టూ మనుషులున్నా అది ఒంటరి జీవితం. అతడు ప్రజలమీద అధికారం చలాయిస్తాడో లేదో గాని, చుట్టూ మూగినవాళ్ల చేతుల్లో అతడు కీలుబొమ్మ. తనకోరికలు నెరవేర్చుకుంటున్నాననే భ్రమలో వాళ్ల కోరికలు తీరుస్తాడు.

నియంతల ఈ తల్లకిందుల లోకంలో అవినీతి శిఖరం ఎవరెస్టు కన్నా ఎత్తుపెరుగుతుంది. వీళ్ల నాడిస్తున్నది అమెరికన్ సామ్రాజ్యవాదం అంటాడు మార్క్వెజ్ అన్యాపదేశంగా. శతాబ్దాల లాటిన్ అమెరికా దుఃఖానికి మూలకారణం అమెరికన్ సామ్రాజ్యవాదం. అయితే ఈ సందేశం ప్రతీకాత్మక కవిత్వం మాటున దాగివుంటుంది. పాఠకులు ఇదో అద్భుత, అసాధారణ కావ్యమని గ్రహిస్తారుగాని, అక్షరారణ్యంలో ముందుకుసాగటం కష్టం. మార్క్వెజ్ సృజనాప్రతిభకు గీటురాయి 'ది ఆటం ఆఫ్ ది పేట్రియార్క్'.

'అనేక సంవత్సరాలుగా యిలాంటి పుస్తకం రాయాలని కలలు గన్నాను. ఎన్నోసార్లు ప్రయత్నించి విఫలమయ్యాను' అన్నాడు ఒక యింటర్వ్యూలో మార్క్వెజ్. ఫాక్నర్ చైతన్య స్రవంతి, హెమింగ్వేలోని స్పష్టత, కాఫ్కా అంతర్లోక విధ్వంసం తన రచనకు ప్రేరణ అంటారు మార్క్వెజ్. 'వన్ హండ్రెడ్' లాంటి శిఖరాయమానమైన రచన తర్వాత, యింక దాన్ని మించిన నవల మరొకటి వుండదన్నారు విమర్శకులు. 'ది ఆటం...'లో తను నెలకొల్పిన ప్రమాణాలను తనే అధిగమించాడు మార్క్వెజ్.

ఇనుపగుగ్గిళ్లలాంటి పుస్తకం వచ్చిందంటే విమర్శకులకు, వ్యాఖ్యాతలకు పండగే. సామాన్య పాఠకుల సంగతెలావున్నా, వీళ్లు మాత్రం దీని గురించి తరచూ ఓ కొత్త టీకా టిప్పణి వెలువరిస్తూనే వున్నారు.

– ఎం. వసంత

# భామనే.. సత్యభామనే..!

33

# సొగసు చూడతరమా...

**రొమాంటిక్ కామెడి 'కాక్‌టెయిల్'తో తెరంగేట్రం చేసి అందం, అభినయంతో ప్రేక్షకులను ఆకట్టుకుందా ముద్దుగుమ్మ. మోడలింగుతో కెరీర్‌ను ప్రారంభించిన ఆ బాలీవుడ్ భామ కథానాయికగా మంచి గుర్తింపు తెచ్చుకుంది. బాహ్యసౌందర్యం కంటే అంతఃసౌందర్యమే మిన్న అంటున్న ఆ ముంబయి చిన్నది.. డయానా పెంటి! ఆ సొగసరి సౌందర్యరహస్యమేంటో ఆమె మాటల్లోనే..**

భోజన ప్రియురాలిని. అన్నం అంటే చాలా ఇష్టం. కాకపోతే వైట్‌రైస్‌కు బదులు బ్రౌన్ రైస్ తీసుకుంటా. బరువు తగ్గాలంటే కడుపు మాడ్చుకోవాల్సిన అవసరం లేదు.

యాపిల్, బొప్పాయి, పియర్, చీకూ, మామిడి వంటి పండ్లముక్కలతో ఆహారం ప్రారంభిస్తా. గంట తర్వాత రెండు బ్రౌన్ బ్రెడ్ పీసులు, ఉడకబెట్టిన కోడిగుడ్డు తింటా. తర్వాత ఓ కప్పు టీ.

మధ్యాహ్న భోజనంలో బ్రౌన్‌రైస్, పప్పు, చికెన్, చేపలు, కూరగాయల కూర ఉంటాయి.

సాయంత్రం సమయాల్లో బ్రౌన్ బ్రెడ్డులో వెన్న లేదా టమాటా సాండ్‌విచ్‌గా తీసుకుంటా.

రాత్రి భోజనంలో చపాతీలు, సలాడ్, ఇతర ప్రోటీన్ పదార్థాలు(గుడ్లు కాకుండా) ఉంటాయి.

మొలకలు వచ్చిన విత్తనాలంటే చాలా ఇష్టం. పీచుపదార్థం, ప్రోటీన్లు సమృద్ధిగా లభిస్తాయి. వేపుడు పదార్థాలకు చక్కని ప్రత్యామ్నాయం!

వారంలో రెండుసార్లు గంటన్నరపాటు భరతనాట్యం, కథక్ అభ్యాసం చేస్తా. గుండె సంబంధిత, జిమ్ వ్యాయామాలను కథక్ సమన్వయపరుస్తుంది. వారంలో నాలుగుసార్లు జిమ్‌కు వెళ్తుంటా. 45 నిమిషాల పాటు చిన్నచిన్న బరువులెత్తడంతోపాటు ఇతర వ్యాయామాలూ చేస్తా.

నీళ్లు ఎక్కువగా తాగడం వల్ల చర్మం తాజాగా ఉంటుంది. పడుకునే ముందు మేకప్ పూర్తిగా కడిగేసుకుంటా. బాహ్యసౌందర్యం కంటే అంతఃసౌందర్యమే ముఖ్యమని భావిస్తా. నమ్మకం, సంతోషం, ప్రశాంతత అంతఃసౌందర్యాన్ని పెంచుతాయి. అదే బాహ్యసౌందర్యానికి మార్గం అని భావిస్తా!





మధుమేహ దినం 14న

# బతుకును చేదుచేసే 'తీపి'

పుట్టినరోజు, పెళ్ళిరోజు, పరీక్షలో విజయం, కాలేజీలో సీటు, ఉద్యోగంలో చేరడం, కారు కొనడం, విదేశీ ప్రయాణం - ఇలా ప్రతి వేడుకనీ మిఠాయితో రెట్టింపు చేసుకుంటాం. ఏ కాస్త మంచి జరిగినా ఆఖరికి కొత్తబట్టలు ధరించినా మిత్రులు 'స్వీటేది' అంటారే తప్ప కారబ్బూంది అడగరు. ఎందుకంటే కారం కోపానికి, ఘాటుకీ సంకేతమైతే తీపి సంతోషానికి, జీవన మాధుర్యానికి చిహ్నం. చక్కగా మాట్లాడ్తే పంచదార పలుకులని, మెత్తటి బుగ్గల్ని బూరెలని, మంచి రచనని తేనెలూరుతోందని - నచ్చినవాటిని తీపితోనే పోల్చి మెచ్చుకుంటాం. ఇలా మధురిమల్ని ఆస్వాదించే మనకి పేరులో మాధుర్యాన్ని నింపుకున్న మధుమేహం మాత్రం చేదునే పంచుతుంది.

మధుమేహం బారిన పడితే ఇక నోరూరించే మావిడిపండు, ఘుమఘుమలాడే చక్రపొంగలి, ఆహా అనిపించే కాఫీల్లాంటి రుచులెన్నిటికో స్వస్తి పలకక తప్పదు. ఆఖరికి అన్నం కూడా కొలుచుకు తినాల్సిరావడం ఎంత దుర్భరం! అందుకే ఇంట్లో చక్కెరుండాలిగానీ ఒంట్లో కాదంటారు. ఓ మిఠాయి దుకాణంలో ఉద్యోగానికి షుగర్ పేషెంటు కావాలని ప్రకటించారట. ఈ హాస్యోక్తి వెనకున్నది విషాదమే!

మధుమేహం అనేక రోగాలకు ముఖద్వారం లాంటిది. నిస్సత్తువ, డీ-హైడ్రేషన్, దృష్టిలోపం లాంటి అనేక అవస్థలపాలుచేసే రాకాసి జబ్బిది.

### ఏమిటి, ఎందుకు?

ఆహారాన్ని శక్తిగా మార్చడంలో అవసరమైన ఇన్సులిన్ లోపించి గ్లూకోజ్ స్థాయి పెరగడమే డయాబెటిస్. ఇది రెండు రకాలు. శరీరానికి అవసరమయ్యే ఇన్సులిన్ ఉత్పత్తి కాకపోవడం టైప్-1 కాగా, ఇన్సులిన్ తగినంత లేకపోవడం లేదా తయారైన ఇన్సులిన్ సవ్యంగా పనిచేయకపోవడం టైప్-2.

అసలు మధుమేహం ఎందుకొస్తుంది అంటే.. జన్యుకారణం మొట్టమొదటిది. తర్వాత భోజన అలవాట్లు, నిద్రలేమి, జీవనశైలి, ఒత్తిడి, ఆందోళన, ఊబకాయం లాంటి కారణాలనేకం వున్నాయి.

ప్రపంచవ్యాప్తంగా కోట్లాదిమంది మధుమేహంతో బాధపడ్తున్నారు. మధ్యవయస్కుల్లో ఈ వ్యాధి అత్యధికమైనప్పటికీ, పిల్లల్నీ వదలడంలేదిది. మనదేశంలో 5 లక్షలమందికి పైగా 15 ఏళ్ళలోపు చిన్నారులు మధుమేహ చికిత్స తీసుకుంటున్నారు. ప్రపంచంలో అత్యధిక డయాబెటిస్ వ్యాధిగ్రస్తులున్న దేశాలలో మనదేశం

## టెక్ గురూ!

### నెయిల్ ఆర్ట్ ఫర్ ఆల్ యాప్

అందంలో గోళ్లూ భాగమే. గోళ్లను చక్కని ఆకృతిలో కత్తిరించుకుని రంగు వేసుకుంటే చేతులు మరింత అందంగా కనపడతాయి. మొదట్లో రంగులు, తర్వాత మెరుపు కలగలిసిన రంగులు మార్కెట్‌లోకి వచ్చాయి. ఇపుడు ఆ రంగులతోనే గోళ్ల మీద రకరకాల డిజైన్లు వేయించుకోవడం ఫ్యాషన్‌గా మారింది. ఇది అమ్మాయిలను బాగా ఆకర్షిస్తోంది. మరి డిజైన్ల కోసం పార్లర్లకు పరుగులు తీయక్కర్లేదిక! 'నెయిల్ ఆర్ట్ ఫర్ ఆల్' యాప్‌లో కార్టూన్లు, పువ్వులు, జంతువులు, పెళ్లికి సంబంధించినవి... ఇలా దాదాపు ఐదువేలకు పైగా డిజైన్లను ఉంచారు. మనకు నచ్చిన డిజైన్లను ఎంచుకుని వేసుకోవచ్చు. అంతే కాదు కొత్త డిజైన్లను నేరుగా యాప్‌లో పెట్టే సౌకర్యమూ ఉంది. ఫొటో తీసి, యాప్‌లోకి అప్‌లోడ్ చేయాల్సిన అవసరం లేదు. మన మిత్రులకు షేర్ చేయవచ్చు కూడా. గూగుల్ ప్లే నుంచి ఈ యాప్‌ను ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.



### కంపానియన్ సేఫ్టీ యాప్

మహిళలు ఒంటరిగా వెళ్లవలసి వచ్చినపుడు కంపానియన్ సేఫ్టీ యాప్ తోడుగా ఉంటుంది. క్షేమంగా గమ్యం చేరిందీ లేనిదీ శ్రేయోభిలాషులకు తెలుపుతుంది. మధ్యలో ఏదైనా ఆపద వచ్చినా కుటుంబ సభ్యులను, మిత్రులను అప్రమత్తం చేస్తుంది. చేరవలసిన ప్రదేశం, కుటుంబ సభ్యులు, ఇతర శ్రేయోభిలాషుల ఫోన్ నంబర్లు ఫీడ్ చేసి పెడితే చాలు! వాళ్ల ఫోనులో యాప్‌ను ఇన్‌స్టాల్ చేయక్కర్లేదు. ఏదైనా ఆపద వచ్చి పరిగెత్తినా, సమయానికి గమ్యం చేరకపోయినా, ఫోన్ కింద పడినా, పదిహేను సెకన్లలో స్పందించకపోయినా కుటుంబ సభ్యులను అప్రమత్తం చేస్తుంది ఈ యాప్. ఏదైనా ప్రదేశంలో భయంగా అనిపించినపుడు 'ఐ ఫీల్ నర్వస్' బటన్‌ను నొక్కితే చుట్టుపక్కల ప్రదేశాల్లోని పోలీస్ స్టేషన్‌కు మెసేజ్ వెళ్తుంది! గూగుల్ ప్లే నుంచి ఈ యాప్‌ను నేరుగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

---

మూడో స్థానంలో వుంది. ఈ వ్యాధి తీవ్రతను గుర్తించిన ప్రపంచ ఆరోగ్య సంస్థ ఇన్సులిన్ కనిపెట్టేందుకు మొట్టమొదట కృషిచేసిన ఫ్రెడరిక్ బాంటింగ్ పుట్టినరోజైన నవంబరు 14ను డయాబెటిస్ డేగా ప్రకటించింది. ఈరోజును పురస్కరించుకుని 160కి పైగా దేశాలు వ్యాధి నియంత్రణకు అవసరమైన కార్యకలాపాలు నిర్వహిస్తున్నాయి.

**లక్షణాలు**

తరచూ మూత్రానికెళ్ళాల్సిరావడం, మాటికీ ఇన్‌ఫెక్షన్లు, అలసట, నిస్త్రాణ, విసుగు, ఆకలి, దాహాల పెరుగుదల, బలహీనత, దృష్టిలోపాలు, గాయాలు మానకపోవడం మొదలైనవి. మధుమేహం వుందని తెలిశాక అలసత్వం వద్దు. తక్షణం డాక్టర్ని సంప్రదించాలి. లేకుంటే చాప కింద నీరులా కొంప ముంచుతుంది.

***తగ్గించుకోవడమెలా...***

★ ఎప్పటికప్పుడు పరీక్షలు, చికిత్స తప్పనిసరి

★ తీపికి దూరంగా వుండాలి

★ నెయ్యి, నూనె తగ్గించాలి

★ ధ్యానం, యోగాసనాలు, వ్యాయామం

★ వేళకు నిద్ర, భోజనం

★ పీచుపదార్థాలు ఎక్కువగా వుండే పచ్చి కూరగాయలు, నానబెట్టిన గింజలు తీసుకోవడం లాంటి కనీస జాగ్రత్తలు పాటించాలి.

***మధుమేహం రాకుండా వుండాలంటే...***

ఈ వ్యాధి రాకుండానే జాగ్రత్త పడొచ్చంటే అతిశయోక్తి కాదు. మునగాకులు, మావిడాకులు, తులసాకులు, వేపాకు, వేపపూవులను తగిన మోతాదులో తీసుకోవడంవల్ల శరీరంలో చక్కెర లెవెల్ నియంత్రణలో వుంటుంది.

కాకరకాయ రసం చేసి తాగడం, వంటలో దాల్చినచెక్క వినియోగం, రేగుపండు గింజలను ఔషధంలా సేవించడం, తాజా ఆకుకూరలు, యాపిల్ పళ్ళు, నేరేడు, ఉసిరి, నిమ్మ, నారింజ, దానిమ్మ, రేగు వంటి పండ్లు, కేరెట్ లాంటి దుంపలు తీసుకోవడంవల్ల డయాబెటిస్ రాదు.

ఇంత తేలికైన మార్గాలుండగా ఇక మధుమేహం గురించి దిగులెందుకు? !

– లేఖ

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**లింగబత్తుల భవ్యశ్రీ**
పెదముప్పారం,
మహబూబాబాద్ జిల్లా
పిన్ : 506 324

## చతురంగం - 67 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 గాం | డీ | 2 వం | | 3 గో | ధు | 4 మ | | 5 అ | 6 వి |
| ధీ | | 7 దే | 8 వ | ళం | | 9 ర | మా | ప్ర | భ |
| | 10 అ | మా | స | | 11 ప | ణం | | 12 మ | వ |
| 13 ర | క్షి | త | | 14 గ | ది | | 15 అ | త్రం | |
| క్త | | 16 రం | 17 గం | | 18 ల | క | ను | | 19 వా |
| 20 ము | 21 ని | | 22 ధ | న | ము | | 23 వా | 24 మ | న |
| | 25 క | 26 న | ము | | | 27 వా | ద | నం | |
| 28 సా | రం | గం | | 29 తా | రు | | క | | 30 పు |
| ధ | | 31 ము | 32 ర | ళి | | 33 క | థ | కు | లు |
| 34 నం | ది | గా | మ | | 35 ము | డు | లు | | గు |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. ఆర్. వంశీకృష్ణ, ఎమ్మిగనూరు, 2. కందికుప్ప వెంకటరమణ, గాజువాక, 3. పి. శుభ, బంజారాహిల్స్, 4. వరయోగి రామ్‌మోహన్, సికింద్రాబాద్, 5. యు. విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 6. పచ్చిపాల శేషారావు, విశాఖ, 7. కె.వి. దుర్గామోహన రావు, వనస్థలిపురం, 8. ఆలపాటి సుశీల, హబ్సీగూడ, 9. జి. పార్వతీదేవి, వెంగళరావునగర్, 10. బత్తుల యాదగిరి, ఉప్పల్, 11. గౌరిపెద్ది రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 12. యు.ఎస్.ఎమ్. సికింద్రాబాద్, 13. కోకా శైలజ, హైదరాబాద్, 14. దేవసేన, తిరుపతి, 15. ఎస్. శివసుబ్రమణ్యం పిళ్లై, తిరుపతి, 16. చింతలపాటి శివశంకరశాస్త్రి, కానుకుంట, 17. కావూరి కనకదుర్గ, కానుకుంట, 18. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, 19. బి. శ్రీనివాసులురెడ్డి, బెంగళూరు, 20. బి. అన్నపూర్ణ, హనుమకొండ, 21. యస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోల్, 22. పేర్వేల సత్యవతి, మణికొండ, 23. శ్రీదాస్యం లక్ష్మయ్య, హుస్నాబాద్, 24. కరణం శివానందరావు, కర్నూలు, 25. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 26. పొనుగోటి నరసింహారావు, కూకట్‌పల్లి, 27. అడపా సత్యనారాయణ బాబ్జీ, హైదరాబాద్, 28. పి. దేవసేనమ్మ, జూబ్లీహిల్స్, 29. ఆమంచర్ల సరస్వతి, హైదరాబాద్, 30. నోరి శివప్రకాశం, నెల్లూరు, 31. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, 32. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 33. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 34. గోగాడ జాహ్నవి, కర్ణాటక, 35. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 36. యస్. రాజు, కర్నూలు, 37. ఇ.ఎల్. నరసింహారావు, మధిర, 38. సి. అల్వాల్ రెడ్డి, హైదరాబాద్, 39. పప్పు కామేశ్వర రావు, అమలాపురం, 40. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమహేంద్రవరం, 41. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 42. భోగరాజు అంజనీ మైత్రేయి, విజయనగరం, 42. ఎ.వి. శివారెడ్డి, యర్రగుంట్ల, కడప జిల్లా, 43. గోశికె లింగయ్యగారి వేంకటేశం, చిక్కడపల్లి, 44. ఎం. లాస్యప్రియ, బోరబండ, 45. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 46. చిలుముల ప్రమీల నసీరుద్దీన్, కరీంనగర్, 47. కె. చంద్రశేఖర శర్మ, నంద్యాల, 48. వి. రమాదేవి, బెంగళూరు, 49. పి.ఎ. వేదవర్ష, బెంగళూరు, 50. అక్షింతల సంజీవశర్మ, అనంతపురం, 51. ఎ.వి. రామకృష్ణ, కాట్రేనికోన, 52. గురజాల వరలక్ష్మి, ఉచ్చిలి, తూ.గో. జిల్లా, 53. అన్నంరాజు పూర్ణచంద్రరావు, విశాఖ, 54. కె.ఎ. ప్రకాశ్, నంద్యాల, 55. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 56. ఏకా సావిత్రి, బాపట్ల, 57. పుల్లాపంతుల వెంకట సుబ్బారావు, భీమవరం, 58. డా. మునిగోటి సుందరరామశర్మ, చిప్పిలి, చిత్తూరు జిల్లా, 59. జి. విశాలి, తిరుపతి, 60. ధరణి పద్మాసన, నల్లకుంట, 61. పి. సాయిశ్రీకర్, వైజాగ్, 62. బి. రామమోహనరావు, దిల్‌సుక్‌నగర్, 63. ఎ. అరుంధతి, పుణె, మహారాష్ట్ర, 64. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, 65. కోలా సత్యనారాయణ, విశాఖ, 66. సి. భారతి, మన్సూరాబాద్, 67. ఆర్.వి.సిహెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 68. ధవ్సూరి సుధాదేవి, సీతారాంబాగ్, 69. పాలకుర్తి సుధీర్ కుమార్, మాదాపూర్, 70. పి. జయశ్రీ, సికింద్రాబాద్, 71. ఎస్. స్వర్ణలక్ష్మి, బెంగళూరు, 72. యు.యు.యు. ఎమ్మిగనూరు, 73. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనంద్‌బాగ్, 74. ముహ్మద్ జఫరుల్లాఖాన్, మహబూబ్‌నగర్, 75. ఆంద్ర అచ్యుతరామయ్య, తణుకు, 76. బి.వి. నరసింహారావు, పేరాల, 77. పక్కి శ్రీదేవి, గంట్యాడ, విజయనగరం జిల్లా, 78. గరికిపాటి ఇందిర, కాకినాడ, 79. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, 80. ఎ. రామకృష్ణ, జీడిమెట్ల, 81. వడ్డీ సుశీల, టెంపుల్ అల్వాల్, 82. జె. రాజగోపాలరావు, ఎ.ఎస్. రావు నగర్, 83. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 84. నెల్లుట్ల ప్రేమలత, ప్రగతినగర్, 85. అవధూత రాజేశ్వర్, శేరిలింగంపల్లి, 86. తూములూరు సత్యనారాయణ మూర్తి, ఖమ్మం, 87. ఎం.ఎం. రెడ్డి, హైదరాబాద్, 88. ఎస్. జయరామమోహన్, హైదరాబాద్, 89. విన్నకోట పద్మావతి, సఫిల్‌గూడ, 90. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, 91. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, విశాఖ, 92. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, తూ.గో. జిల్లా, 93. తల్లాప్రగడ సుందరరామయ్య, రాజమండ్రి, 94. వాసా తేజస్వి, తగరపువలస, విశాఖ జిల్లా, 95. ఎన్. విజయ, కాకినాడ, 96. చక్రవర్తి మధుసూదనరావు, వికారాబాద్, 97. చిట్యాల శంకరయ్య, వికారాబాద్, 98. బలుసు అమర సురేంద్ర ప్రసాద్, చాగల్లు, ప.గో. జిల్లా, 99. పి.బి. సీతాదేవి, నరసాపురం, 100. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, 101. తోకల విష్ణువర్ధన్, ఇంకొల్లు, 102. యు. నారప్ప, మద్దికెర, 103. ఎం. వసంతవీరేశ్, మద్దికెర, *(..128లో)*

చిటికెలో రుచిగా..!



# ఉసిరి పులిహోర

## కావలసిన పదార్థాలు

* ఉసిరిముక్కలు - 1 కప్పు
* కొత్తిమీర - కొద్దిగా
* పచ్చిమిర్చి - 5
* ఉప్పు - తగినంత
* ఆవాలు - 1 టీస్పూను
* జీలకర్ర - 1 టీస్పూను
* ఎండు మిర్చి - 2
* మినపప్పు - 1 టేబుల్‌స్పూను
* శనగపప్పు - 1 టేబుల్‌స్పూను
* పల్లీలు - 1 టేబుల్‌స్పూను
* పసుపు - 1 టీస్పూను
* నూనె - 3 టేబుల్‌స్పూన్లు
* అన్నం - 2 కప్పులు

## తయారుచేయు విధానం

ముందుగా ఉసిరిముక్కలు, కొత్తిమీర, పచ్చిమిర్చి, కొద్దిగా ఉప్పు కలిపి మెత్తగా మిక్సీ పట్టుకోవాలి. పాన్‌లో నూనె వేసి కాగాక ఆవాలు, జీలకర్ర, ఎండు మిర్చి మినపప్పు, పల్లీలు, పచ్చిశనగపప్పు వేసి వేయించాలి. తర్వాత ఉప్పు, పసుపు, ఉసిరి మిశ్రమం కూడా వేసి కలపాలి. పచ్చివాసన పోయి నూనె తేలేవరకు కలుపుతూ ఫ్రై చేయాలి. తర్వాత మంట తీసి కాస్త వేడి తగ్గాక అన్నంలో ఈ మిశ్రమాన్ని కలపాలి. అంతే.. ఉసిరి పులిహోర రెడీ!







# ఉసిరి కారం

## కావలసిన పదార్థాలు

- ★ ఉసిరికాయలు - 3
- ★ ఉల్లిగడ్డ చిన్నది - 1
- ★ వెల్లుల్లి రెబ్బలు - 3
- ★ నూనె - 3 టీస్పూన్లు
- ★ కారం - 2 టీ స్పూన్లు
- ★ ఉప్పు - తగినంత
- ★ ఆవాలు - 1/4 టీ స్పూను
- ★ జీలకర్ర - 1/4 టీ స్పూను
- ★ కరివేపాకు - సరిపడ

## తయారుచేయు విధానం

ఉసిరికాయలను శుభ్రంగా కడిగి గింజలు తీసి ముక్కలుగా కోసుకోవాలి. వాటికి ఉల్లిపాయ ముక్కలు, వెల్లుల్లి రెబ్బలు కలిపి మిక్సీ పట్టుకోవాలి. పాన్‌లో నూనె వేసి కాగాక ఆవాలు, జీలకర్ర, కరివేపాకు వేసి వేగాక ఉసిరి మిశ్రమం వేయాలి. పచ్చివాసన పోయేవరకు వేపాలి. తర్వాత కారం, ఉప్పు కూడా వేసి నూనె పైకి తేలే వరకు ఫ్రై చేయాలి. ఉసిరికారం అన్నం, టిఫిన్‌కు కూడా సరిపోతుంది.

## చిట్కాలక్ష్మి



- ✦ పూరీలు వత్తాక పదినిమిషాలు ఫ్రిజ్‌లో ఉంచి వేయిస్తే నూనె తక్కువగా పీల్చుకోవడమే కాకుండా క్రిస్పీగా ఉంటాయి.
- ✦ వెనిగర్ కలిపిన నీళ్లలో పగిలిన కోడిగుడ్లను ఉడకబెట్టొచ్చు
- ✦ రెండుమూడు స్పూన్లు పాలు కలిపితే ఆమ్లెట్లు మృదువుగా, మెత్తగా ఉంటాయి.
- ✦ ఆలు, కోడిగుడ్లు ఉడకబెట్టేపుడు నీళ్లలో కొద్దిగా ఉప్పువేస్తే పొట్టు తేలికగా వస్తుంది.

# చతురంగం - 68 ఆధారాలు

## అడ్డం

1. పేరాస.. అత్యాశ (3)
3. చెప్పడం.. నైవేద్యం (4)
7. దప్పిక (2)
8. ఆవకాయకు ఘాటునిచ్చే చిన్నగా ఉండే పోపుదినుసులు (3)
9. తెర కాస్తా గజిబిజి (3)
11. దయతో ఉండే వాడిని '- - - వాది' అంటారు (3)
12. లెక్కలేనంత.. అపారము (4)
13. వాల్మీకి కృతి (5)
15. డబ్బు (2)
16. శోకము (4)
17. రుషులు చేసేది (3)
20. పడతి (3)
21. చేదుగా ఉండే కూరగాయ (3)
22. వింటి తాడు, 'అడ్డం 20' కి మరోరూపం (2)
23. ఏకమొత్తం, కాంట్రాక్ట్ ఒప్పందం, టోకు (2)
24. 'పాడుతా తీయగా' గాయకుడు (2)
25. 'నిలువు 2' లక్షణం (4)
27. శ్రీకృష్ణుని ప్రియురాలు (2)
28. నాణెము, దీనారము (3)
29. జఘన భాగం (3)
31. కాళిదాస కృతి, దాసరి-అక్కినేని మ్యూజికల్ హిట్ (5)
33. వివాదమే మరోలా (4)
34. ఉభయచరం (2)

## నిలువు

1. ఇవ్వడం, బహూకరించడం (3)
2. వెండి ఒక - - (2)
3. నిరోధించు, తగ్గించు (4)
4. సుత్తి జంటలో ఒక హాస్యనటుడు (2)
5. మారణ హోమము (5)
6. గిడ్డంగి (3)
8. రాబడి (4)
10. ప్రయాణం (3)
11. శివుడు (4)
13. ఒకప్పటి 'మిస్ యూనివర్స్' తడబడింది (4)
14. మోటుదనం, దళసరి (3)
16. 'బోరింగ్ వర్క్' కు తెలుగు (5)
18. పై లోకంలో ఉండే సమాజం (6)
19. 'కొలత' గజిబిజి (4)
21. నడవడానికి ఉపయోగపడేది (2)
22. సర్పం (2)
24. నొప్పి (2)
26. శరీరము తడబడింది (3)
27. శవాల్ని పీక్కుతినేది (3)
28. తిరగబడిన కుండ (2)
30. కఫం - - పిత్తం..లో మధ్యది కిందనుంచి (2)
31. ప్రవాహంలో కొట్టుకొచ్చిన ఇసుక దిబ్బ (2)
32. సందేహం (2)

*(125వ పేజీ తరువాయి...)*

104. సయ్యద్ జమీలాబేగం, కర్నూలు, 105. దేవులపల్లి లలిత, ఉయ్యూరు, 106. కాకర్లమూడి రామలింగమూర్తి, తణుకు, 107. ఇయ్యుణ్ణి రోహిణి, తణుకు, 108. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 109. డా. కె. రాఘవాచార్య, కాకినాడ, 110. ఎన్.వి. రమణి, బంజారాహిల్స్, 111. ఎన్. లీలాప్రసూనాదేవి, సికింద్రాబాద్, 112. ఎ. స్వరూపరాణి, ఎర్రమంజిల్, 113. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, 114. నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖ, 115. వి. భవాని, వరంగల్, 116. గన్ని అభిరామ్, తణుకు, 117. గరిమెళ్ల నాగసాయి అలేఖ్య, కాకినాడ, 118. దూసనపూడి శ్రీలత, తాడేపల్లిగూడెం, 119. కొమ్మూరు వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి, కూచనపూడి, గుంటూరు జిల్లా, 120. చింతపల్లి నాగేశ్వర రావు, విజయవాడ, 121. సాలగ్రామ నారాయణరావు, నరసన్నపేట, 122. ఆకెళ్ల శశికళ, విశాఖ, 123. తటవర్తి రామ కృష్ణ, హైదరాబాద్, 124. కె. సుబ్రమణ్యం, అనంతపురం, 125. హెచ్.జె సువర్ణ, కర్నూలు, 126. కె. శివభూషణం, కర్నూలు, 127. మారేమండ నరసింహమూర్తి, హైదరాబాద్, 128. ఎం. శ్రీవాణీ గిరిజాదేవి, రాజమండ్రి, 129. బి. మాచన్న, కళ్యాణదుర్గం, 130. టి. హేమలత, మచిలీపట్నం, 131. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్.

# చతురంగం - 68

**రూ.150/- బహుమతి** | **గడువు తేది : నవంబరు 17**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | ■ | 3 | 4 | | 5 | ■ | 6 |
| 7 | | ■ | 8 | | | ■ | 9 | 10 | |
| | ■ | 11 | | | ■ | 12 | | | |
| ■ | 13 | | | | 14 | ■ | 15 | | ■ |
| 16 | | | | ■ | 17 త | 18 | | ■ | 19 |
| 20 | | | ■ | 21 | | | ■ | 22 | |
| 23 | | ■ | 24 | | ■ | 25 | 26 హ | | |
| | ■ | 27 | | ■ | 28 | క | | ■ | |
| 29 | 30 తం | | ■ | 31 | | | | 32 | ■ |
| ■ | 33 | | | | ■ | | ■ | 34 | |

పంపినవారి పేరు: ------------------------------------------

వయసు (   ) చిరునామా : ------------------------------------

-----------------------------------------------------------

---------------- పిన్ : ----------- ఫోన్ : ---------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం **చతుర**, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# ఆమెది విపరీత మనస్తత్వమా?

ఆమెతో ఒకరాత్రి గడిపిన పురుషుడికి జీవితంలో మరే స్త్రీ రుచించదు. కానీ ఆమె మాత్రం ఏ పురుషుడి వద్దా నిలకడగా ఉండలేకపోతోంది. ఆమె విపరీత మనస్తత్వానికి కారణమేంటి? లైంగిక జీవితంలోని అసంతృప్తికి, వ్యక్తుల మానసికారోగ్యానికి మధ్య గల సంబంధాన్ని చిత్రించిన ఎమమాటో షుగోరో జపాన్ కథ ఒసాన్

సుప్రసిద్ధ కీటకశాస్త్రవేత్తకు భార్య ఆమె. నపుంసకుడైన భర్తనుంచి సుఖం పొందలేకపోతున్నాననీ, కొత్తగా వచ్చిన వైద్యుడిని బుట్టలో వేసుకుంది. అంతలోనే ఆమె భర్త మరణించాడు. ఆ తర్వాత ఆమె వైద్యుడిని దగ్గరకు రానివ్వలేదు. ఎందుకు? ఇంతకీ ఆమె భర్త మరణానికి కారణమేంటి? ఆద్యంతం ఉత్కంఠగా చదివించే పాప్డీ సేన్ గుప్తా జార్ఖండ్ కథ విషం

ఓ తల్లి తన కొడుకుకోసం బంగారు దారాలతో అందమైన సూటు కుట్టించింది. దాని మెరుపు పాడవ్వకుండా చాలా చర్యలు చేపట్టింది. ఆ సూటును ధరించే సందర్భాలపై ఆంక్షలూ పెట్టింది. చివరికా సూటు ఆ అబ్బాయి జీవితంతో ఎలా చెలగాటమాడింది? చదవండి ప్రఖ్యాత సైన్స్ ఫిక్షన్ రచయిత హెచ్.జి. వెల్స్ ఇంగ్లండ్ కథ అందమైన సూటు




మూడున్నర దశాబ్దాల కిందటే మనదే అధికార యంత్రాంగం అలసత్వంపై వాకాటి పాండురంగారావ్ సంధించిన వ్యంగ్యా పాదరక్షాయణం అను ప్రమోషన్లకథ కథకు స్టైల్ లో!

* పేరడీ బీరెడీ, రింగరింగా రింగరింగారే.. ఇంకా మరెన్నో.. నవంబరు విపులలో!


Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Colorama Printers Private Limited., 15/A/1, S.V. Co.Op Industrial Estate, Jeedimetla, Ranga Reddy District, 500 055 Telengana. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# గనుల యజమానికి పట్టిన గతి?

మైన్స్ లీజును రెన్యువల్ చేయించడానికి కలెక్టర్‌తో మాట్లాడేందుకు బయలుదేరాడు విద్యాసాగర్‌రావు.. చిట్టడవిలోకి రాగానే నాలుగురోడ్ల కూడలిలో హఠాత్తుగా ఆగిపోయింది స్కార్పియో! అక్కడ కొంతమంది మనుషులు గడబిడగా మాట్లాడుతూ అటుఇటు తిరుగుతున్నారు.. చూస్తుండగానే బస్సులు, లారీలు కనుచూపు మేరవరకు ఆగిపోయాయి!

'ఇక్కడ ధర్నా జరుగుతోంది సార్!
ముందుకు వెనక్కు కదిలే పరిస్థితి లేదు సార్!'
విషయం కనుక్కొని చెప్పాడు డ్రైవర్.

ఆ అడవి దారిలో హఠాత్తుగా చిక్కుకుపోవడంతో విద్యాసాగర్‌రావు గుండెలో వణుకు మొదలైంది. అతనికి అసలు ఆ ధర్నా అంటే ఎందుకు భయం? తర్వాతేం జరిగింది? నేటి సమాజ రీతిని కళ్లకు కట్టిన **అలం రాజయ్య** నవలిక **టై ర్‌జోన్** చతుర డిసెంబరు కానుక!

డబుల్ ధమాకా!



## బోనస్‌గా...

అత్తమామలు వచ్చేసరికి ఇంట్లో సరుకులన్నీ నిండుకున్నాయి. మామగారు కావల్సిన సరంజామా తెచ్చారు. కోడలు అందుకు సంతోషించకపోగా 'ఇవన్నీ ఎందుకట? బియ్యం వంటికి మంచిది కాదు. వేపుళ్ళు మానేశాం. రవ్వ నిలవుంటే పురుగు పడ్తుంది..' అంటూ ప్రతిదానికీ వంకలుపెట్టింది. అందుకు వేలకువేలు ఖర్చుపెట్టిన మామగారెలా స్పందించారు? సంప్రదాయ అత్తగారు, ఆధునిక కోడళ్ళ కథను ఆసక్తికరంగా చిత్రించిన **అరిపిరాల సువర్ణ** నవలిక **తరాలు.. అంతరాలు**

✸ **నవలావలోకనం**లో ఈనాటి స్త్రీ స్వతంత్ర భావజాలానికి ఏభై ఏళ్ల క్రితమే పునాది వేసిన **నందుల సుశీలాదేవి** సరళమైన **సరళీ స్వరాలు** నవలపై సమీక్ష.

